ఏకామ్రనాథుని

# ప్రతాపరుద్ర చరిత్రము



సంపాదకుడు

డా॥ సి. వి. రామచంద్రరావు









ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

ఏ కా మ్ర నా థు ని

# ప్రతాపరుద్ర చరిత్రము



స ం పా ద కు డు

డా॥ సి. వి. రామచంద్రరావు






ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - [illegible]
హైదరాబాదు-4

PRATAPARUDRA CHARITRA: A Prose work containing the History of Kakatiya Dynasty by Ekamranatha of 16th century A. D. -Edited by Dr. C. V. Ramachandra Rao, Reader in History, V. R. College, Nellore

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాద్-500 004

ప్రచురణ : 352

ప్రథమ ముద్రణ : 1984

ప్రతులు : 2000



వెల : రూ. 5-50

ప్రతులకు :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాద్-500 004.



ముద్రణ :

సహజ ప్రింటర్స్,
1-7-166, బాకారం, ముషీరాబాద్,
హైదరాబాద్-500 048.

# తొలి పలుకు

సువిశాలమైన తెలుగునేలను ఒక గొడుగు క్రిందికి తెచ్చి, తెలుగు సంస్కృతిని నూత్నాలంకృతులతో కైసేసిన కాకతీయ రాజన్యులు గణపతిదేవ చక్రవర్తి, రుద్రమదేవి, ప్రతాపరుద్రదేవ చక్రవర్తి. ఈ మహితాత్ముల చరిత్రనూ, వంశోత్పత్తినీ, వంశానుచరితాన్నీ, అభ్యుదయాన్నీ, పరిపాలన క్రమాన్నీ, ప్రజానురంజనాన్నీ, తెలుగు ప్రజలకు తెలియ జేయడానికి వెలువడిన మొట్టమొదటి వచనరచన ఏకామ్రనాథుని "ప్రతాపరుద్రచరిత్రం"

దేశచరిత్రకూ, సాంఘికచరిత్రకూ, భాషాచరిత్రకూ విలువైన అంశాలను అందిస్తున్న ఈ గ్రంథానికి సంపాదకత్వం వహించి, విజ్ఞానప్రదమైన పీఠికను సమకూర్చి అకాడమీతో సహకరించిన డా. సి. వి. రామచంద్రరావుగారికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

హైదరాబాదు
తేది. 12-1-1984

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

# అనుక్రమణిక

# విషయసూచిక

# ప్రతాపరుద్ర చరిత్ర

## పీఠిక

### ప్రతాపరుద్ర చరిత్ర తొలి తెలుగు చారిత్రక వచన రచన

అప్రతిహత "విక్రమచక్రు"లై, "చలమర్తిగండ" బిరుదాంకితులై, "దాయగజకేసరు"లై, కాకతీయవంశ మండనులై యావదాంధ్రదేశాన్ని నూట ఇరువై అయిదేండ్లు (క్రీ.శ. 1199-1323) అవిచ్ఛిన్నంగా పరిపాలించి, తెలుగు జాతి చరిత్రలో స్వర్ణాధ్యాయాన్ని సృష్టించి, తెలుగువారి రాజకీయ సాంస్కృతిక జీవన చైతన్యానికి నిత్యదీప్తమయిన ప్రతీకలుగ నిలచిన అచ్చ తెలుగు చక్రవర్తులు గణపతిదేవుడు (క్రీ.శ. 1199-1262), రుద్రమదేవి (క్రీ.శ. 1262-1289), ప్రతాపరుద్రుడు (క్రీ.శ. 1289-1323). గణపతి దేవునికి వెయ్యేండ్లకు పూర్వం, ఆంధ్రులయిన శాతవాహన వంశజుల పరిపాలన (క్రీ.పూ. 271-174)లో, "అప్రతిహతి చక్ర", "దాక్షిణాపథపతి" బిరుదాలు వహించిన రెండవ శాతకర్ణి (క్రీ.పూ. 184-128) కాలంలో, "త్రిసముద్రతోయ పీతవాహను"డని పేర్కొనబడ్డ గౌతమీపుత్ర శ్రీ శాతకర్ణి కాలంలో, దక్షిణా పథాన్నంతా విస్తరించినవారి సువిశాలసామ్రాజ్యంలో ఒక ప్రధాన భాగంగా యావదాంధ్ర దేశం రాజకీయ ఐక్యతను అనుభవించింది; మరలా అట్టి ఐక్యతను ఆంధ్రదేశాని కందచేసినవాడు కాకతీయగణపతి దేవ చక్రవర్తి; దానిని బలిష్ఠము కావించినది రుద్ర (మ) దేవ చక్రవర్తి; దానిని పెంపొందించి కొనసాగించినవాడు ప్రతాపరుద్రదేవచక్రవర్తి. తెలుగు వారికి ప్రాతఃస్మరణీయులు, మహనీయులును అయిన ఈ కాకతీయ చక్రవర్తుల మహోజ్జ్వల చరిత్రను, వంశోత్పత్తిని, వారి పూర్వీకుల క్రమాభివృద్ధిని, వారి

వైభవప్రాభవాలను, పరిపాలనాశయాలను, ప్రజారంజకత్వాన్ని తెలుగువారికి తెలియ చెప్పడానికి ప్రయత్నించిన తొలి తెలుగు చారిత్రకవచనరచనే ప్రతాపరుద్ర చరిత్ర.

## ఏకామ్రనాథుడు-ప్రథమాంధ్ర చరిత్రకారుడు

ఖగోళశాస్త్రం మొదలు కామశాస్త్రంవరకు అన్ని శాస్త్ర, సాహిత్య ప్రక్రియలలో మౌలికము, ప్రామాణికము అయిన రచనలు చేసిన ప్రాచీన భారతీయులు, కారణమేదైనా, శాస్త్ర నిబద్ధమయిన, ప్రామాణికమైన చరిత్ర రచన చేయలేదు. ముస్లిములయిన అరబ్బులు క్రీ.శ. 712లో సింధు దండయాత్రతో భారతదేశంలో అడుగుపెట్టేంతవరకు, మనం తెలుసుకోగలిగిన (ప్రాచీన) భారతదేశ చరిత్ర మతవాఙ్మయమైన పురాణాలలో, బౌద్ధ, జైనమత గ్రంథాలలో, కవులకావ్య పీఠికలలో ఇమిడి, "గడ్డివామిలో సూది"వలె వెదకి బయటకు తీయవలసిన విషయమై పోయింది; శాస్త్రీయ నిర్వచనానికి సరిపోయే చారిత్రక రచన అంటూ లేకపోయింది. క్రీ.శ. పదకొండో శతాబ్దంలో, మహా విజేత అయిన మహమ్మద్ ఘజ్నీ వెంబడి భారతదేశానికి వచ్చి, సంస్కృతభాషా పాటవం సంపాదించి, భారతీయ శాస్త్ర, సారస్వత గ్రంథాలను, సంఘజీవనాన్ని అవలోడనంచేసి, భారతీయ విజ్ఞాన సర్వస్వమనదగిన "కితాబ్-ఉల్-హింద్" అనే గ్రంథాన్ని రచించిన అల్-బెరూని, భారతీయుల చారిత్రకస్పృహా దారిద్ర్యాన్ని గూర్చి ఇట్లా అంటాడు:

"The Hindus do not pay much attention to the historical order of things; they are very careless in relating the chronological succession of things; and when they are pressed for information and are at a loss not knowing what to say, they invariably take to tale-telling" (Sachau (Tr), Alberuni's India, Vol. II, p. 10)

ఈ అభిప్రాయానికి మినహాయింపుగా, క్రీ.శ.12వ శతాబ్దంలో కల్హణుడు, నాటికి తనకు లభ్యమయిన పురావస్తు, శాసన, సారస్వత ఆధారాలన్నీ పరిశీలించి, ఆధునిక శాస్త్రీయ పరిశోధనా పద్ధతులకు, చరిత్ర నిర్వచనానికి సన్నిహితంగ కాశ్మీర దేశ చరిత్ర అయిన "రాజతరంగిణి"ని క్రీ. శ. 1149-50 లో రచించాడు; కాని కల్హణుడుకూడా తనచరిత్ర రచనలో కొన్నిఅతిమానుష, అద్భుత వృత్తాంతాలను, అభూత కల్పనలను, అతిశయోక్తులను ప్రవేశపెట్టి, ఉత్తమ చారిత్రక గ్రంథ లక్ష్యాలను కొంత కించపరిచాడు. అయినప్పటికీ, ప్రాచీన భారతంలో, సంస్కృతంలో రచించిన తొలి చారిత్రక పద్యకావ్యం, కల్హణుని రాజతరంగిణే. కల్హణునికి ముందు "చరిత్ర"లనే పేరుతో కొన్ని సంస్కృత గద్యకావ్యాలు వెలిశాయి. వీనిలో చెప్పుకోదగ్గవి క్రీ.శ. ఏడవ శతాబ్దంలో "సకలోత్తర పథనాథు"డయిన హర్షచక్రవర్తిని గూర్చి అతని బాల్యసఖుడు, సహాధ్యాయి, ఆస్థాన విద్వాంసుడు అయిన భట్టబాణుడు రచించిన హర్షచరిత్ర, క్రీ.శ. పదకొండవ శతాబ్దంలో కల్యాణ చాళుక్య చక్రవర్తి ఆరవ విక్రమాదిత్యుని (క్రీ.శ. 1076-1126) గూర్చి కాశ్మీర సంస్కృత మహాకవి బిల్హణుడు రచించిన విక్రమాంక దేవచరిత్రము. ఈ చారిత్రక గద్యకావ్యాలను రచించినవారు ఆ కావ్యనాయకులకు సమకాలీనులయినప్పటికీ, కావ్యనాయకులు సుప్రసిద్ధ చారిత్రక వ్యక్తులయినప్పటికి, వీనిలో చారిత్రక కథనము అత్యల్పము, కావ్యకల్పన అనల్పము.

క్రీ.శ. 712లో అరబ్బులు సింధుదేశాన్ని జయించడంతో ప్రారంభమయి, తరువాత వచ్చిన ముస్లిం దండయాత్రల ఫలితంగా, భారతదేశంలో క్రీ.శ. 1206 నాటికి ముస్లిం అధికారం స్థిరమయ్యింది. ఫలితంగా అరాబిక్, పర్షియన్ భాషలలో, భారతదేశంలోని ముస్లిం పరిపాలకులకు సంబంధించిన చారిత్రక వృత్తాంతాలను ముస్లిం చరిత్రకారులు సమకూర్చారు. ముస్లిం చరిత్రకారులు తమ చరిత్రలలో తమ సుల్తానులనుగూర్చి కొంత పాక్షికంగా, అతిశయంగా, వ్రాసినప్పటికి, వానిలో అభూతకల్పనలకు, అతిమానుషవిషయాలకు, అద్భుత వృత్తాంతాలకు తావీయలేదు. కాని హిందూరాజులకు సంబంధించి, కల్హణుని "రాజతరంగిణి" తర్వాత చరిత్ర అని అన్నివిధాలా చెప్పదగ్గ గ్రంథమేదీ సంస్కృత భాషలోగాని, మరి దేశ భాషలలోగాని వ్రాయడం జరుగలేదు.

ఆధునికయుగం వరకు చరిత్ర గ్రంథాలు వ్రాయడాని కెవ్వరూ తలపెట్టలేదు. కనుక, మన పూర్వులకు, కారణమేదైనా, చారిత్రక స్పృహ, దృష్టి లోపించాయనే సత్యాన్ని ఒప్పుకొన్నప్పుడు, సంపూర్ణంగా చరిత్ర నిర్వచనా లక్షణాలకు సరిపడే రచన కాకపోయినా, దాని దరిదాపులకు రాగల గ్రంథమేదైనా, భారతీయ చరిత్ర రచనాకాశాన్నావరించిన గాఢాంధకారంలో వెలుగురేఖై తోస్తుంది; యావద్భారత దేశానికి రాజభాష, పండితభాషగా ఉన్న దేవభాషలోనే చరిత్ర రచన మృగ్యమైనప్పుడు, దేశభాషలలో అట్టి ప్రయత్నమేదైనా జరిగిఉంటే, అది చరిత్ర రచనాకాశంలో వెలుగురేఖగానేకాదు, వెలుగురేడై కూడా వెలయకలదు. అట్టి ఒక చరిత్ర రచనా ప్రయత్నాన్ని తెలుగుభాషలో తొలిసారిగాచేసి కృతకృత్యుడైన ప్రథమాంధ్ర చరిత్రకారుడు ఏకామ్రనాథుడు. అతని ప్రయత్న ఫలితమే తొలి తెలుగు చక్రవర్తులు, తెలుగుజాతి వెలుగులు అయిన కాకతీయ రాజన్యులకమనీయ, "పుణ్య" చరిత్రగా రూపొందిన ప్రతాపరుద్రచరిత్ర.

## ఏకామ్రనాథుని గుర్తింపు, ఉనికి, మనికి

తెలుగుభాషలో తొలి చరిత్రకారుడైన ఈ ఏకామ్రనాథుడు ఖచ్చితముగా గుర్తింప వీలుకానివ్యక్తి. ఇతని గుర్తింపు, ప్రతాపరుద్ర చరిత్రలోని కొన్ని విషయాలు ఆధారంగా ఊహాపోహలపై ఆధారపడింది. ఏకామ్రనాథుడు ప్రతాపరుద్ర చరిత్ర రచనను ఇలా ప్రారంభించాడు: "శ్రీ సర్వదేవతా మయుండును శ్రీ శంభులింగంబునగు నీశ్వరుని బూజించి నాగనాథుని యడుగులకు మ్రొక్కి ఏకామ్రనాథుండను వాఁడొక పుణ్యకథను నిటుల వచింప నారంభించె". ఇచట ఏకామ్రనాథుడు పూజించిన శంభులింగంబు కాకతీయుల ఆరాధ్యదైవమైన స్వయంభూదేవ లింగమే అయిన, ఏకామ్రనాథుడు ఓరుగంటి (వరంగల్లు)వాడనో లేక ఆ మండలమందలి వాడనో తలచాలి. కాని ఈ విషయం అవును, కాదు, అని చెప్పడానికి ఎట్టి ఆధారాలు లేవు. అంతేగాక ఇచట ఏకామ్రనాథుడు చేసిన పూజ మానసిక పూజ అయి ఉండవచ్చు. కాని ఇంత భక్తిశ్రద్ధలతో కాకతీయుల చరిత్రాన్ని వ్రాయడానికి పూనుకొన్న ఏకామ్రనాథుడు ఓరుగంటి వాడో లేక ఆ మండలంవాడో అయి ఉంటాడనుకోవడం అసమంజసంకాదు. ఏకామ్రనాథుడు ప్రతాపరుద్ర చరిత్ర తప్ప, మరే రచన చేసినట్లులేదు.

# ఏకామ్రనాథుని గురువు నాగనాథుడు

ఈశ్వరపూజ తర్వాత ఏకామ్రనాథుడు నాగనాథుని అడుగులకు మ్రొక్కి తన రచన నారంభించాడు. ఈ నాగనాథుడు తన గురువని స్పష్టంగా చెప్ప లేదు; సందర్భాన్నిబట్టి నాగనాథుడు ఏకామ్రనాథుని గురువయి ఉండవచ్చునను కొంటున్నాము. రచయితలు తమ గురువునో, ఇష్టదైవాన్నో, లేక ఇద్దరినో స్మరించి, స్తుతించి తమ రచనలను ప్రారంభించుట సంప్రదాయం. కాని ఈ నాగ నాథుడు కూడా ఏకామ్రనాథునివలె అజ్ఞాతవ్యక్తి అయినందువల్ల, ఇతని గుర్తింపు కూడా ఊహాపోహలమీద ఆధారపడినదే. ఆంధ్రవాఙ్మయ చరిత్రలో పశుపతి నాగనాథుడొకడున్నాడు. ఏకామ్రనాథుడు పేర్కొన్న నాగనాథుడు ఈ పశుపతి నాగనాథుడై ఉండవచ్చును అని ఒక ఊహ. ప్రతాపరుద్ర చరిత్రలోని అంతః సాక్ష్యాలు ఆధారంగా నిర్ణయించగల దాని రచనాకాలం ఆంధ్రసాహిత్యచరిత్ర కారులు నిర్ణయించిన పశుపతి నాగనాథుని కాలానికి దరిదాపులలోఉంటే, ఏకామ్ర నాథుని గురువైన నాగనాథుడు పశుపతి నాగనాథుడే అయి ఉంటాడనడానికి అభ్యంతరం ఉండబోదు. కాని అట్టి సమన్వయం కుదరదు.

పశుపతి నాగనాథుడు సంస్కృతంలో మదనవిలాసభాణము, తెలుగులో విష్ణుపురాణము రచించాడని తెలుస్తుంది. విష్ణుపురాణాన్ని తెనిగించినవారిలో నాగనాథుడే మొదటివాడు; కాని నాగనాథుని విష్ణుపురాణం నేటికీ అలభ్యం. పేరునుబట్టి పశుపతి నాగనాథుడు శైవుడనుకోవాలి. నాగనాథుడు శైవుడైనప్ప టికీ, విష్ణుపురాణం వ్రాయడంచేత, అతడు పాల్కురికి సోమనాథాదులవలె వీర శైవుడుగాక, బమ్మెరపోతన, ఎర్రాప్రెగడలవలె సామాన్య శైవుడై ఉండవలె. సాహిత్యచరిత్రకారులు ఈ నాగనాథుని రాచకొండ వెలమ ప్రభువైన అనపోతనాయని (క్రీ.శ. 1361-1384) అయ్యనవోలు శాసనంలో, దాని రచయితగా, "ఇతి శ్రీ కౌశిక బ్రహ్మర్షి గోత్రజనునా పశుపతి పండిత పుత్రేణ నాగనాథకవినాలిఖిత మిదం శాశ్వతప్రతిష్ఠమస్తు", అని వర్ణింపబడ్డ నాగనాథునిగా గుర్తించారు. అయ్యనవోలు శాసనం శాలివాహనశకం 1291 (క్రీ.శ. 1369)లో వ్రాయబడింది. అందుచేత పశుపతి నాగనాథుడు క్రీ. శ. 14వ శతాబ్దంలో, కాకతీయ సామ్రాజ్య పతనం (క్రీ.శ. 1323) తర్వాత

యాభై ఏండ్లయినా బ్రతికి ఉండాలి. ప్రతాపరుద్రుని కాలం (1289-1323)లో కూడా బాలుడుగానో, యువకుడుగానో ఉండవచ్చు. ఈ నాగనాథుడే ఏకామ్రనాథుడు పేర్కొన్న నాగనాథుడయితే, నాగనాథఏకామ్రనాథుల మధ్య అంతరము 50 ఏండ్లనుకొన్నను, ఏకామ్రనాథునికాలం క్రీ.శ. 1369 + 50 = క్రీ.శ. 1419 అవుతుంది. కాని ప్రతాపరుద్ర చరిత్రలో విజయనగరచక్రవర్తి నరసింహరాయలను పేర్కొని ఉండడంచేత, ప్రతాపరుద్ర చరిత్ర పేర్కొన్న ఈ వీరనరసింహరాయలు, సాళువ నరసింహరాయలు (క్రీ.శ. 1485-1490) అయినా, లేక కృష్ణదేవరాయల సోదరుడు వీరనరసింహరాయలు (క్రీ.శ. 1506-1509) అయినా, అది క్రీ.శ. పదహారవ శతాబ్దం ప్రథమ పాదానికి ముందు వ్రాసి ఉండడానికి వీలులేదు.[1] అంటే పశుపతి నాగనాథునికి, ఏకామ్రనాథునికి మధ్య, అయినవోలు శాసనకాలం (క్రీ.శ. 1369) నుండి లెక్కవేసినా, సుమారు 150 ఏండ్ల (క్రీ.శ. 1525-1369 = 156) అంతరం ఏర్పడుతుంది. అందుచే ఏకామ్రనాథుడు పేర్కొన్న నాగనాథుని అయినవోలు శాసనకర్త అయిన పశుపతి నాగనాథునిగా గుర్తించడానికి వీలులేదు. ఏకామ్రనాథుడు పేర్కొన్న నాగనాథుడు నేటికి గుర్తించడానికి వీలుకాని వ్యక్తి.

## ప్రతాపరుద్రచరిత్ర రచనాకాలము

ప్రతాపరుద్ర చరిత్రలోఏకామ్రనాథుడు ఆంధ్రదేశ చరిత్రలో [illegible] చరిత్రలో ప్రసిద్ధులైన వ్యక్తులను, కొందరిని,కాకతీయప్రతాపరుద్రుని కాలానికి (క్రీ.శ.1289-1323) తర్వాత ఉన్నవారిని కొందరినిపేర్కొని,వారిఘనకార్యాలను గూర్చి తాను, ఒప్పుగానో, తప్పుగానో, తెలుసుకొన్నవిషయాలను మనకు అందించాడు. ఇతడు చెప్పిన ఈ విషయాలు, కొన్ని, మనకు శాసనాది ఇతర ఆధారాలవల్ల నిర్ధారితమైన కొన్ని చారిత్రకసత్యాలకు విరుద్ధంగా, కాలవ్యతిరిక్తంగా, పూర్వాభవిష్యకథనాలు (anachronisms) గా ఉన్నాయి. ఏకామ్రనాథుడు పేర్కొన్న ఈ చారిత్రక వ్యక్తుల, వారికి సంబంధించిన సంఘటనల [illegible] చేయగలిగితే దానినిబట్టి ఏకామ్రనాథునికాలాన్ని, ప్రతాపరుద్ర చరిత్ర రచనా కాలాన్ని నిర్ణయించిడానికి సాధ్యమవుతుంది.

ఏకామ్రనాథుడు చెప్పిన ఇట్టి విషయాలలో ఒకటి, కాకతీయ రాజైన భువనైకమల్లుడు, దక్షిణదేశం బేలు వీరనరసింహరాయని నగరమైన విజయనగరమును ముట్టడించి, అందుప్రవేశించగా, వీరనరసింహుడు అతనికి లొంగిపోయి, తన చెల్లెలైన శ్రీరంగమదేవినిచ్చి పెండ్లి చేయుట. భువనైకమల్లుని తండ్రి అయిన ఎఱుకదేవరాజుకూడా, "చతురంగ బలంబుతో విజయనగరంబుపై వెడలి యా రాష్ట్రం బేలు వీరనరసింహరాయల గెలిచి యతనిచే నప్పనంబులు గైకొని" నట్లు ప్రతాపరుద్రము చెప్తుంది. అంతేగాక, భువనైకమల్లుని చర్యకు ప్రతీకారంగా, వీరనరసింహుని కుమారుడైన వేంకటనాథుడు హనుమకొండపై దండెత్తినట్లు, భువనైకమల్లుడు అతనిని శాంతపఱచి, గౌరవించి, తన కూతురైన పాంచాలినిచ్చి పెండ్లిచేసినట్లు కూడా తెలుపుతుంది. భువనైకమల్లుడు శాలివాహన శకం 792 (క్రీ.శ.870) నుండి శాలివాహనశకం 818 (క్రీ.శ.896) వరకు ఇరవై ఆరేండ్లు రాజ్యం పాలించినట్లు ప్రతాపరుద్ర చరిత్ర తెలుపుతుంది. ఈ భువనైకమల్లుని, కాకతీయ శాసనాలవల్ల మనకు తెలియవచ్చిన కాకతీయ పాలకులలో, మొదటి ప్రోలరాజు (క్రీ.శ.1052-1076) గా, అతని తండ్రి అయిన ఎఱుకదేవరాజును మొదటి బేతరాజు(క్రీ.శ.1000-52)గా గుర్తించడానికి వీలవుతుంది.[2] ఈ భువనైకమల్లుని కాలంలోనే గాకుండ కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి కాలంలో కూడా, ప్రతాపరుద్రునికి ఢిల్లీసుల్తానుకు మధ్య జరిగిన యుద్ధాలలో, విజయనగర పాలకుడైన నరపతి రాయలు, అతనికి ఎనలేని సహాయం చేసినట్లు. దానికి కృతజ్ఞతగా ప్రతాపరుద్రుడు, తాను స్వర్గస్థుడయ్యే దానికి కొంతముందుగా, తన కూతురైన రుద్రమహాదేవిని నరపతి రాయలకిచ్చి పెండ్లిచేసి, 5 కోట్ల సువర్ణంబులు కృష్ణానది మేరగా దక్షిణదేశము అరణముగా ఇచ్చినట్లు, ప్రతాపరుద్ర చరిత్ర తెలియజేస్తుంది. ప్రతాపరుద్రుడు, శాలివాహన శకం 1205 (క్రీ.శ.1283) నుండి శాలివాహనశకం 1282 (క్రీ.శ.1360)/ 1291 (క్రీ.శ.1369) వరకు పాలించినట్లు ప్రతాపరుద్ర చరిత్ర చెప్తుంది. కాకతీయ రాజులు మొదటి బేతరాజు కాలంనుండి ప్రతాపరుద్రుని కాలంవరకు విజయనగర పాలకులతో సంబంధ బాంధవ్యాలు కలిగి ఉన్నట్లు ప్రతాపరుద్ర తెలియజేస్తుంది.

విజయ (విద్యా) నగర నిర్మాణం శ్రీ విద్యారణ్య మునీంద్రుల ప్రోత్సాహంతో క్రీ.శ. 1336 లో మొదటి హరిహర రాయలు (క్రీ.శ. 1335/6-1353) ప్రారంభించినాడనేది పరిశోధనా ఫలితంగా చరిత్ర కారులంగీ కరించిన సత్యము. కాకతీయ ప్రతాపరుద్రుని కాలం (క్రీ.శ. 1289-1323) తర్వాత ఉండిన ఏకామ్రనాథుడు, అతని లెక్క ప్రకారమే, ప్రతాపరుద్రునికి నాలుగు వందల ఏండ్లముందున్న భువనైమల్లుడు, విజయనగరం ఏలే వీరనరసింహ రాయలపై దండెత్తి పోయినాడని చెప్పి చరిత్రకు తీరని అపచారం చేశాడు. ఇట్లా వ్రాయడంలో ఏకామ్రనాథుని ఉద్దేశం, కాకతీయ రాజన్యుల ధైర్యశౌర్యాలను అతిశయింప చేయడం అయి ఉండవచ్చు, కాని ఇట్లా వ్రాయడం, చరిత్ర కారుడుగా, అతడు చేసిన క్షమింపరాని నేరం.

విజయనగర చరిత్రలో ముగ్గురు వీరనరసింహులు ఉన్నారు. ఒకడు సాళువ వీరనరసింహుడు (క్రీ.శ. 1485-1490): రెండవవాడు సాళువవీర నరసింహుని కుమారుడు ఇమ్మడి నరసింహుడు (క్రీ.శ. 1490-1506): ఇతడు బాలుడయినందు వల్ల, ఇతని కాలంలో శ్రీకృష్ణదేవరాయల తండ్రి అయిన నరసానాయకుడు రాజ్యాధికారం నెరపాడు; మూడవవాడు ఈ నరసానాయకుని కుమారుడు, కృష్ణదేవరాయల అన్న అయిన వీరనరసింహరాయలు (క్రీ. శ. 1506-1509). ఇతడు సాళువ ఇమ్మడి నరసింహుని క్రీ.శ.1506 లో చంపి, రాజ్యానికి వచ్చి, విజయనగర సింహాసనంపై తుళువ వంశాన్ని స్థాపించాడు. ఈ ముగ్గురు నరసింహులలో ప్రసిద్ధుడు సాళువ నరసింహుడు. ఇతనిని బట్టి, ఇతని తర్వాత వరుసగా రాజ్యమేలిన నరసింహ నామధేయులను బట్టి, విజయనగర సామ్రాజ్యానికి విచ్చేసిన విదేశీయులు, ఆ సామ్రాజ్యాన్ని 'కింగ్ డం ఆఫ్ నర్సింగ' (Kingdom of Narsynga) అనే పేరుతో పిలవడం జరిగింది. ఏకామ్రనాథుడు ప్రతాపచరిత్రలో పేర్కొన్న వీరనరసింహుడు నూటికి తొంబై పాళ్లు, సాళువ నరసింహుడే అయి ఉండాలి. అట్లుకాక కృష్ణదేవరాయల అన్న అయిన వీరనరసింహు డయితే, ఏకామ్రనాథుడు వీరనరసింహుని తర్వాత ఏ కొంతకాలం బ్రతికి ఉన్నా కృష్ణదేవరాయల పేరు విని ఉండకపోడు. ఏమైనా, ఏకామ్రనాథుడు ప్రతాపరుద్ర చరిత్రలో పేర్కొన్న విజయనగర పాలకులె

వరైనా. వారందరూ నరసింహ నామధేయులే కాబట్టి, అతడు ఈ నరసింహుల తర్వాత వచ్చిన విజయనగర రాజులలో ఒక్కరిని పేర్కొనక పోవడాన్ని బట్టి. అతడు ప్రతాపరుద్ర చరిత్రను క్రీ.శ. 1490-1509 ల మధ్య వ్రాసినాడని చెప్పడంలో, విప్రతిపత్తి ఉండబోదు. అంటే అతడు ఆ గ్రంథాన్ని క్రీ.శ.15వ శతాబ్దం చివరి దశకంలోనో, లేక 16వ శతాబ్దం మొదటి దశకంలోనో వ్రాశాడని చెప్పవచ్చు.

పై ప్రతిపాదనను కాదని, ప్రతాపరుద్ర చరిత్ర రచనా కాలాన్ని, ఇంకా ముందుకు పొడిగించగల వ్యక్తుల, సంఘటనల ప్రస్తావన, ఆ గ్రంథంలో ఉంది. కాని ఈ వ్యక్తుల ఈ సంఘటనల గుర్తింపు, వాని కాలనిర్ణయం, పూర్తిగా ఊహాపోహల మీద ఆధారపడి, ఇదమిత్థమని, వానిని గూర్చి గట్టి నిర్ణయాలు చేయడానికి వీలుకావడం లేదు. వానిని ఈ క్రింద చర్చిస్తాం.

1) విజయనగర పాలకులలో, వీరనరసింహరాయలకు వేంకటనాథుడను పేరుగల కుమారుడొక డున్నట్లు, ఏకామ్రనాథుడు చెప్పాడు. విజయనగర చరిత్రలో వీరనరసింహ రాయల కుమారుడైన వెంకటనాథుడనే వాడు లేడనేది అందరికి తెలిసిన విషయం. విజయనగర పాలకులలో 'వెంకట' శబ్దంతో ప్రారంభమయ్యే పేర్లు, ఆరవీటివంశం వారిలో ఉన్నాయి. తుళువ వంశం వారిలో, కృష్ణదేవరాయల తమ్ముడైన అచ్యుత దేవరాయల కుమారుడు వెంకటపతి రాయలు ఒకడున్నాడు; కాని ఇతడు, బాలుడుగా ఉన్నపుడే చంప బడ్డాడు. అందుచే ప్రతాపరుద్ర చరిత్ర పేర్కొన్న వేంకటనాథుడు, ఆరవీటి వంశంలో ఇట్టి నామ సామ్యంగల మొదటి రాజు, (రెండవ) వెంకటపతి దేవ రాయలు (క్రీ.శ. 1586-1614) అయి ఉండవచ్చు.

2) ప్రతాపరుద్ర చరిత్ర కటక పాలకుడుగా ముకుందసుందరుడనే వాడిని పేర్కొంది. ఈ కటకం నేటి ఒరిస్సాలోని కటక్. క్రీ.శ. 1560 నుండి 1568 వరకు, కళింగోత్కళాలను, కటకం రాజధానిగా తెలుగువాడయిన బాహుబలేంద్ర ముకుంద గజపతి అనేవాడు పరిపాలించాడు. కొంత నామ సామ్యాన్ని బట్టి, ప్రతాపరుద్ర చరిత్ర పేర్కొన్న ముకుంద సుందరుడు, ఈ ముకుంద గజపతి (క్రీ.శ. 1560-1568) అయి ఉండవచ్చు.

3) ప్రతాపరుద్రునికి వీరభద్రుడనే కుమారుడున్నట్లు ప్రతాపరుద్ర చరిత్ర తెలుపుతుంది. కాని ప్రతాపరుద్రునికి వీరభద్రుడనే కొడుకున్నట్లు తెలిపే ఇతర ఆధారాలేమీలేవు. క్రీ.శ. 1497 నుండి 1548 వరకు రాజ్యంచేసి, కళింగోత్కళాలనేగాక, తీరాంధ్రాన్ని, తూర్పుతెలంగాణాలను పాలించిన గజపతి ప్రతాపరుద్రునికి వీరభద్రుడనే ఒక కుమారుడున్నాడు. ఇతడు కొండవీటి దుర్గ పాలకుడుగా ఉండినాడు. క్రీ.శ. 1515లో కృష్ణదేవరాయలు ఈకొండవీటిని జయించి, వీరభద్రుని పట్టుకున్నాడు; తర్వాత ఇతడు కొంతకాలం కృష్ణదేవ రాయల కొలువులో ఉన్నట్లుకూడా తెలుస్తుంది. ప్రతాపరుద్రచరిత్ర, వీరభద్రుడు సుల్తానుపెట్టే బాధలు తాళజాలక, కొండవీడు కడనున్న రాయల వద్ద కేగినట్లు చెప్తుంది. దీనినంతాబట్టిచూస్తే, ఏకామ్రనాథుడు, ప్రతాపరుద్రగజపతి తనయుడైన వీరభద్రుడిని గూర్చివిని, అతనిని కాకతీయ ప్రతాపరుద్రుని తనయుడిగా చిత్రించి నట్లున్నాడు.

4) ప్రతాపరుద్రచరిత్ర, ప్రతాపరుద్రుడు తనకూతురు రుద్ర(మ)దేవిని, విజయనగర పాలకుడైన నరపతిరాయలకిచ్చి పెండ్లిచేసి, "6 కోట్ల సువర్ణం బులును కృష్ణానది మేరగా దక్షిణదేశం బరణంబిచ్చి" పంపిన విషయం పైన పేర్కొన్నాము. ఇలాటి సన్నివేశం దక్షిణభారతదేశచరిత్రలో ఒకటేఒకటి ఉంది. అది ప్రతాపరుద్రగజపతి, కృష్ణదేవరాయల చేతిలో ఓడి, అతనికి తన కూతురునిచ్చి వివాహంచేసి, కృష్ణకు దక్షిణంగా ఉన్న దేశమంతా, రాయలకు దత్తంచేశాడు. ఇది క్రీ.శ. 1516 - 17లో జరిగింది.

5) ఆంధ్ర సాహిత్యచరిత్రలో ప్రసిద్ధులైన వ్యక్తులలో, ప్రతాపరుద్రునికి సమకాలంలో ఉన్నవారిలో, ఏకామ్రనాథుడు మొల్లను పేర్కొన్నాడు. కాని ఈమొల్ల రామాయణం వచన కావ్యంగా వ్రాసిందని చెప్పాడు. దీనినిబట్టి, ఏకామ్ర నాథుడు మొల్లపేరు విన్నాడు కాని, ఆమె కావ్యాన్నిగూర్చి అతనికి సరిగా తెలిసినట్లులేదు. మొల్ల తన రామాయణమందలి పూర్వకవిస్తుతిలో, పదిహేనవ శతాబ్దంవాడైన శ్రీనాథుని పేర్కొని ఉండడంచేత, ఏట్టిపరిస్థితిలోను, మొల్ల ప్రతాపరుద్రుని కాలంలో ఉండడానికి వీలులేదు. మొల్ల పదహారవ శతాబ్దం పూర్వార్థంలో కృష్ణదేవరాయలకాలం క్రీ.శ. (1509 - 1530) లోనో, లేక

కృష్ణదేవరాయల తర్వాత, ఆ శతాబ్దం ఉత్తరార్ధంలోనో ఉన్నట్లు విమర్శకులు భావించారు.[3]

6) ఈ పై చెప్పిన ప్రతాపరుద్ర చరిత్రలోని అంతఃస్సాక్ష్యాలుగాక, దాని రచనాకాలనిర్ణయానికి, ప్రతాపరుద్రచరిత్ర తర్వాత వ్రాసిన మరొక తెలుగు చారిత్రక వచనకావ్యం, "రాయవాచకం" కొంత ఉపయోగపడుతుంది. రాయవాచకాన్ని విశ్వనాథనాయనయ్య వారి స్థానాపతి వ్రాశాడు. దానిలోని అంతఃస్సాక్ష్యాలు ఆధారాలుగా, దానిని క్రీ.శ. 1592 - 1602 లమధ్య వ్రాసి ఉండవచ్చునని, స్థూలంగా దాని రచనాకాలాన్ని నేను నిర్ణయించాను.[4] రాయవాచకంలో "ఢిల్లీలోనున్న ప్రతాపరుద్రుని వృత్తాంతము" అనే ఒక శీర్షిక ఉంది. రాయవాచక కర్త ఈవృత్తాంతాన్ని, ప్రతాపరుద్ర చరిత్రలోని "సుల్తాను ప్రతాపరుద్రుని గౌరవించుట" అనే అంశంక్రిందఉన్న విషయాన్నిచూచి వ్రాసిఉండవచ్చునని చెప్పడానికి అవకాశంఉంది.[5]

పైచర్చలోని వివిధాంశాలనుబట్టి, ఏకామ్రనాథుడు కృష్ణదేవరాయల కాలంలో, అటుతర్వాతకూడా చాలాకాలం ఉండి, ప్రతాపరుద్ర చరిత్రను రచించాడని చెప్పడానికికూడ అవకాశంఉంది. కాని కృష్ణదేవరాయల కాలంలోకాని అటుతర్వాతకాని, ఎంతవరకు ప్రతాపరుద్రరచనాకాలాన్ని తీసుకవెళ్లవచ్చుననే విషయం, పైనచెప్పిన విషయాలనంతా సమీక్షించి, ఎవరికి వారు నిర్ణయించుకోవలసి ఉంటుంది. దీనినిరెండవ వెంకటపతిదేవరాయలకాలం (క్రీ.శ. 1586 - 1614) వరకు తీసుకొనిపోవచ్చు. కాని ఇట్లాచేయడంలో ఒక చిక్కును విడదీయాలసి ఉంటుంది. ఏకామ్రనాథుడు కృష్ణదేవరాయలకాలం (క్రీ.శ. 1509 - 1530) తర్వాత చాలకాలం ఉన్నవాడయితే, విజయనగర చరిత్రలో సుప్రసిద్ధులైన కృష్ణదేవరాయలనుకాని, అతని తర్వాత వచ్చిన అచ్యుతదేవ రాయలనుకాని, సదాశివరాయలనుకాని, అళియరామరాయలనుకాని పేర్కొనక విజయనగర రాజులలో నరసింహ నామధేయులనుమాత్రం పేర్కొనడానికిగల కారణం మనం చెప్పాలసి ఉంటుంది. అందుచే మనం ప్రస్తుతానికి, ప్రతాపరుద్ర చరిత్రను ఏకామ్రనాథుడు పైనచెప్పినట్లు క్రీ.శ. 1409 - 1509 లమధ్య అంటే, పదిహేనవ శతాబ్ది చివరిదశకంలోనో, పదహారవశతాబ్దం ప్రథమదశకంలోనో

వ్రాశాడని అనుకోవాలి. ఇంతకన్నా సూక్ష్మంగా దాని రచనాకాలాన్ని తెల్పడానికి ఆధారాలు లేవు.

ప్రతాపరుద్ర చరిత్రలోని భాషకూడా పైకాలనిర్ణయాన్ని కొంత బల పరుస్తుంది. పదహారవ శతాబ్దం చివర వ్రాసినదని భావించబడే రాయవాచకంలో సుమారు యాభైదాకా పారసీపదాలు ఉన్నాయి.[6] ప్రతాపరుద్రచరిత్రలో "సుల్తాను", "సరదార్లు" అనే రెండు పారసీపదాలే కనిపిస్తాయి. దక్షిణభారత దేశంలో, ఆంధ్రదేశంలో, కృష్ణదేవరాయల తర్వాత, ముఖ్యంగా రాక్షస తంగడియుద్ధం (క్రీ.శ. 1565) తర్వాతనే, ముస్లిములతో సంపర్కం, వారి ప్రాబల్యము ఎక్కువయి, తెలుగు భాషలో పారసీపదాలు ఎక్కువగా చోటు చేసుకొన్నాయి.

1969లో నరేంద్రనాథ సాహిత్యమండలి, తణుకువారు ప్రచురించిన "ప్రతాపరుద్ర చరిత్రము", ను చదివి, ప్రతాపరుద్ర చరిత్ర రచనాకాలనిర్ణయం చేయ ప్రయత్నించే పరిశోధకులను, ఆ అచ్చుప్రతిలోని ఒకపొరపాటు పూర్తిగా తప్పుదారి పట్టించే అవకాశంఉంది. దీనిలో 79పుట, 17వ పంక్తిలో, ప్రతాప రుద్రచరిత్ర ఏ ఇతం వ్రాత ప్రతులలోకాని, అచ్చు ప్రతులలోకాని లేని టిప్పు సుల్తానుపేరును చేర్చారు. ఇది క్షమింపరాని అచ్చుపొరపాటు. ఈ ఒక్క అచ్చు పొరపాటునుబట్టి, ఏ విమర్శకుడైనా, కొంత అజాగ్రతతో, ఏకామ్రనాథుడు టిప్పుసుల్తానుకాలం (క్రీ.శ. 1782 - 1799) లోనో, అటుతర్వాతనో, ప్రతాపరుద్రచరిత్రను రచించాడని వాదించే అవకాశం ఉంటుంది. ఈ1969 అచ్చుప్రతికి సుదీర్ఘమయిన చక్కని చారిత్రకోపోద్ఘాతంవ్రాసిన శ్రీఖండవల్లి లక్ష్మీరంజనంగారు, ఈవిషయాన్ని ఎందువలననో పట్టించుకోలేదు; పాఠకులను ఈవిషయమై హెచ్చరించలేదు.

## ప్రతాపరుద్రచరిత్ర - చారిత్రకాధారము

ఏకామ్రనాథుడు, ప్రతాపరుద్రచరిత్ర చివర, సింహావలోకనంచేస్తూ, ఇట్లా అన్నాడు: "ఇట్టి పవిత్ర చరిత్రనొక్కసారి తిలకింపుడు. 225 కథలు గలిగి కాకతిరాజుల గ్రమంబున తెలయజెప్పితిని గాంచుడు. తొల్లి 1000సంవ

త్పరంబులు కాకతి రాజులచే నేది పాలించఁబడి సకలైశ్వర్య సిద్ధికరంబై విలసిల్లి యుండునో యా చరిత్ర యాలకింపుడు". గ్రంథ ప్రారంభంలో, "ఏకామ్రబ నాథుండను వాఁడొక పుణ్యకథను నిటులఁ వచింప నారంభించె" అంటాడు. మరొకచోట, ప్రతాపరుద్రుని గూర్చి చెప్తూ, "అతని చరితంబు లాది పురాణాదులట్లు సకలా నందంబై యుండును" అంటాడు. ఈ వాక్యాలు, చారిత్రక గ్రంథ రచయితగా ఏకామ్రనాథుని దృష్టిని మనకు తెలియచేస్తాయి. అతడు కాకతీయుల చరిత్రను ఒక పుణ్యకథగా, దానిని చెప్పడం ఒక పుణ్య కార్యంగా భావించాడు. ఆ చరిత్ర పురాణాదులవలె ఆనంద దాయకం అన్నాడు. అందుచేతనే గ్రంథం చివర, "ఈ ప్రతాపరుద్రుని చరిత నెవరువిన్నను.జదివినను వ్రాసినను వారికి శివుఁడా చంద్రార్కంబుగఁ బుత్రపౌత్రా ద్యైశ్వర్యంబుల నిచ్చుగాక" అని ఫలశ్రుతి చెప్పాడు. అచ్చు యంత్రాలు లేని కాలంలో, గ్రంథ ప్రచారానికి ప్రతులు వ్రాయడం ఎంతైనా అవసరం కాబట్టి, ప్రతులు వ్రాస్తే పుణ్యమని ప్రోత్సహించాడు. దేశచరిత్ర వ్రాయడమనే ప్రక్రియే తెలియని కాలంలో, తన నాటికి ప్రచారంలో ఉన్న కాకతీయులను గూర్చిన కథలను అనేకం సంతరించి, పరిశీలించి, సమన్వయించి, శక్తివంచన లేక, ఈ ప్రతాపరుద్ర చరిత్రను తెలుగు భాషలోని తొలి చారిత్రక రచనగా ఆంధ్రులకు అందించాడు.

ఏకామ్రనాథుడు తన చరిత్ర రచనకు ఆధారంగా పేర్కొన్న కథలు, నాటికి కాకతీయ రాజులను గూర్చి జన బాహుళ్యంలో ఉన్న జనశ్రుతులయి ఉంటాయి. ఈ జనశ్రుతులనే ఏకామ్రనాథునివంటి జిజ్ఞాసువు గ్రథితంచేసినప్పుడు, అదొక స్థానిక వృత్తాంతంగా రూపొందుతుంది. తననాటికి లభ్యమయిన జన శ్రుతులను, స్థానిక వృత్తాంతాలను సంతరించి, సమీకరించి, తనకుగలిగిన నేర్పుతో సమన్వయించి, ఏకామ్రనాథుడు మనకి ప్రతాపరుద్ర చరిత్రను అందించిన ట్లున్నాడు. ఒక చారిత్రకసత్యం, కొంతకాల వ్యవధి తర్వాత, మనకు జనశ్రుతిగా, స్థానికవృత్తాంతంగాచేరడంలో, ఆచారిత్రకసత్యంచుట్టూ,లేక చారిత్రకవ్యక్తిచుట్టూ, అనేక అద్భుతవృత్తాంతాలు, అభూతకల్పనలు,అతిమానుషవిషయాలు,అతిశయో క్తులు పేరుకొంటాయి. చారిత్రక పురుషులుజనశ్రుతిలో పురాణపురుషులుగా మారి పోతారు. ఇది చరిత్రగతిలో నిత్యం జరిగే విషయమే;నేటికీ మనకళ్ళఎదుటజరుగు

తున్న విషయమే. ఈదృష్టితో చూచినపుడు ప్రతాపచరిత్రలోఅతిమానుష విషయాలు, అభూత కల్పనలు, అద్భుతవృత్తాంతాలు చాలాపరిమితము; హేతువాదదృష్టికి అందే చారిత్రక విషయాలే అధికం. అంతేకాకుండా, ఈ అద్భుత వృత్తాంతాలు, చారిత్రక విషయాలను అర్థం చేసుకోవడానికి అడ్డంగారేవు. కాని ఏకామ్రనాథుడు చెప్పిన చారిత్రక విషయాలలో కొన్ని కాలవ్యతిరిక్తాలు, పూర్వాభవిష్యత్కథనాలు, అసంబద్ధ విషయాలు ఉన్నాయి. ఇటీవలి కాలంలో బయల్పడి, సేకరించబడి, ప్రచురింపబడిన శాసనాధారాలతో కాకతీయులమీద, ముఖ్యంగా వారి రాజకీయ చరిత్రమీద, విస్తారమైన పరిశోధన జరిగింది.[7] ప్రతాపరుద్ర చరిత్రలోని చారిత్ర కాంశాలను శాసనాధారంగా తెలియవచ్చిన ఈ విషయాలతో సమన్వయ పరచడంలో నేటి పరిశోధకుడు తన పరిశోధనా పాటవాన్ని చూపించ వలసి ఉంటుంది. కాని ఈ చరిత్రాంశాలనంతా చర్చిస్తూపోతే, అది, కాకతీయులను గూర్చిన మరొక పెద్దగ్రంథ మవుతుంది. దీనికిది తావుకాదు.

అంతేగాక, చారిత్రకాధారంగా ప్రతాపరుద్రచరిత్ర ఉపయోగాన్ని, విలువను, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, 1969లో నరేంద్రనాథసాహిత్య మండలి (తణుకు) ప్రచురించిన ప్రతాపరుద్ర చరిత్రకు వ్రాసిన 80 పుటల తెలుగు ఉపోద్ఘాతంలో చాలా విపులంగా చక్కగా చర్చించారు. ఇందులోని విషయాలనే వారు అంతకుముందు, 1960లో తమ సంపాదకత్వంలో వెలువరించిన సిద్ధేశ్వర చరిత్రకు వ్రాసిన 98 పుటల ఇంగ్లీషు పీఠిక (Introduction) లో చర్చించి ఉన్నారు. ప్రతాపరుద్ర చరిత్రకు మూలానుసారంగా కాసెసర్వప్పకవించిన పద్యానువాదమే సిద్ధేశ్వర చరిత్ర. అంతేకాక, సిద్ధేశ్వర చరిత్రలో, ప్రతాపరుద్రునికి సంబంధించిన వృత్తాంతమంతా, ప్రతాపరుద్ర చరిత్రలోని వచనంగానే చేర్చబడింది. అందువల్ల, ఈవిషయాలను మళ్ళీ ఇచట చర్చించడం చర్వితచరణం అవుతుంది. కాని ఈ పీఠికద్వారా, చారిత్రకాధారంగా ప్రతాపరుద్ర చరిత్రకుగల విలువను, ఉపయోగాన్ని పాఠకుడు తనంతటతానై గ్రహించడానికి వీలుగా ఒకటి, రెండు విషయాలు ప్రస్తావిస్తాను.

గత పదేండ్లలో కాకతీయులకు సంబంధించి అనేక నూతనశాసనాలు ప్రకటించబడ్డాయి; ఈవిషయం పైన చెప్పాము. అంతేగాక, వెనుకటలో

ప్రచురించబడిన కాకతీయ శాసనాలు కొన్ని, ముఖ్యమైనవి. పునః పరిశీలింపబడి నూతనవిషయాలతో ప్రచురింపబడ్డాయి.[8] వీటి అన్నిటి ఆధారంగా, కాకతీయ రాజుల వంశాను క్రమణిక, వారి పరిపాలనాకాలాలు చరిత్రకారులు నిర్ధరించారు. ప్రతాపరుద్ర చరిత్రలో కాకతీయరాజులకు ఇచ్చిన పరిపాలనా కాలాలకు, ఈ శాసనాధారాలనుబట్టి నిర్ధరించినవారి పాలనాకాలాలకు చాలా వ్యత్యాసంఉంది. ప్రతాపరుద్ర చరిత్రలోఇచ్చిన వంశానుక్రమణికకు, రాజుల పరిపాలనాకాలాలకు, శాసనాధారాలద్వార నిర్ధరించిన వంశాను క్రమణికకు, పరిపాలనాకాలాలకు గల వ్యత్యాసాన్ని తెలియబరచేవిధంగా, ఒక పట్టికను అనుబంధంగా ఇచ్చాను.[9] దానిని చూచినపుడు ఈ కాలాలను సమన్వయపరచడం సులభంకాదని అర్థమవుతుంది.

కాకతీయ రాజుల పరిపాలనా కాలాన్ని ఇవ్వడంలో యథార్థానికి దూరమైపోయిన ప్రతాపచరిత్ర, మరికొన్ని ముఖ్య చారిత్రక సంఘటనల విషయంలో అతి సూక్ష్మంగా, అతి విశ్వసనీయంగా కాలనిర్ణయం చేసింది, ఈ సంఘటనల విషయంలో ఇది చేసిన కాల నిర్ణయాన్ని, శాసనాది ఇతర ఆధారాల ప్రమాణం లేక పోయినప్పటికి, అనుమానించ వలసిన పనిలేదు. ప్రతాపరుద్ర చక్రవర్తి "రుధిరోద్గారి సంవత్సర ఆశ్వయుజ బహుళ (౨) విదియ గురువారము నాడు యుద్ధరంగంబున గజారూఢుండై యున్న సమయంబున", ఢిల్లీ సుల్తాను సైన్యాలకు పట్టుబడినట్లు, రుధిరోద్గారి నామ సంవత్సర మాఘ శుద్ధ (౫) పంచమి గురువారం నాడు భార్య అయిన విశాలాక్షితో కూడి స్వర్గస్థు డయినట్లు, ప్రతాప రుద్ర చరిత్ర చెప్తుంది. ప్రతాపరుద్ర చరిత్ర కొన్ని ప్రతులలో ఈ రుధిరోద్గారి నామసంవత్సరానికి సరిపోయిన శాలివాహక శకం 1291 (క్రీ.శ. 1369)గా ఇవ్వబడింది. కాని ఇదితప్పు. ప్రతాపరుద్రచక్రవర్తి క్రీ.శ. 1323లో ఢిల్లీ సుల్తానుకు పట్టుబడి, తరువాత కొద్దినెలలలోనే మరణించాడనేది, ముస్లించరిత్రల వలన మనకు తెలిసిన చారిత్రక సత్యం. స్వామికన్నుపిళ్లైగారి "ఇండియన్ ఎఫెమిరిస్" ప్రకారం క్రీ.శ. 1323 (శా.శ. 1245) రుధిరోద్గారి నామసంవత్సరమవుతుంది. క్రీ.శ. 14వ శతాబ్దంలో రుధిరోద్గారి సంవత్సరం ఒకేసారి వస్తుంది. స్వామి కన్నుపిళ్లై ఇండియన్ ఎఫెమిరిస్ ప్రకారం ప్రతాపరుద్రుడు

శత్రువులకు పట్టుబడిన, రుధిరోద్గారి, అశ్వయుజబ. 2కు సరి అయిన క్రీస్తుశక కాలం 1323 సెప్టెంబర్ 17, శనివారం. (ప్రతాపరుద్రచరిత్ర చెప్పినట్టు గురువారం కాదు). ప్రతాపరుద్రుడు స్వర్గస్థుడయిన రుధిరోద్గారి, మాఘ శు. 5కు సరిఅయిన క్రీస్తుశకకాలం 1323 డిసెంబరు 31, శనివారం. (ప్రతాపరుద్ర చరిత్ర చెప్పినట్లు గురువారంకాదు). అంటే ప్రతాపరుద్ర చరిత్రప్రకారం, ప్రతాపరుద్రచక్రవర్తి ఢిల్లీ సుల్తాను సైన్యాలకు క్రీ.శ. 1323 సెప్టెంబర్‌లో పట్టుబడిన తర్వాత మూడునెలలా ఒకపక్షం రోజులకు మరణించాడు. శాసనాలు కూడా ప్రతాపరుద్ర చరిత్రలో యిచ్చిన ఈకాలనిర్ణయాన్ని స్థూలంగా బలపరు స్తున్నాయి. నేను చూడగలినంతమటుకు ప్రతాపరుద్ర చక్రవర్తిని పాలకుడుగా పేర్కొన్న శాసనాలు క్రీ.శ. 1323 మార్చినెల తర్వాతవి నేటికి లభ్యమయినట్లు లేదు.[10] కాకతీయ సామ్రాజ్యంపై ఢిల్లీ సుల్తాన్ దండయాత్రవల్ల ఏర్పడ్డ విపత్కరపరిస్థితి, ఈశాసనాభావానికి కారణమై ఉండవచ్చు.

ప్రతాపరుద్రచరిత్ర పేర్కొన్న వృత్తాంతాలు కొన్ని, జనశ్రుతిగా మాత్రమే ఎరుకలోనికి రాగలపి, వచ్చినవి. - కాకతీయశాసనాలలో పునరుద్ఘాటింప బడినాయి. అట్టి వృత్తాంతాలలో ఒకదానినిమాత్రం ఇక్కడ ప్రస్తావిస్తాం. ఓరుగల్లు నిర్మింపకపూర్వం, కాకతీయులకు రాజధానిగా ఉండిన అ(హ)నుమ కొండను, కాకతీయులు అధికారానికి రాకముందు, అ(హ)నుమడు, కొండడు అను ఇద్దరు ఎఱుక (కిరాత) రాజులు పాలించినట్లు ప్రతాపరుద్ర చరిత్ర చెప్తుంది. ఈ అ(హ)నుమడు, కొండడు అను వారిల పేరుమీదుగానే, అ(హ)నుమకొండ అని ఊరిపేరు ఏర్పడినట్లు జనశ్రుతి. జనశ్రుతిరూపమైన ఈ స్థానిక వృత్తాంతం కాకతీయ శాసనాలలోకూడ పేర్కొనబడింది. గణపతిదేవుని సోదరి మైలాంబ వేయించిన బయ్యారం చెరువు శాసనం, కాకతీయ మొదటి (గరుడ) బేతరాజు (క్రీ.శ. 1000 - 1052), అనుమడిని, కొండడిని జయించి, అనుమకొండను రాజధానిగా చేసుకొన్నాడని ఇట్లాచెప్తుంది.

"గరుడాంక బేతనృపతిః .. హత్వా యోనమనామధేయ మహి శం కొండమ్పచక్రే పురం విఖ్యాతానుమ కొండం ఊర్జితయశః"[11]

ఇట్టి విషయమే మరి ఒకటి. గణపతిదేవ చక్రవర్తి తిక్కనసోమయాజి అభ్యర్థనమీద, నెల్లూరికిపోయి మనుమసిద్ధి దాయాదులను నిర్జించి, అతనిని సింహాసనంమీద పునః ప్రతిష్ఠితుడిని చేసిన తర్వాత, "నెల్లూరనొక్క మహా తటాకంబు త్రవ్వించె"నని ప్రతాపరుద్రచరిత్ర చెప్తుంది. నెల్లూరు చెరువును గణపతి త్రవ్వించినాడని చెప్పడానికి ప్రతాపరుద్ర చరిత్ర ఒక్కటే ఆధారం.

ఇట్లు లోతునకుపోయి పరిశోధించేకొద్ది, ప్రతాపరుద్రచరిత్ర, సమన్వయ దృష్టి, సమీకరణ సామర్థ్యం గలిగిన పరిశోధకుడికి, చరిత్రకారుడికి, ప్రయోజన కరమైన అనేక విషయాలు అందించగలదు. రుద్రుని పితృహంతకునిగా చెప్పుట, గణపతి దేవుడు రుద్రుని కుమారుడని చెప్పుట, రుద్రమదేవి గణపతి దేవుని భార్య అని చెప్పుట మొదలుగా కొన్ని అవిచారణీయాలు, చారిత్రకంగా అసంగతాలు అయిన విషయాలు ప్రతాపరుద్ర చరిత్రలో ఉన్నాయి; కాని శాసనాద్యాధారాల వల్ల నిరూపితమయిన చారిత్రక సత్యాలనుకూడా, చాలావాటిని, మనకు ప్రతాపరుద్ర తెలియజేస్తుంది.

కాకతీయుల రాజకీయ చరిత్రకన్నా, ఆనాటి సాంఘికచరిత్ర తెలుసుకోడానికి ప్రతాపరుద్రచరిత్ర ఎక్కువగా ఉపయోగిస్తుంది. నాటి మతాలు, మతావేశాలు, మతవైషమ్యాలు, మత సంప్రదాయాలు. సాంఘిక మర్యాదలు, సంప్రదాయాలు, రాజకీయ మర్యాదలు, ప్రతాపరుద్రుని దినచర్య, అతని వ్యక్తిత్వం, ఓరుగల్లు నగరమందలి నానా వర్ణాలు, వాటిసంఖ్య, అందు వివిధ వృత్తులవారి సంఖ్య, మొదలగు ఎన్నో ఆసక్తికరమయిన విషయాలు తెలియజేస్తుంది. గణపతి, రుద్రమ, ప్రతాపరుద్రుల కాలంలో ఉన్నటువంటి ఆ కాలానికి కొంత ఇటునటుగా ఉన్నటువంటి, ఆంధ్ర సాహిత్య చరిత్రలో ప్రసిద్ధి వహించిన, సంస్కృత, ఆంధ్రకవి పండితులను అనేకులను, వారిలో కొందరి జీవిత విశేషాలను, వారిలో కొందరు రచించిన గ్రంథాలను పేర్కొంటుంది. ఈ విషయాలను సాహిత్య పరిశోధకులు, సాహిత్య చరిత్ర కారులు తమ పరిశోధనలలో ఉపయోగించుకొని ఉన్నారు. ప్రతాపరుద్ర చరిత్ర నాటి పండిత వైషమ్యాలను, విద్యా స్పర్థలను గూర్చి చెప్పి, నాటి విద్యా పరిశ్రమలను, సాహిత్య వాతావరణాన్ని తెలియచేస్తుంది. కాకతీయుల పరిపాలనకు

సంబంధించి, ప్రతాపరుద్రుని కాలంలోని రాజ్య ఆదాయ వ్యయాలను సమీక్షిస్తుంది. ప్రతాపరుద్రుడు రాజ్య రక్షణకై, "డెబ్బై యేడుగురు వెలమ నాయకులకు నాయకత్వం బిచ్చుట" మొదలైన పరిపాలనా సంస్కరణలను గూర్చి తెలుపుతుంది; అతని పరిపాలనలో ప్రముఖులైన ప్రధానులు, అమాత్యులు మొదలైన రాజోద్యోగుల పేర్లను తెలియ చేస్తుంది. ఇట్లు కాకతీయ యుగం నాటి సాంఘిక చరిత్రలో అనేకానేక విషయాలను తెలుసుకోడానికి ప్రతాపరుద్రచరిత్ర గణనీయమైన చారిత్రకాధారము.

## ప్రతాపరుద్ర చరిత్ర - ఆంధ్రవచన వాఙ్మయము

ఆంధ్ర వచన వాఙ్మయంలో ప్రతాపరుద్రచరిత్రకు ఒక విశిష్ట స్థానం ఉంది. అది, లౌకిక వాఙ్మయానికి సంబంధించి, తెలుగులో తొలి వచన రచన; తొలి చారిత్రక గ్రంథం. బహుశా ఇది ఒరవడిగా 16వ శతాబ్దంలో వచ్చిన మరి ఒక చారిత్రక వచన గ్రంథం, విశ్వనాథనాయనివారి స్థానాపతి రచించిన రాయవాచకం; అదే శతాబ్దంలో వెలువడిన మరి ఒక వచన రచన, లౌకిక ఇతి వృత్తంతో ఉన్నది, సభాపతి వచనము, నా సంపాదకత్వంలో 1982 లో రాయవాచకం వెలువడింది.[12] దాని పీఠికలో, ఈ మూడు గ్రంథాలను పోలుస్తూ, నేను చెప్పిన కొన్ని మాటలు ఇచట ఉద్ధృతం చేయడం అసంగతం కాదనుకొంటాను. ఆ మాటలు ఇవి :

"లౌకిక విషయాలకు సంబంధించి ఈకాలం (16వ శతాబ్దం) లో వెలువడిన వచన రచనలలో, వానికాలక్రమంలో, ప్రతాపచరిత్ర, సభాపతి వచనము, రాయవాచకము చెప్పుకోవాలి. ప్రతాపచరిత్ర 16వ శతాబ్దం, పూర్వార్థానికి చెందింది. గ్రాంథిక భాషలో రచించింది; ఆంధ్రసాహిత్యంలో తొలి చారిత్రక రచన. నిడుదవోలు వెంకటరావుగారుఅన్నట్లు, ఇది'కాకతీయులవృత్తాంతమును తెలుపు తొలి వచనకృతి-చారిత్రకకృతి'.[13] 'ప్రతాపచరిత్ర' కర్త ఏకామ్రనాథుడు, ఈ ఏకామ్రనాథుడుకూడా రాయవాచకకర్తవలెనే ఖచ్చితముగా, గుర్తింప వీలుకానివాడు. 16వ శతాబ్దం మధ్యకాలానికి చెందినది 'సభాపతి వచనము'. సభాపతి (రాజు) ఎటువంటివాడుగ ఉండవలె అను వర్ణనతో ప్రారంభ

మగుచున్నది కాబట్టి 'సభాపతివచనము' అని దీనికి పేరు ఏర్పడింది. మంచి గ్రాంథిక రచన. కర్త ఎవరో తెలియదు. ఇదిఒక చిన్న సంఖ్యార్థనామ ప్రకాశిక లేక సంకేతపదకోశం లాంటిది .......

"ఈచారిత్రక వచన రచనలకు నాడు జనంలో బాగా ప్రచారం ఉండి ఉండాలి. ఎందువల్ల ననగా, ఏకామ్రనాథుడి 'ప్రతాపచరిత్ర' ను అతనికంటె అర్వాచీనుడయిన కాసెసర్వప్ప ద్విపదకావ్యంగా మలిచాడు; అంతేకాదు, అటు తర్వాత కూచిమంచి జగ్గకవి 18వ శతాబ్దపు పూర్వార్థంలో, దీనిని 'సోమ దేవరాజీయ' మనుపేరిట పద్యకావ్యంగా రూపొందించాడు. ఇదేవిధంగా రాయవాచకాన్ననుసరించి, పదిహేడవ శతాబ్దపు చివరిపాదంలో కుమార ధూర్జటి కృష్ణరాయవిజయ' మనే పేరిట దానిని పద్యకావ్యంగా మలిచాడు. . .

"రాయవాచకకర్త 'ప్రతాపచరిత్ర', 'సభాపతివచనము' చదివి 'రాయ వాచకం' పేరిట కృష్ణదేవరాయని దిగ్విజయాలను గూర్చి వ్రాయడానికి ప్రేరితుడయినాడన్నా విప్రతిపత్తి ఉండబోదు".[14]

## ప్రతాపరుద్రచరిత్ర - భాషావిశేషాలు

పైన చెప్పినట్లు, ప్రతాపరుద్రచరిత్ర, సరళమైన గ్రాంథికభాషలో వ్రాయబడింది. అది, ఎట్టి అన్వయకాఠిన్యం (లేఖక ప్రమాదాలవల్ల ఏర్పడినవి మినహాయిస్తే) లేని, ధారాశుద్ధితోకూడిన భాష. పైనచెప్పినట్లు రాయవాచకంతో పోల్చి చూచినపుడు, ముస్లిం సంపర్కంవల్ల తెలుగుభాషలో చోటుచేసుకొన్న అన్యదేశ్యాలైన పారసీపదాలు, ప్రతాపరుద్ర చరిత్రలో, దగ్గర దగ్గర లేవనే చెప్పాలి. రాయవాచకంలో అన్యదేశ్యాలైన పదాలు సుమారు యాభైదాకా ఉన్నాయి; ప్రతాపరుద్రచరిత్రలో, నేను గమనించినంతమటుకు, 'సుల్తాను' 'సందారు' అనే రెండు పదాలే తటస్థపడతాయి. ప్రతాపచరిత్రకు మూలానుసార పద్యానువాదమైన కాసెసర్వప్ప 'సిద్ధేశ్వర చరిత్ర' లో ఈ అన్యదేశ్యపదాలు, 'ప్రతాపరుద్ర చరిత్ర' లోకన్న రెండు, మూడు ఎక్కువే చోటు చేసుకున్నాయి. ఈ గ్రంథాలలోని అన్యదేశ్యాల ఉనికి, కొంతవరకు, వాని రచనాకాలంలోని ముందువెనుకల నిర్ణయానికి సూచనగా ఉపయోగపడుతుంది.

నేడు వాడుకలోనుంచి తప్పిపోయి, విపులంగా ప్రచారంలో లేని తెలుగు పదాలు, ప్రతాపరుద్రచరిత్రలో కొన్ని ఉన్నాయి. ఇవి చాలాకొద్ది.[15] రాయ వాచకంలో ఇట్టిపదాలు అధికము.[16]

'ఆంధ్రవచన వాఙ్మయ' సిద్ధాంత వ్యాసకర్తలైన డా॥ ఎం. కులశేఖర రావుగారు ప్రతాపరుద్రచరిత్రశైలిని, భాషనుగూర్చి వెలిబుచ్చిన అభిప్రాయంతో, ఈ భాషావిషయకమైన చర్చ ముగిస్తాను.

"ప్రతాప చరిత్రయందలి శైలిసరళముగా నున్నది. కేవలము కథా ప్రధానమైన గ్రంథమగుటచే నిట్టి శైలి చక్కగా సరిపోయినది. భాషగ్రాంథికమే యైనను, అచ్చటచ్చట విసంధులు, అరిసమాసములు (శూద్రవీనుగ వంటివి) దొరలినవి. కర్తకథావస్తువునకే యధిక ప్రాధాన్యము నొసంగియు, శైలీ పరిపుష్టతకు నధికముగా ప్రయత్నము చేయకపోవుటయు, నిందుకు కారణము కావచ్చును. విసంధులు, అవసరములేనిచో యడాగమాదులు, ఊఉలు వ్రాయ వలసినచోట వువూలు వ్రాయుట, వంటివి లేఖక ప్రమాదదోషములు కావచ్చును. అచ్చులో నీగ్రంథమును సరిగా పరిష్కరింపకయే ముద్రింపించిరి. అందుచే నిట్టి దోషములు అచ్చుపుస్తకమునకూడ చేరినవి".[17]

## ప్రతాపరుద్ర చరిత్ర - పూర్వముద్రణలు, వ్రాత ప్రతులు

1) ఆంధ్ర సాహిత్య పరిషత్ (కాకినాడ) వారు సేకరించిన ఒక ప్రతిని అనుసరించి, ప్రతాపరుద్ర చరిత్ర, మొదటిసారిగా, 1917, 1918, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలలో, "ప్రతాప చరిత్ర" అనే పేరుతో ధారావాహికంగా ముద్రించబడింది.[18] దీని పరిష్కర్త పేరు ఇవ్వలేదు. కాని దానిపేరు క్రింద బ్రాకెట్లలో ఉన్న సూచన ఇట్లా ఉంది :

"(ఈ గ్రంథము మా యొద్ద నొక్క ప్రతియే యున్నది. తప్పులు మెండుగా నున్నవి. చరిత్ర ముందెలుపు గ్రంథము గావున స్వతంత్రించి సందేహములను మార్చలేదు. వ్రాతలో గల పొరపాటులను సవరించి నారము. ప. అ.)" ఈ సూచనలోని 'ప. అ.' పరిషత్ అధ్యక్షుడికి సంకేతాక్షరాలను

కొంటాను. కావున దీని పరిష్కర్త కూడా అప్పటిలో పరిషత్ అధ్యక్షుడుగా ఉన్న సుప్రసిద్ధచారిత్రక పరిశోధకులు జయంతి రామయ్య పంతులు గారు అయి ఉండవచ్చు. ఈ ప్రతిలో, ప్రతి వాక్యము అసమాపక క్రియలతో అంత మవుతుంది. మొదటి పుట అడుగున ఒక పాద సూచిలో, దీని పరిష్కర్త, ఈ విషయాన్ని ఇట్లు సూచించాడు. "పలుక దలంచి, కనుపట్టిన, నడుపుచుండ, అగుటయు" మొదలగు నసమాపక క్రియ లీ పుస్తకమున సమాపక క్రియలుగా వాడఁబడుచున్నవి.[19] మొత్తము మీద ఈ ప్రతిలో, బహుళాలేఖన దోషాలు సవరించి ప్రచురించి నందువల్ల కాబోలు, లేఖన దోషాలు ఎక్కువగా లేవు.

2) "శ్రీమత్ప్రతాపరుద్ర చరిత్ర" అను పేరుతో రెండవ సారిగా, ఈ ప్రతాపరుద్ర చరిత్ర, శైవ ప్రచారిణీ గ్రంథమాల, వరంగల్ వారిచే 1930 లో ముద్రింప బడింది. దానికి ఆరు పుటల పీఠిక వ్రాసిన విద్వాన్ ముదిగొండ వీరేశలింగ శాస్త్రి గారు, సూర్యపల్లి బుచ్చన్న (పోలీస్‌రైటర్, హనుమకొండ) గారు సంపాదించి ఇచ్చిన ప్రతి ఆధారంగా ఈ ముద్రణ చేసినట్లు చెప్పారు. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక ప్రతిలో ప్రతి వాక్యం అసమాపక క్రియలలో అంత మవుతుంది; ఈ వరంగల్ ప్రతిలో మొదటి ఏడెనిమిది పుటలలో తప్ప, మిగిలిన గ్రంథంలో అంతా, వాక్యాలు సమాపకక్రియలతోనే అంతమవుతున్నాయి. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక ప్రతికి, ఈ వరంగల్ ప్రతికి పాఠభేధాలు ఎక్కువగానే ఉన్నాయి. ఈ వరంగల్ ప్రతికి ఒక అనుబంధం చేర్చారు. ఈ అనుబంధంలో, వీరికి లభించిన మరొక ప్రతాపరుద్ర చరిత్ర ప్రతిలోని విశేషాలను, నాలుగు పుటలను పొందుపరచారు. ఈ అనుబంధం క్రింద ఇచ్చిన సూచన ఇలా ఉంది: "మ. రా. బొల్లం నాగలింగంగారు మా కార్యాలయమునకు ప్రతాపరుద్ర చరిత్ర నొకటి పంపి యుండిరి. దాని యందలి విశేషము లిందు బొందు పరచు చున్నారము."

ఈ వరంగల్ ప్రతిని, ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక ప్రతితో (ఆం. సా. ప. ప) పోల్చి చూచినపుడు, వరంగల్ ప్రతిలో లేఖన దోషాలు, అచ్చు పొరపాట్లు ఎక్కువగా కనబడతాయి. ఉదాహరణకు, "వెలనాటి పృథ్వీశ్వరులు" అని ఉండవలసిన పాఠం, వరంగల్ ప్రతిలో 'ఫలసాట పృథ్వీశ్వరులు'

అని ఉంది. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక ప్రతిలో "వెలనాటి పృథ్వీశ్వరులు" అనే ఉంది. ఇట్టి లేఖన దోషాలు పండితుల నెట్లు తికమక పెట్టి, తప్పుదోప పట్టించగలవో క్రింద వివరిస్తాము. వరంగల్ ప్రతిలో, విషయ శీర్షికలు చేర్చ బడ్డాయి. ఇవి ఆం. సా. ప. ప. ప్రతిలో లేవు: వరంగల్ ప్రతిలో సంచర్భాను సారంగా కూచిమంచి జగ్గకవి "సోమదేవరాజీయం" నుండి కొన్ని పద్యాలు, చక్రపాణిరంగనాథుని నయనగతిరగడ చేర్చ బడ్డాయి. ఇవి కూడా ఆం. సా. ప. వ. ప్రతిలో లేవు.

8) వరేంద్రనాథ సాహిత్య మండలి (తణుకు) వారు 1969 లో ప్రతావ రుద్ర చరిత్రము' అనే పేరుతో ప్రతాపరుద్ర చరిత్రను మూడవ సారిగా ముద్రించారు. ఈ ముద్రణ సంపాదకుని పేరు గాని, పరిష్కర్త పేరు గాని తెలుప లేదు. ఏ ప్రతిననుసరించి దీనిని ముద్రించింది ఎక్కడా చెప్పలేదు. కాని పరిశీలన మీద ఈ ప్రతి, మక్కికిమక్కి, పైన చెప్పిన శైవప్రచారిణీ గ్రంథ మాల, వరంగల్ వారి ముద్రిత ప్రతిని అనుసరించిందని స్పష్ట మవుతుంది. వరంగల్ ప్రతిని చూచి అచ్చువేయటంలో కొన్ని ప్రమాదకరమైన అచ్చుతప్పులు దొర్లాయి. పైన చెప్పిన "వెలనాటి పృథ్వీశ్వరు" లకు బదులు "ఫలసాట పృథ్వీశ్వరు" లని వరంగల్ ప్రతిలో ఉన్న అపపాఠాన్ని ఇక్కడ అట్లే ముద్రించారు. వరంగల్ ముద్రిత ప్రతిలో లేని పాఠాలను కొన్నిటిని "ప్రెస్ కంపోజిటర్", తన ఊహ కందినట్లు చేర్చినట్లున్నాడు. ఇట్లు చేర్చిన వాటిలో మిక్కిలి ప్రమాదకరమైనది, "ప్రతాపరుద్రుండు పట్టుబడుట" అనే విషయ శీర్షిక క్రింద, ఏ ప్రతిలో లేని "టిప్పు సుల్తాను" పేరును చేర్చుట. ఆ వాక్యం ఇది: "సింధు రాజును గూర్చి పశ్చిమంబునకు టిప్పు సుల్తాను బలంబుల మీదికి ప్రతాపరుద్రుండు యుద్ధంబునకు చనుదెంచెను." ఈలాటి లేఖక ప్రమాదాలు 'ముద్రా రాక్షసాలు', ఎంత పరిశోధనా పరమేశ్వరులైన వారిని కూడా తికమక పెట్టి, వారు ఎంత ప్రయత్నించినా అన్వయము, సమన్వయము కుదరక, వారిని "పల్టీలు" కొట్టించి, తప్పుదారిని పట్టిస్తాయి. ఈ 1969 (నరేంద్రనాథ సాహిత్య మండలి, తణుకు) ముద్రణకు, చారిత్రకాధారంగా ప్రతాపరుద్ర చరిత్ర విలువను, ఉపయోగాన్ని తెలియచేస్తూ ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు పరిశోధనాత్మక మైన, విశ్లేషాత్మక మైన 80 పుటల చక్కని ఉపోద్ఘాతం వ్రాశారు. కాని ఈ

"ఫలసాట పృథ్వీశ్వరు"ల దగ్గర ఇది అపపాఠమని సంశయించక, వారు ఇబ్బంది పడ్డారు. వారు 1960 లో వారి సంపాదకత్వంలో వెలువరించిన సిద్ధేశ్వర చరిత్రలో, ఈ 'ఫలసాట' అనేచోట సరిగా,'వెలనాటి' అనే ఉంది; ఈ విషయాన్ని వారు సిద్ధేశ్వర చరిత్రలో గుర్తించారు కూడా. అయినా, ప్రతాపరుద్ర చరిత్ర ఉపోద్ఘాతంలో, వారు, "ఫలసాట" రాజులు నిజంగానే ఉన్నట్టు ఊహించి, ఈ ఫలసాట అనేది కరీంనగర్ మండలంలోని పొలవాసదేశం (నేటి పొలాస్, జగ్తియాల్ తాలుకా, కరీంనగర్‌జిల్లా) గా ఊహించి; చరిత్ర చెప్పుకొంటూ పోయారు. ఇక్కడ యదార్థంగా ఏకామ్రనాథుడు చెప్పదలచింది, కాకతీయ రుద్రుడు వెలనాటి పృథ్వీశ్వరులను జయించాడన్న చారిత్రక సత్యం.

ఈ 'ఫలసాట' అనే లేఖక దోనిషాకన్నా ప్రమాదమైనది, 1969 ప్రతిలోని ఒక అచ్చుతప్పు. అది పైన పేర్కొన్నట్లు, ప్రతాపరుద్రుడు టిప్పు సుల్తానుతో యుద్ధం చేశాడని చెప్పడం. ఈ ప్రతిలో 'టిప్పుసుల్తాను' అని ఉన్నచోట, ఈ ప్రతికి మూలమైన వరంగల్ ప్రతితోసహా అన్ని ప్రతులలో, ఢిల్లీసుల్తానును గూర్చి చెప్తూ, "సులతాని" అని మాత్రమే ఉంది. ఈ అచ్చు పొరపాటును, సవరించుకోకపోతేవచ్చే ప్రమాదం, ఏకామ్రనాథుడు టిప్పుసుల్తానుకాలం (1782 - 1799) వాడనో, లేక అటుతర్వాత కాలం వాడనో చెప్పవలసి వస్తుంది; అంటే, ఏకామ్రనాథుడిని గూర్చిన కాలనిర్ణయమే తారుమారవుతుంది. ఖండవల్లి లక్ష్మీరంజనంగారు వారి ఉపోద్ఘాతంలో ఈ ప్రమాదాన్నిగూర్చి ఎందువలననో, హెచ్చరిక చేయలేదు.

4) మద్రాసు ఓరియంటల్ మ్యానుస్క్రిప్ట్ లైబ్రరీలోఉన్న "సిద్ధేశ్వర చరిత్రము" ఒక కాగితపు ప్రతిని పరిష్కరించి, 1960 లో, ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, తమ సంపాదకత్వాన దానిని వెలువరింప చేశారు.[20] కాసెసర్వప్ప రచించిన సిద్ధేశ్వర చరిత్ర, ఏకామ్రనాథుని ప్రతాపరుద్రచరిత్రకు అతి సన్నిహితంగా మూలనుసారమైన పద్యానువాదం. లక్ష్మీరంజనంగారు దీనికి ఆంగ్లంలో వ్రాసిన 98 పుటల చక్కని "ఇంట్రొడక్షన్" లో చెప్పినట్లు, "Except for minor details, the account contained in both the books is the same."

ఏకారణంచేతనో, సర్వప్ప, ప్రతాపరుద్రచరిత్రలోని, రుద్రమదేవి చరిత్రలో కొంతభాగాన్ని ప్రతాపరుద్రునిచరిత్రను ద్విపదలోనికి మార్చక, వచనంలోనే తాను ద్విపదగా మార్చిన భాగానికి చేర్చాడు.[21] ఒకవేళ సర్వప్ప ద్విపదలో వ్రాసిఉన్నా, ఆ భాగం దొరకక, సమగ్రతకోసం, లేఖకుడెవడైనాకూడ ఈ వచన భాగాన్ని చేర్చిఉండవచ్చు.[22] ఈ వచనభాగాన్ని తాటాకు ప్రతినుండి కాగితంలోనికి 'కాపీ' చేసిన లేఖకుడు ఇట్లా వ్రాసిపెట్టాడు: "ఈవల మాతృక పుస్తకంలో బొత్తిగా తాట్యాకు శిథిలమైపోయింది. పోయిన చోట జాగా విడిచినాను". ఈ వచనభాగం అచ్చులో 33 పుటలు, (దాదాపు 890 పంక్తులు) ఉంది; అంటే ప్రతాపరుద్రచరిత్రలో దాదాపుసగముంది. దీనిపాఠం, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో "ప్రతాపుచరిత్ర" పాఠానికి అత్యంత సన్నిహితంగా ఉంది. దీనిని సర్వప్పకు లభించిన ప్రతాపరుద్రచరిత్ర ప్రతి అనుకోవడంలో అసంగత మేమీలేదు.

సర్వప్ప తాను ద్విపదలోనికి మార్చిన భాగంలో, ఛందస్సులో ఇముడుటకై, ముఖ్యంగా ప్రతాపరుద్రచరిత్రలో ఇచ్చిన సంఖ్యావాచకాలను మార్చి నాడు. అట్లే ప్రతాపరుద్రచరిత్రలో, ఒకచోట "ఆనంద" నామ సంవత్సరమనిఉంటే, గణాల సర్దుబాటుకై దానిని "నందన" నామసంవత్సరంగా మార్చాడు. ఇలాటి విషయాలలో పరిశోధకులు కొంత హెచ్చరికతో ఉండ వలసి ఉంది.

5) క్రీ.శ. 18వ శతాబ్దం మొదట్లో కూచిమంచిజగ్గకవి ప్రతాపరుద్ర చరిత్రను "సోమదేవరాజీయము" అనే పేరుతో పద్య గద్యమయమైన చంపూ కావ్యంగా అనువదించాడు. ఇందులో గద్యాన్నంతా, జగ్గకవి, తనకు లభించిన ప్రతాపరుద్రచరిత్ర ప్రతినుండి యథాతథంగా తన గ్రంథంలోనికి చేర్చినట్లు కనపడుతుంది. సోమదేవరాజీయంలోని గద్యం, మొత్తం గ్రంథంలో దాదాపు మూడోభాగం ఉంది. అందువల్ల ప్రతాపరుద్రచరిత్ర పాఠభేదాలను, అపపాఠాలను, గుర్తుపట్టడానికి, సోమదేవరాజీయంలోని గద్యభాగాలుకూడా ఉపయోగపడతాయి, సోమదేవరాజీయంలో, రెండు ఆశ్వాసాలు మాత్రమే లభ్యమయి, ప్రచురింప బడ్డాయి.[23] సర్వప్పమాదిరే, జగ్గకవికూడా, తాను రచించిన పద్యభాగంలో,

ప్రతాపరుద్ర చరిత్రలో ఇచ్చిన సంఖ్యావాచకాలను, అట్లనే ఉంచక, ఛందస్సు లోనికి ఇమడ్చడానికై కొంతమార్చాడు. 

ప్రతాపరుద్రచరిత్రకు ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ మ్యాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ, హైదరాబాదులో రెండు కాగితపు ప్రతులున్నాయి. వీటిని పాఠభేదాలకై విపులంగా పరిశీలించే అవకాశం నాకు లేకపోయింది. 

 ప్రస్తుతముద్రణ 

1969లో నరేంద్రనాథ సాహిత్యమండలి (తణుకు) వారి ప్రతాపరుద్ర చరిత్ర పాఠంలో నేను పైన కనపరచిన పొరపాట్లు, మరికొన్ని ఇటువంటి పొరపాట్లు, గమనించిన తర్వాత, ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీవారు నేను సంపాదకుడుగా తయారుచేయమన్న ఈ ముద్రణ, చరిత్ర పరిశోధకులను, సాహిత్య పరిశోధకులను దృష్టిలో పెట్టుకొని, నిజంగా ఆవశ్యకము, అవసరము అనిపించింది. ఈ ముద్రణకు నేను 1969 అచ్చుప్రతినే మూలప్రతి(vulgate) గా గ్రహించాను. ఈ ప్రతి (పు. 79)లో 'సులతాని' అని ఉండవలసినచోట, 'టిప్పు సుల్తాను' అని ఉన్న అచ్చు పొరపాటును, తొలగించాను. అక్కడ, ఇక్కడ, కనబడ్డ గుణింతాలలోని పొరపాట్లు, సరిగా 'ప్రూఫ్ - కరెక్షన్' లేనందువల్ల వచ్చిన పొరపాట్లను తొలగించాను. మిగిలిన పాఠాన్నంతా అట్లే ఉంచాను. 1917 - 18 ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక ప్రతినుండి, సిద్ధేశ్వర చరిత్రనుండి, సోమదేవరాజీయం నుండి ముఖ్యంగా చరిత్ర పరిశోధనకు సాహిత్య పరిశోధనకు సంబంధించినచోట్ల, అవసరమైన పాఠభేధాలన్నీ ఇచ్చాను. అవపాఠాలు ఉన్నాయనుకొన్నచోట్ల వాటిని తెలియచేశాను. వరంగల్ ప్రతి చివరఅనుబంధంగా, వేరొక ప్రతిలోని విశేషాలను అనుబంధంగా ఇచ్చారు; ఆ అనుబంధాన్నికూడ ప్రస్తుతముద్రణకు, అనుబంధంగా చేర్చాను.[24] ఈ వివిధ ప్రతులలో, ఒక 'పేరా' లేక ఒక పుటకు మించి, ఏక్కడైనా పాఠం ఎక్కువబేధించి ఉంటే, ఆ పాఠాలన్నీ అనుబంధాల రూపంలో ఇచ్చాను.[25] ప్రతాపరుద్రచరిత్రలోని రాజోద్యోగుల, ప్రసిద్ధవ్యక్తుల నామ సూచిని ఒక అనుబంధంలో ఇచ్చాను.[26] స్థలనామసూచిని ఇచ్చాను.[27] పరిశోధకు లైన పాఠకులు, వారివారి ఉపజ్ఞనుబట్టి, సరియైన పాఠాన్ని ఎన్నుకొని, నిర్ణ

యించుకొని తమ సిద్ధాంతాలను, అభిప్రాయాలను రూపొందించు కొనగలరనే ఉద్దేశంతో ఈ పాఠభేదాలు, అనుబంధాలు ఇవ్వడం జరిగింది. ప్రతాపరుద్ర చరిత్ర, ఈ ప్రస్తుత ముద్రణను, అచ్చు తప్పులు, సవరణపత్రాలు (Errata) లేకుండా పాఠకులకు, పరిశోధకులకు అందజేయ గలిగితే, వారికి ఈ ముద్రణ, వెనుకటి ముద్రణలకంటె ఎక్కువగా ఉపయోగపడగలదని నాదృఢ విశ్వాసము.

ఏకామ్రనాథుని ప్రతాపరుద్ర చరిత్రను పరిష్కరించే అవకాశం కల్పించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి, వ్రాతప్రతులను గురించి నాప్రశ్నలకు ఓపికతో వెంటనే జవాబు లిచ్చి సహాయపడిన సాహితీమిత్రులు మద్రాస్ ఓరియంటల్ మ్యాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ పండితులు, తీర్థం శ్రీధరమూర్తి గారికి, ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ మ్యానుస్క్రిప్ట్ లైబ్రరీ అధికారులకు, నా అధ్యయన వ్యాసంగానికి ఆనుకూల్య మేర్పరచిన నెల్లూరు వర్ధమానసమాజ గ్రంథాలయాధికారులకు, నేను అడిగిన వెంటనే ప్రతాపరుద్ర చరిత్ర (వరంగల్ ముద్రిత ప్రతి), సిద్ధేశ్వర చరిత్ర (హైదరాబాద్, 1960) సాధించి పంపించిన మంచి మిత్రులు, సహృదయులు, డా॥ పేర్వారం జగన్నాథం, డా॥ హరి శివకుమార్ (ఆంధ్రశాఖ, కాకతీయ విశ్వవిద్యాలయం) గార్లకు, నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

ప్రమాణ సిద్ధాన్త విరుద్ధమత్ర
యత్కించి దుక్తం మతి మాంద్య దోషాత్ ।
మాత్సర్య ముత్సార్య తదార్య చిత్తాః
ప్రసాద మాధాయ విశోధ యన్తు ॥

29-6-1988 సి.వి.రామచంద్రరావు

"మానస"
నెల్లూరు-524003

# సూచికలు

1. క్రింద చూడు, "ప్రతాపరుద్రచరిత్ర రచనాకాలము".
2. క్రింద చూడు, అనుబంధం. 10 "కాకతీయరాజుల అనుక్రమణిక - పరిపాలనా కాలాలు".
3. చూడు, చాగంటిశేషయ్య, ఆంధ్రకవితరంగిణి, సంపుటం. 9, పుట 224; ఆరుద్ర. సమగ్ర ఆంధ్రసాహిత్యం, సంపుటం. 8, పుట 113, 114 లు.
4. చూడు, డా॥ సి. వి. రామచంద్రరావు (సం); రాయవాచకము. (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1982), పీఠిక. పు. ii మొ॥ పు. xiii.
5. అదే, పు. 46.
6. చూడు, అదే, అనుబంధం. 2, పు. 94 - 95. లు.
7. ఇటీవలి కాలంలో, ఈ శాసనాలను సేకరించి, విమర్శనాత్మకంగా ప్రచురించి, పరిశోధించి, కాకతీయుల రాజకీయ చరిత్రమీద, ముఖ్యంగా వారి పుట్టుపూర్వోత్తరాలనుగూర్చి, చక్కని సిద్ధాంతవ్యాసం వ్రాసినవారు, ఆంధ్రప్రదేశ్ పురావస్తుశాఖలో ప్రధాన శాసనాధికారులుగా ఉన్న, డాక్టర్ పి. వి. పరబ్రహ్మ శాస్త్రిగారు. చూడు, డాక్టర్. పి. వి. పరబ్రహ్మశాస్త్రి "ది కాకతీయాస్ ఆఫ్ వరంగల్", గవర్నమెంట్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు, 1978.
8. ఈ ఆలోకనాల (References) కై, చూడు, పరబ్రహ్మశాస్త్రి, ది కాకతీయాస్ ఆఫ్ వరంగల్, (1978).
9. చూడు అనుబంధం 10. "కాకతీయరాజుల అనుక్రమణిక - పరిపాలనా కాలాలు."

10. చూడు, బటర్‌వర్త్ అండ్ వేణుగోపాలశెట్టి, "నెల్లూర్ డిస్ట్రిక్ట్ ఇన్‌స్క్రిప్షన్స్", పర్శి. (10), 1323 మార్చి 26 శనివారం; కొప్పరం (నరసారావుపేట తాలూకా, గుంటూరు జిల్లా) శాసనం, "సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్" వాల్యూ 10, నం. 533, 1323 మార్చి 26 శనివారం; 1326లో ప్రతాపరుద్రుని పాలకుడుగా పేర్కొంటూ కొలనిరుద్రదేవుడు వేసిన సంతమాగులూరు శాసనం, అనుమానస్పదమైనది. చూడు, అదే నం. 535.

11. "ఎపిగ్రాపియా ఆంధ్రికా", I, శ్లోకం. 10.

12. పైనసూచిక. 4, చూడు.

13. నిడుదవోలు వెంకటరావు. ఆంధ్రవచన వాఙ్మయము (మద్రాసు, 1954).

14. డా॥ సి. వి. రామచంద్రరావు (సం), రాయవాచకము. (హైదరాబాదు, 1982). పీఠిక, పు. xx - xxiiలు.

15. డా॥ యం. కులశేఖరరావుగారు, తమ సిద్ధాంతవ్యాసం. 'ఆంధ్రవచన వాఙ్మయము' (హైదరాబాదు, ద్వితీయ ముద్రణ, 1974), పు. 502 - 504లో, ఇట్టి తెలుగు పదాలుగా ఈ క్రింది వానిని పేర్కొన్నారు. మెట్లవారు, సొదలు, మర్లబడుట, సంగరయిండ్లు, గిరివేయుట, గడ్డి కవాదంబు. కాని సందర్భాన్నిబట్టి, ప్రతాపరుద్రచరిత్ర పాఠకుడు వీని అర్థాన్ని సులభంగానే గ్రహించగలడు.

16. చూడు డా॥ సి. వి. రామచంద్రరావు (సం) రాయవాచకము అనుబంధం I, "పద వివరణ" పు. 81 - 93లు.

17. డా॥ యం. కులశేఖరరావు, ఆంధ్రవచనవాఙ్మయము, పు. 501 - 502 లు.

18. చూడు, ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, "ప్రతాపచరిత్ర" 1917, పు. 338 - 342లు, పు. 442 - 449లు, 1918, పు 133 - 144లు, 287 - 318లు.

19. ఇందలి వాక్యనిర్మాణం ఉదాహరణకై, చూడు, క్రింద, అనుబంధాలు, 1నుండి 7వరకు.

20. ఖండవల్లి లక్ష్మీరంజనం, (సం); శ్రీ సిద్ధేశ్వరచరిత్రము, ఆంధ్ర రచయితల సంఘము, హైదరాబాదు, 1960. ఈ సిద్ధేశ్వరచరిత్రకు కాకతీయులచరిత్ర, ప్రతాపచరిత్రఅని నామాంతరాలున్నాయి. సిద్ధేశ్వర చరిత్ర ముఖపత్రంపై,లక్ష్మీరంజనంగారు ఈ పేర్లనుకూడా కనబరచారు.

21. ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, ఈ వచన రచన ప్రారంభంలో, (పు. 144) ఒక పాదసూచిలో "(వచన) రచన ప్రతాపచరిత్రకు చాలసన్నిహితముగా సాగినది" అని వ్రాశారు.

22. కాసెసర్వప్ప, ఈ వచనాన్ని చేర్చడానికిగల కారణాన్నిగూర్చి డా॥ యం. కులశేఖరరావుగారు, "సిద్ధేశ్వరచరిత్రమున చివరంగల వచనైక భాగమును తత్కర్త కాసెసర్వప్ప యెందుకు వ్రాసెను; పూర్వభాగము వలె దీనిని కూడ నెందుకు ద్విపదయందే రచించలేదు; అను నంశములు విచారణీయములే. ఇందు పూర్వభాగమున నద్భుతాంశములు, కవి కల్పనకు నవకాశమున్న యనేక విశేషములున్నవి. సిద్ధేశ్వరుని యవతరణము, మాధవవర్మకథ, ఇత్యాదులు ముఖ్యములైనవి. ఛందోబద్ధములైన నిట్టి భాగములు బాగుగా రాణించునని కాంబోలు, పూర్వభాగము నంతయు ద్విపదయందే రచించెను. ఇక ఉత్తరభాగమున ప్రతాపరుద్రుడు జన్మించినది మొదలు, కాకతీయ రాజ్యపతనము వరకు యంశము లున్నవి. ఈభాగమున కల్పనల కవకాశము తక్కువ. పైగా నిందలి విశేషములన్నియు నర్వాచీనములును, చరిత్రకు సన్నిహిత ములును, వీనిని యథాతథముగా వ్రాయవలెనని యీ భాగమును

వచనముననే వ్రాసియుండును. కాని సర్వప్రకుఁగలచారిత్రిక దృష్టి దీని వలన స్పష్టమగుచున్నది" అని అభిప్రాయ పడ్డారు. (ఆంధ్రవచన వాఙ్మయము, పు. 505)

23. సోమదేవరాజీయాన్ని, 1969లో, నరేంద్రనాథసాహిత్యమండలి (తణుకు) వారు నిర్దుష్టంగా పరిష్కరించి. ప్రకటించారు.

24. చూడు, అనుబంధం. 9.

25. చూడు అనుబంధాలు. 1నుండి 8వరకు.

26. అనుబంధం. 11, చూడు.

27. అనుబంధం. 12, చూడు.

# శ్రీమత్ప్రతాపరుద్ర చరిత్రము

శ్రీ సర్వదేవతా మయుండును శ్రీ శంభు లింగంబునగు నీశ్వరుని బూజించి నాగనాథుని [1] యడుగులకు మ్రొక్కి ఏకాంబ్రనాథుండను* వాఁడొక పుణ్య [2] కథను నిటుల వచింప నారంభించె.

[2]కృష్ణా గోదావరీ మధ్య భాగంబునందలి దండకారణ్యంబు నందు మునిజన సేవితంబగు హిడింబాశ్రమంబుగలదు. అట్టి పుణ్యాశ్రమంబునకు, ఈశాన్య భాగంబునందు హనుమద్గిరియను నొక ధరణీధరంబు విలసిల్లు. అది దేవతా సిద్ధ విద్యాధర విహారయోగ్యంబు. అప్పర్వత మధ్యభాగంబునఁ బ్రమథ గణంబులును, సకల మునిజన సేవితుండగు సిద్ధేశ్వరుండును, బూర్వభాగంబున భద్రకాళియు, దక్షిణభాగంబున బద్మహస్తుండగు గోపాలమూర్తియు, బశ్చిమ భాగంబునఁ బద్మాక్షిదేవియు గలరు. కావున నగ్గిరి మహాదేవతామయంబై యొప్పు.

అగ్గిరి యాధారంబుగా బురంబుఁ జేసికొని తన్నివాసులైన జనంబులు తద్వంశ క్రమంబున హనుమండును కొండండును గర్గిరే యుండును,[3] కొమ్మ క్రొదేదును మొదలగు నెనుక రాజులు నూట యెనుబది యేండ్లు [4] రాజ్యపరిపాలనంబుఁ జేసిరి. తదనంతరంబున బద్మాక్షీ వరప్రసాదంబు నంజేసి ఏక శిలా నగరంబు గట్టించి మరి పెక్కు సాహస కార్యంబులఁజేసి [5] యనేక రాజులం గెలిచి కాకతి రాజులు వేయి సంవత్సరములు రాజ్య పరిపాలనము జేసిరి. ప్రతాప రుద్రుని చరిత్ర సహితంబుగా తద్వంశాను క్రమణిక విధమెట్టులనగా.

---

*ప్రతాపరుద్ర చరిత్రలో ఏకాంబ్రనాథుడు, ఏకామ్రనాథుడు అనే రెండు రూపాలు ఉన్నాయి. 'ఏకామ్రనాథుడే' యుక్తము-సం.

## కాకతిరాజుల వంశచరిత్ర

శ్రీమన్నారాయణునకుఁ జతుర్ముఖుండు జన్మించె. అమ్మహాత్మునకు న్నత్రి జన్మించె. అత్రి నేత్రకమలంబున సుధాకరుండు జన్మించె. మహాదేవుండెవనిని జటాజూటమను సింహాసనంబున నిలిపి సకల దేవగణంబులకు నెల్లబత్తెంబులు పెట్టించెనో, అట్టి చంద్రునకు బుధుడను పుత్రుండు జన్మించె. అతండు ననేక రాజవరులతోఁ బూజలు గొనుచుండె. అతని పుత్రుండు పురుహూతుండను వాఁడు చక్రవర్తియై సర్వంసహాచక్రంబు నేకచక్రంబుగా నేలుచుండె. అతని వంశంబున నహుషుండు బుట్టె. అతని వంశంబున భరతుండు మహా విఖ్యాతిఁజెంది చక్కఁగా రాజ్యంబు పరిపాలించె. తద్వంశంబున భారతవీరులనంబరగి భగవంతుడైన హరిపంచఁ జేరిన పాండవులు ధర్మజ భీమార్జున నకుల సహదేవులన విలసిల్లి రాజసూయాధ్వరంబు మొదలగు క్రతువులు గావించి దేవముని పితృ గణంబుల సంప్రీతులం జేసి మఱియు సకల ధర్మంబులఁ బ్రతిష్టించిరి.

వారలలో మిక్కిలి కిరీటి మేటియై ముక్కంటి గెల్చె. అదియుంగాక శ్రీకృష్ణదేవుని రథసూతుంగాఁ జేసి మారుతాత్మజుని కేతనంబుగా జేసి మఱియుఁ గౌరవుం గెల్చె. అట్టి వాని మహిమ యేమి చెప్పుదు! ఆ ధనంజయునకు నభిమన్యుండు జన్మించె. ఆతఁడు తండ్రియంత పరాక్రమ శాలియయ్యె. అతనికిఁ బరిక్షిత్తను సుతుండు జన్మించె. ఆ ఘనుండు శ్రీ రామచంద్రుని యట్లనేక ధర్మంబులు నాలుగు పాదంబుల నిలువంజేసి కృతయుగ చర్య నడిపించె.

అమ్మహాత్మునకు జనమేజయుండు జన్మించె. అతండు తండ్రి పగదీర్పుటకై తక్షక నాగాదులు నాశనంబుగా సర్పయాగంబు గావించె. ఆతనికి శతానీకుండను వాడు సుతుండై తాతయట్లు ధర్మ పరంపర నిలిపి విజయుండయ్యె. అతనికి క్షేమంకరుండు[6] జన్మించె. తన రాజ్యంబు నొక్క భాగంబు దేవ బ్రాహ్మణులకునిచ్చి యొక్క భాగంబు బంధుమిత్ర పరివార సమేతంబుగా ననుభవించుచుండె. అతని ధర్మాధర్మంబులు రాధేయాదులతో సరిచేయఁదగును. ఆ క్షేమంకరునకు విజయార్కుండను[7] వాఁడును, సోమేంద్రుఁడను వాడును జన్మించిరి. విజయార్కునకు[7] విష్ణు వర్ధనుండును జన్మించె.[8] సోమేంద్రునకు

నుత్తుంగ భుజుఁడు జన్మించె. అతండు దాయాదులతో రాజ్యంబుకై పోరి యోడి గోదావరితీర మందలి ధర్మపురికి దక్షిణభాగంబున ననతిదూరంబున నొక్క పురంబు గావించుకొని రాజుల గెలిచి నన్నూర యరువది యారు దుర్గంబులు సాధించి రాజ్యంబు పాలించె.

మఱియు నతని చరితంబు బుధజనంబులచే గద్యపద్య ప్రబంధాదికములచేఁ జెప్పంబడె. అతని యగ్రగ మహిషియందు నందుండను రాజోత్తముండుదయించె. నందుఁడతి తేజోవంతుడయ్యె. అతని చరితంబులు నలకార్తవీర్యార్జునులట్లు మహిని శోభిల్లుచుండె. అందుకు సంగ్రహంబుగాఁ జెప్పెద.

ఆ నందుండు నందగిరి ప్రవేశించి నందగిరిని బురంబు గావించుకొనియె. అందు జంతవర్మ సూర్యాదిత్యులు ప్రధానులుగా నుండిరి. శారదానందుడు [9] గురువుగా సులభుడు మహీసీశుడుగా భానుమతి దేవి పట్టంబురాణిగా లంబోదరుండను రాజు చెలిమికాడుగా మఱియు ననేక జనులు దండనాయకులై యతని పనులు నడుపుచుండిరి. ఇవ్విధంబున కొన్ని సంవత్సరములు [10] రాజ్యంబు మహామహిమతోఁ బాలించె.

మఱియు నాతడు శ్రీ నగ[10a]రంబునకుఁబోయి మల్లికార్జున లింగంబును భ్రమరాంబా దేవిని సేవించి యా ప్రదేశంబున నొక్క బిలంబు సొచ్చి పోవుచుండ, నందు నొక్క మహాయోగి గనిపించె. అమ్మహాయోగిచే ఖడ్గఖేటకంబులను మహాస్త్రంబులు[11]గొని మరియు నబ్బిలంబు దూరి చనునప్పుడు, మాయామూర్తియై యందు [12] జనార్దనుం డలి భ్రమణంబుగా భ్రమపెట్ట [13] నొక్కింత చలింపక నిలిచిన, నా దేవుండు మెచ్చి యనేక వరంబు లిచ్చిన గైకొని, అందుండి మగిడి బిలంబు వెడలి దివ్యయోగిని గనంగొని, అనేకంబులుగా స్తుతియించి చోళేంద్రుతో మహాయుద్ధంబుఁ జేసి యతనిచే పూజలు గొని సునందయను కన్యకను [14] బరిణయంబై సేతువున కరిగి రామేశ్వరుని సేవించి దివ్యాస్త్రంబులచే నావిభీషణుం, గెల్తునని యచ్చట నిల్చిన, ఆ విభీషణుండు సర్వ ధనంబులు కానుకలుగా పెట్టిన, గైకొని నిజరాజధానియగు నందగిరి ప్రవేశించి రాజ్యంబు పాలింపుచుండె.

ఆ నందునకు సునందయందు నగజారమణుని కరుణచేత సుమతి [15]యను కన్యయును విజయపాలుండను సుతుండు నుదయించిరి. సుమతి కన్యకను యదు వంశతిలకుండైన సత్యభునునకు వివాహంబు జేసిరి. అంత నా సుమతియను కన్యకకు వృషసేనుండు జన్మించె. మఱియు విజయపాలునకు నగ్నివర్ణుండను నతఁడు జన్మించె. విజయపాలుండు కొన్ని దినంబులకు మృగశాపంబున విగత జీవుండయ్యె. మరల శారదానందుని ప్రసాదంబున సుజ్ఞానుండయ్యె. అంత నందుఁడను పేర [16] పెక్కు సంవత్సరంబులు రాజ్యంబు పాలించి యోగమార్గంబు దాల్చి భోగంబులు చాలించి శ్రీశైలంబునకు జను నప్పుడు తన వెనుదగిలి వచ్చు పుత్ర దౌహిత్రులైన యగ్నివర్మ వృషసేనులం గాంచి వారల శారదా నందునకు నప్పగించి, వారల యభీష్టంబు లెరింగి నందుండు శ్రీశైల నివాసుండయ్యెను. అట్లు చోళాఖ్య వంశుండైన నందుని యిచ్చా ప్రకారంబున [17] శారదానందుండు రాజ్యంబునకు, నగ్నివర్మ వృషసేనుల నభిషిక్తులం జేసి రాజ్యంబు విభాగించి యిరువురకు నొసంచి యిచ్చెను. వారలు శారదానందుని యాజ్ఞా ప్రకారంబు రాజ్యంబు నేయ సమోత్సాహంబయ్యె.

అంత వృష సేనుండు దేవేంద్ర మఖంబు గావించి ధాన్యవృష్టి గురిపించు టచే నది కారణంబున వృషసేను వంశంబున "వృష్టి" సంజ్ఞ దనరుచుండు. చాళుక్య వంశజుండగు నగ్నివర్ణుండు నందగిరి రాజధానిగా జేసికొని రాజ్యంబు పాలించి యనేక సుతుల గాంచె. అక్కుమారవర్గంబు, అగ్నివర్ణుని పరోక్షంబున రాజ్యంబు గుడువ నొల్లక తమలో తాము వైరంబు బెచ్చుకొని పోరంజొచ్చిన నందు కొందరు తెగపడి వృష్టికుల భూపతులకు సహవాసులై యుండిరి.

అచ్చట వృషసేనుని వంశంబున ననేక రాజులు పరిపాలించిన తర్వాత వృష్టికుల తిలకుండైన కన్నడ దేవుండను మహారాజు జన్మించె. అతడు కందారంబు రాజధానిగఁ బాలించి భూదేవ పూజలు విధ్యుక్తంబుగా నడిపి గోదావరీ తటంబున నున్న విప్రులకు పదమూడు వేల యేనూరు (౧౩౫౦౦)[18] అగ్రహారంబులు సమర్పించి రాజ్యంబు నేలుచున్న సమయంబున, ఆ మహారాజు నకు సోమదేవరాజు జన్మించె.

## సోమదేవరాజ వృత్తాంతము

ఇతండు దినదిన ప్రవర్ధమానుండై తండ్రి పరోక్షంబున రాజ్యంబు నేలుచు సకలధర్మంబులు నడుపుచుండె. అట్టి యవసరంబు నాతఁడు తన మూఁడు వేల యేనూరు[19] గోగణంబుల మంత్రకూటంబు[20] మొదలుగ గోదావరి యుభయ తీరంబుల మందలు గావించి యధికారుల నియోగించె.

వారలు మేపుచున్న యెడను కటక వల్లభుండొక్కనాఁడు సోమ దేవరాజు వృత్తాంతం బంతయు చారులచే విని సకల సేనాపరివార సమేతుండై సోమదేవ రాజుపై దండెత్తి వచ్చి గోగణంబు చుట్టు ముట్టి తద్గోపాలురతో గొప్పయుద్ధంబు గావించి యాగోపాలకుల నోడించి గోవుల మరల్చుకొనిపోయె. ఆగోపాలకులు కందారంబునకు వచ్చి సోమదేవరాజునకు నావృత్తాంతం బంతయు వెలియఁబలికిన విని యాతఁడు మహా కోపోద్రేక దీపితుఁడై [21] సర్వసేనా సమేతుండై కటకంబుపై సేనల విడిసి ఆరునెలలు కటకంబును ముట్టడిచేసి మహాయుద్ధంబుఁ జేయ సర్వసేనలు సమసిపోయె.

మరల నాతడు బలంబులగూర్చుకొని కటకంబునకుపోయి యెప్పటియట్లు యుద్ధంబు చేయుటచేత సర్వసేనలును మడిసెను. మగుడ కందారంబునకువచ్చి మగుడ బలంబుల గూర్చుకొని తిరిగి కటకంబునకుఁజని మాసద్వయంబు ఘోర యుద్ధంబుఁజేయ సకలసేనలు మడిసిన, తిరిగి కందారంబునకు వచ్చెను. అతడు ఆయుమార్లు [22] కటకవల్లభుని సాధించి గోవులమరల్చు కొందునని పోయి సాధింప నేరక మహాచింతాక్రాంతుండై బుధజనామాత్యవర్గంబుతోఁ గటకవల్లభుని సాధించు తెరంగు నెఱుంగం బలుకుడన వార లిట్లనిరి. ఓరాజా! మానుష శక్తులకు నలవిగాదు. ఏదేని దైవ వరప్రసాదంబునంజేసి గెలువందగు. ఇతరో పాయంబుల గెలువ నలవిగాదు. పుత్రకామేష్టి యాగముచే తేజోవంతుఁడగు కుమారునగ్ని దేవు ప్రసాదంబున గనుము. ఆతఁడు కటక వల్లభుని జయింప గలఁడని వారలుపలుక నారాజు విని త్ర్యంబక పర్వతంబు గోదావరి యుభయ తటంబుల నున్న తన పదమూఁడువేల యేనూరు యగ్రహారంబులంగల వేదవేదాంగ ప్రచండులైన బ్రాహ్మణుల రావించియాగంబుచేసి వారల బహు

సిరియాళదేవిని చూచి కొందరికి రాజపత్నియగు నని తలంచి బహుజనంబులు వచ్చునని యొంటియుంత నేర్చునే! ఇది యొక్క విప్రాంగనయే రాబోలునని మరుపు, వారలయందొక్కరుండీ యింతి నీక్షించగా''నీయింతి రూపాతిశయంబులు విచారింప మొగంబు నిందుబింబంబును ధిక్కరించు చున్నది. ఈ నీల కుటిల కుంతలంబులును ఈ విశాలనేత్రంబులును, ఈ దీర్ఘబాహువులును, ఈ మంద యానంబును పాదపద్మంబులును మెరుంగులును ఇతర జన కాంతలకు గలుగ నేర్చునే! ఇది రాజపత్నియగు సిరియాళదేవి యగు తప్పదు" అని నిశ్చయించి తమవారల కెరింగించి యెలుకురాజు ననుమతంబున కటకవల్లభుని సముఖంబునకు దోడ్కొనిపోవ నారంభించె.

ఆ సమయంబున నప్పురి విప్రులందఱును సిరియాళదేవిని మరల తీసుకొని హాహాకారంబులు సేయుచు, "ఈ కాంత విప్ర కాంత. మాధవశర్మ కూతురు. ఈ చెలియ పెనిమిటి వారణాశికిఁ బోవుచు మాతృగృహంబున నునిచి చనియె. ఇది నిజంబు. ఎట్టి సత్యంబైన చేసెదము. అట్లుగాదని దలంచితి రేని నీ కాంతతో గూడ నీ విప్రులందరము సౌదలు జొచ్చువార" మని దీక్షపట్టి హరిద్రావస్త్రములు దాల్చి పీరజాలు అల్లుకొని తమ గృహంబులు విప్పుకొని శవింప తెగబడియున్న విప్రులంజూచి కటకవల్లభుండును నతని యనుచరులును గడగడ గజగజ నాడలు వణకుచు మహాభీతచిత్తులై యా విప్రులకు నమస్కరించి ''ఇది రాజకాంతయవి పట్టితిమి. ఇంతియేకాక మాకు మీకు వైరంబుగలవె? కోపంబులు సైరింపుడు. మీకు మాకు మరొక్క తగవు గలదు. అది యెట్లనిన. ఈ విప్ర జనంబులు సిద్ధేశ్వరుని సముఖంబున గూర్చుండి యీ చెలి వడ్డించిన యన్నంబులు రోయక భుజించితి రేని యిది విప్రకాంతయగును. కాదేని మీరు నిజంబు పలికిన మీకు వేయి గ్రామంబులు నగ్రహారంబులుగా నిచ్చి యీ కోమలిని రక్షించి యీ గర్భంబున నున్న శిశువును మరల కందారంబునను బట్టంబు గట్టెద" మని నీతియుక్తంబుగా నాడిన వారలతో విప్రు లిట్లనిరి.

ఈ స్త్రీ రాజకాంత కాదు. విప్రులకు సింహాసనం బేటికి? ఈ కోమలి విప్ర కాంతయగుట తథ్యంబు, ఇదిగో చూడుఁడని తక్షణంబున సిద్ధేశ్వర శ్రీమన్మహాదేవు నగరికిఁ జని యా విప్రులందఱు నచ్చటి గుండంబున మునిగి కృతానుష్ఠానులై

యద్దేవుని వేదోక్తంబుగా నారాధించి బహువిధంబులఁ బూజించి చతుర్విధోప హారంబులనై వేద్యంబు లిచ్చిరి. ఆనైవేద్యంబులా కోమలి వడ్డింప[25] నందఱును పంక్తిని గూర్చుండి సోమదేవరాజు వేదాధ్యయన పారాయణుండగుటం జేసి, "వేదాధ్యాయ రతో విప్ర" యనియెడు వాక్యంబు మనస్సులో నిల్పికొని సిద్ధేశ్వర శ్రీమన్మహాదేవున కెదురునిలిచి చెయ్యెత్తి చాచి, యీ కాంత విప్రకాంత యని పలికి యా యంగన వడ్డించు నన్నంబులు సంతుష్టిగా నారగించిరి.[26]

ఆ సమయంబున సకల జనంబులు చూచుచుండ నావిప్రులపై శ్రీమన్మహా దేవుండు పుష్పవృష్టి గురిపించెను. అదియంతయుం గని కటకవల్లభుని పరిజనం బులు[27] గజగజ వణకుచు వల్లభుని కెరింగించిన నాతడు విప్రుల రావించెను. ఆ విప్రుల కనేక ధనంబులొసంగి తన వారలు తాను కటకంబునకుఁ బోవుచు నానాదేశంబులకు సిరియాళదేవిని వెదుకఁబంపెను.

## మాధవవర్మ జననము

అంత నిక్కడ నొక్క సుముహూర్తంబున[28] సిరియాళదేవి ప్రసూత యాయెను. సర్వలక్షణ సంపన్నుండైన కుమారుం డుదయించెను.

ఈ విప్రులు జననవేళ యెరింగి యిబ్బాలుండు సర్వసర్వంసహా నేక చ్ఛత్రంబుగా గర్భాష్టకంబున మహామహిమతో పాలింపగలండని పలికిరి. అబ్బాలునకు పుణ్యాహవచన విధులుచేసి నామకరణము చేయుటకై సిరియాళదేవిని జూచి మీ యభీష్టం బేమని వారడిగిన నామె యా విప్రజనంబుల కిట్లనియె. ఈ మాధవశర్మయే దైవంబు, దాతయు తల్లియు తండ్రియునగు. వీరుచేసిన నామకర ణంబు నాకు నభీష్టంబని పలికెను. ఆ విప్రు లట్లగాక యని యబ్బాలునకు మాధవ వర్మయని నామకరణంబు చేసిరి.

ఆ కుమారుని విప్రదంపతులు పోషించుచుండ శుక్లపక్షసుధాకరుండ నంబరగి దినదిన ప్రవర్ధమానుండై పెరుగుచున్న యెడ, గర్భాష్టకమున నుప నయనంబుఁ జేసి, యుపాధ్యాయునొద్ద పద్మాక్షీ సముఖంబునఁ జదివింపు చుండిరి.

## మాధవవర్మకు బద్మాక్షీ దేవి ప్రత్యక్షమై వరంబిచ్చుట

ఒకనాఁడా బాలుఁడు తనతోఁ జదువు బాలుర తానును నాఁట తమిఁ బలక పుస్తకమునుఁ బద్మాక్షీ దేవి చేరువ పెట్టి యగ్గుడితలుపు పెట్టి విహరించుచుండ నస్తమయం బాయెను. అంత నింటికిఁబోయి మజ్జనభోజనంబుల దీర్చి రాత్రి చదువందగు పలుకయు పుస్తకంబును లేకునికి మాధవవర్మ తననెక్కడ కోపించునోయని యట్టి రాత్రి కాలంబునందుఁ బద్మాక్షీ దేవి సముఖంబునకు దానొక్కరుండు చనెను.

అంతటి భయంకరంబై భూతప్రేత పిశాచశాకిని ఢాకిని భేతాళ బ్రహ్మ రాక్షస పరివృతయై సింహాసనంబునఁ బద్మాక్షి దేవి కొలువుండెను. కాని యవమాత్రంబైన మాధవవర్మ చలింపక భూతగణంబులఁ జేత నెట్టివేయుచు యద్దేవి సముఖంబుననున్న పలకయుఁ బుస్తకంబును బుచ్చుకొని నిలిచి యుండెను.

అంత నబ్బాలుని సాహస ధైర్యంబులకు దేవి వెరగంది యతని ధైర్యంబుఁ జూచుటకు నతి భయంకరాకారంబు దాల్చెను. అబ్బాలుండు దానిని గాంచి యావంతయుఁ జలింపక నిలిచి ముకుళిత హస్తుండై బహువిధంబుల స్తుతి యించుచు నద్దేవి పాదపద్మంబులకు మ్రొక్కి లేవకుండెను. దానినిఁగని దేవి యత్యంత దయార్ద్రమానసయై "లెమ్ము వత్సా! నీ భక్తిధైర్యంబులకు మెచ్చితి. నీ కిష్టంబైన వరంబు వేఁడు" మని పలికిన నబ్బాలుండు తన జననిచేఁ బండ్రిడి చందం బంతయు నెఱింగినవాఁడై నందునఁ గటకవల్లభుని సాధించి తమ గోధనం బులు మరల్చునట్లు వరంబు కృపచేయుమనెను.

అద్దేవి నీవన్నయట్లు కృపచేయుదునని యొక్క దివ్యఖడ్గంబును దివ్య ఖేటకంబును గృపఁజేసి, ఈ ఖడ్గంబు నీ చేతనున్న నిన్నెదిర్చిన శత్రువు లడంగుదురు. ఈ దివ్యఖేటకంబు నీ చేతనున్న శస్త్రాస్త్రంబులు నిన్నుఁజేరవు. అని యానతినిచ్చి ద్విగుణిత సహస్ర మాసంబులు[29] రాజ్యంబు చేయుదువనిపల్కి తన సమీపంబుననున్న యొక్క బిలంబును జూపి పశ్చిమ ముఖుండవై యరిగి యొక్క రమ్య ప్రదేశంబున నీబిలంబు వెడలియున్న సమయంబున నాగోంగగ

పర్యంతంబునకు నబ్బిలమార్గంబు వెడలచతురంగ బలంబులు నీ వెంట చనుదెంచు నని యానతిచ్చి మఱియు నిట్లనియె.

ఈ దివ్యఖడ్గ ఖేటకంబులు మీ యింట సింహాసనంబున వెయ్యేండ్లుండునని యానతిచ్చి గోబ్రాహ్మణ పూజయు, నుమామహేశ్వర పూజయు, లక్ష్మీనారాయణ పూజయు, మఱవకుమని చెప్పెను.

అబ్బాలుండు పునఃపునః ప్రణామంబు లాచరించి యద్దేవి యనుమతి నబ్బిలంబు దూరిపోవుచు నట పెక్కు విఘ్నంబులు, భూతప్రేత పిశాచ వ్యాఘ్ర భల్లూక సర్పాదులు గనుపించిన మనంబు చలింపక యన్నియు నివారించుచు నబ్బిలంబు వెలువడి కొంత దవ్వరిగి యా రమ్యప్రదేశంబున నిలిచి యుండెను.

అంత నబ్బిలంబు వెలువడి గజ తురగ వీరభటులు పెక్కు లట్టహాసఘోషంబును భేరీ ఝాంకృతులును కాహళ నిస్వనంబులును శంఖనాదంబులును రథభట బలంబులును ఉష్ట్రఘంటికా ఘణాత్కారంబులును, తురగ గజవాహన ధ్వనులు నేకంబై ప్రళయకాల మేఘ గర్జితంబుగ చాల దిక్కులు పిక్కటిల్లు నటుల సూర్యోదయ పర్యంతమున మాయా బలంబులును. అరువదివేలు మదగజంబులు పండ్రెండు లక్ష లుత్తమాశ్వంబులు పదిహేడు లక్షలు పదాతి వర్గంబులు మణిమయాభరణ దివ్యాభరణంబులు పదికోట్ల సువర్ణంబు గొని మాధవవర్మ యిల్లుజేరెను.

## మాధవవర్మ పద్మాక్షీ వరంబున గల్గిన సేనలతోఁ దల్లి చెంతకు వచ్చుట

ఆ రాజకుమారుఁడు బలంబుల మన్నించి వారిచే నమస్కారంబులు చేకొని యా బలంబులతో గూడ హనుమకొండ చేరవచ్చి వారలందఱిని నిలిపి తానొక్కరుండు పురంబుజొచ్చి వచ్చుచుండెను. అట్టితఱి హనుమకొండను నేలుచున్న యెరుక రాజతఁడు వచ్చుటకు ముందే యా కలకలంబు విని వెరగుపడి గవనులు వేయించి చారులచే నా సేనాపరిమితి యెఱింగి మహాభీతచిత్తుడై యొక్కడిసేన నన్నెన్నో గని చింతించుచు నెట కేనియుం బారిపోవ యత్నించుచుండె.

తల్లి కొడుకునుం గానక వెదకి వెదకి వేసారి నేలంబడి మూర్ఛిల్లి తెలివొంది నదై దుఃఖంబుచే పొరలుచుండెను. పూర్వభూసుర దంపతులు సిరియాళదేవిని గాంచి దుఃఖోపశమనంబు గలుగునట్లుగా మాటలచే బుజ్జగింపుచుండిరి. ఆ సమయంబున మాధవవర్మ తల్లియగు సిరియాళదేవిని గాంచి మ్రొక్కెను. పెన్నిధిగన్న పేదచందంబున నామె దిగ్గునలేచి యుబ్బుమీరి యక్కుమారునెత్తి యక్కునం జేర్చి శిరం బాఘ్రాణించి, అన్నా! ఎక్కడ నుండితివి? బాలుండవు. ఒంటినుండుట యాశ్చర్యంబుగదా! నిన్నెడబాసి యీ రేయి నాలుగు ఝాములు మా యొడల ప్రాణంబులు నిలిచియుండుట పరమాశ్చర్యంబులని దలంచి శోక మోహంబులు బెనంగొన నబ్బాలుని గౌగలించి విస్మయంబందుచు భానుబింబంబు పొడువుకొని యున్న మూర్తి త్రయంబునుంబోలు నబ్బాలుని మరొక్క యామంబు శోక మోహ సంతోష విస్మయా నందంబుల మునుగుచు నబ్బాలు నుద్దేశించి మా యయ్యా! ఈ రేయి నెక్కడనుంటివి. ఎరుగం బలుకుమనెను.

ఆ కుమారుండు తాను పద్మాక్షీదేవి నగరికిం జనుటయు, మొదలుంగాగల వృత్తాంతంబంతయు వారలడుగగా సర్వంబు నెరుంగం బలికిన విస్మయానంద భరితుండై యున్న మాధవశర్మం జూచి యా కుమారుండిట్లనియె.

## మాధవవర్మ మాధవశర్మ యాజ్ఞచేం దాను రాజ్యంబు పరిపాలించుట

ఈ రాజ్య భోగంబులు మీరలనుభవింపుడు. మీ సమీపంబున నేను ధరాచక్రంబు పాలించువాండనని యబ్బాలుం డొడంబడి పలికిన నాతండిట్లనియె.

అయ్యా! మేము వృద్ధులము. నేత్రంబులు పొరలు గప్పి యున్నవి. శ్రోత్రపుటంబులు విన నిజశక్తిం జాలవు. కాలు చెయ్యియు నాడుటలేదు, జవసత్వములు నానాటికిం దగ్గుచున్నవి, శ్లేష్మంబులు కంఠరబలంబున నాగుకొని క్షుత్పిపాసాదులు సన్నంబయ్యె. మాకు నెక్కడి రాజ్యభోగంబులు? ఎటుల ననుభవించువారము? నీభోగంబులే మాకు సహస్ర గుణిత భోగంబులనిన, విని యాతండు వారలంజూచి నిట్టూర్పు నిగుడించి తత్క్షణంబె పద్మాక్షీదేవి నగరికిం

జనుటెంచియద్దేవి సముఖంబున నిలచి చెయ్యెత్తి, ఓపరమేశ్వరీ! మా మాధవ శర్మకును మా మాధవాంబకును మా తల్లి సిరియాళదేవికిని గాక యీ రాజ్య భోగంబులు నాకేల? ఖడ్గఖేటకంబు లివిగోయని ముందఱబెట్టి చనుచుండెను.

ఆ సమయంబున నబ్బాలుని యౌదార్యంబులకు నెంతయుమెచ్చి యద్దేవి యతని చేరంబిలిచి మీతాత ముత్తవులగు వృద్ధభూసుర దంపతులును మీతల్లి సిరియాళదేవియు నీవు రాజ్యంబు పాలించుచున్నంత కాలంబును వయోయావన ప్రాయంబుల నుండగలవారలని యానతిచ్చి నీవు ధరాచక్రంబు నూటయిరువై యేండ్లుపాలించి యటుమీద దివ్యకైవల్యకాకృష్టుండవై యీ కొండ బిలంబులో దివ్యాంగనలతో దివ్యభోగంబు లనుభవించుచు నమరత్వంబును నిర్జరత్వంబునుం గలిగియుండగలవని యానతిచ్చిన యద్దేవికి సాష్టాంగ నమస్కారంబులుచేసి ఖడ్గఖేటకంబుల మగుడ గైకొనివచ్చి మాధవశర్మకు నావృత్తాంతంబంతయు నెరుంగంబలికెను. నీముువ్వురు నవయౌవను లగుటయు యీ వృత్తాంతంబంతయు నెరుక రాజులు విని మాధవవర్మ పాలికిం జనుదెంచి యతనికి సాష్టాంగంబుగా నమస్కరించి నీవుమాకు రాజువు గలిగితివి, మాతపంబులు ఫలించెను. ఏమి పనులం జేయుదుమని కరంబులు ముకుళించియున్న వారలను మన్నించి మాధవ వర్మ యెలుకురాజులకు సమరవాది [30] రాజ్యంబిచ్చి పంపెను.

తరువాత నబ్బాలుండు దేవీ కల్పితంబులైన సేనలతో తాను హనుమ కొండకు వచ్చి చేరెను.

## మాధవవర్మ సింహాసనం బెక్కుట

శాలివాహనశకము ౨౫౧ తారణ నామ

సంవత్సర మాఘ శు ౫ గురువారము

శ్రవణానక్షత్రంబునుండి (౪౧౧) వరకు

అతడు మంచి ముహూర్తమున దేవభూదేవ పూజలు గావించి భూసు రాశీర్వాద పూర్వకంబుగా సింహాసనం బెక్కెను. [31] నానా సేనలు నమస్కా రంబుల జేసిన దివ్యాంబరాభరణంబు లొసంగి సంతోష చిత్తులంజేసి తమ తల్లియగు సిరియాళదేవి యనుజ్ఞ గైకొని తన తండ్రిని జంపినట్టి పగదీర్చుటకై

మనంబున దలంచుకొని పూర్వసామంతుల బిలిపించుకొని వారల మన్నించి తమ శత్రుండైన కటక వల్లభునిపై దండయాత్ర గదలవలయునని వారితో విచారించి ప్రయాణభేరి వేయించి పద్మాక్షీ దత్తంబైన బలంబులు తన్ను గొల్చు చుండగా కటకంబునకుబోయి యా పట్టణంబు చుట్టు ముట్టడించెను.

ఆతండొక్క మాసంబు ఘోరయుద్ధంబుజేసి దేవీదత్తంబైన ఖడ్గ ఖేటకంబు లిరుగేలం బూని యుద్ధంబున గటకవల్లభుని తలద్రుంచెను. అప్పుడు మేదినీగల వైరులకు గాలభైరవుండను బిరుదును, కటకవల్లభుని "తలగుండు గండండను" బిరుదు చెల్లించుకొని వానిసుతునికి బట్టంబుగట్టి తన యాజ్ఞకు లోజేసికొని తమ గోగణంబుల పదమూడువేల నేనూరుమందలు మగుడి దోలించుకొని మూడుకోట్ల సువర్ణటంకంబు లప్పనంబులు పుచ్చుకొని మరల హనుమకొండకు వచ్చెను. తమగోగణంబుల కృష్ణాతీరంబు చేరువ శ్రీనగరంబున మందలు వేయించి అమరవాదినున్న 32 యెరుకు రాజులకు నప్పన చేయించెను. మఱియు దిగ్విజయంబు సేయుటకు ప్రయాణ భేరి వేయించి సకల సేనా సమేతుండై యష్టదిక్కులు జయించి దిగ్విజయంబు గైకొని చోళదేశాధీశ్వరుని కూతురును వివాహంబై హనుమకొండ ప్రవేశించి సింహాసనాసీనుండై రాజ్యం బేలుచుండెను.

ఆ సమయంబున నా పురిమున్న విప్రజనంబులు మాధవవర్మ సముఖంబున కేతెంచి వేదోక్తంబుగా నాశీర్వదించిన వారలకు సాష్టాంగంబుగా నమస్కరించి వారల బహువిధంబుల పూజించి మీరు కార్యార్థులై వచ్చిన వారలని నామనంబున తోచుచున్నది. మీ యభీష్టంబు లెరుంగం బల్కుడనెను ఆ వాక్యంబునకు సంతోషించి యా విప్రులిట్లనిరి. "కటకవల్లభుండు మీతల్లి సిరియాళదేవిని గొనిపోవు సమయమున నాయాపదగని మీతల్లిచేతి యన్నంబు గుడిచితిమి. ఆ యాపన్నివారణం బుచితంబనియును శైవప్రసాదం బనియును గుడిచితిమి. 33 ఇంతియేగాక, కలియుగంబున క్షత్రియులచేత నన్నంబు గుడువరాదు. అగ్రజన్ములకు క్షత్రియాన్నంబు తగదు. 34

ఆ కారణంబున మా మనంబులో నెప్పుడును మేర మేర పాయక యున్నయది. మాకు సప్తగోదావర మధ్యప్రదేశంబున కొన్ని గ్రామంబు లగ్రహారంబులుగా నిచ్చిన నచట స్నాన జప తపోహోమంబులును గత్రువులును గావించి పుణ్యలోకంబులు వడసెద" మనిన నాతడు సప్తగోదావర మధ్య ప్రదేశంబున నగ్రహారంబుల నిచ్చిపంపెను.

మఱియు మాధవవర్మ పెద్దకాలంబు రాజ్యంబుచేసి పద్మాక్షీదేవి వర ప్రసాదంబున నొక్క సుతునింగని పద్మసేనుండని పద్మాక్షి పేరుపెట్టెను ఈ విధంబున నసమానదానంబుల 35 మాధవసేనుండు రాజ్యంబు పాలించె. అంత పద్మాక్షీదేవి పూదోటలోగల నానావిధ పుష్పంబులు నిత్యంబును హనుమ కొండ బిలంబులోనుండి వెడలి దేవకన్యకలు రాత్రి గొనిపోవుచుండిరి. తోట కావలి వారలా పుష్పంబులు పోవుటకు వెరగంది యొక్క రాత్రి కావలియుండి దేవకన్యకలు వచ్చు తెరంగును, బుష్పంబులు కోసికొని మగుడి యీ కొండ బిలంబు దూరిచనుటయుం గని యావృత్తాంతం బంతయు మాధవవర్మ కెరింగించిరి.

అంత నా రాజు పద్మాక్షీదేవి వరంబు దలంచి రాజ్యంబును గుమారుండగు పద్మసేనుని బట్టాభిషిక్తుంజేసి యారాత్రి తానొక్కరుండు నాపూదోటలోనున్న యాబిలంబు వెడలిన నాదేవకన్యకలు చనువెంబడి మాధవదేవుని బహువిధంబుల స్తుతియించి పద్మాక్షీదేవి కడకుం దీసికొని చనిరి. తదనంతరంబునం బద్మాక్షీదేవి వరప్రసాదంబున నాతడు కొండబిలంబు చేరంబోయి దేవకన్యకలతో తానును నా బిలంబుఁ జేరెను.

## పద్మసేనుండు సింహాసనంబెక్కుట

### శాలివాహన శకము ౪౧౧ నుంచి ౪౭౯ వరకు

పద్మసేన మహారాజు తన తండ్రియైన మాధవవర్మ బిలంబులోనికి దేవకన్యల యుక్తముగా జొచ్చిన, యనంతరంబున తాను తన తండ్రి యట్లు రాజ్యంబు మహామహిమతో పెద్దకాలంబు పాలించి తనకు సంతానంబు లేనందున

మిక్కిలి చింతించి బుధానుమతంబున సిద్దేశ్వర శ్రీమన్మహాదేవుని నిత్యంబును గూష్మాండ ఫలంబులఁ బూజింపఁ దత్ప్రసాదంబున నొక్క సుతుండు గలిగెను.

అతనికి వెన్నమరాజను నామకరణం బిడియె. తరువాతఁ దనకు మరలబడ్డ కటకవల్లభుని సాధించి వానిసుతునికిఁ బట్టంబుగట్టి యెప్పటియట్ల మూడుకోట్ల సువర్ణనిష్కంబులు గైకొని హనుమకొండఁ బ్రవేశించి డెబ్బది యెనిమిది వర్షంబులు [36] రాజ్యంబు పాలించెను. తదనంతరంబున దన కుమారుండైన వెన్నమరాజును పట్టాభిషిక్తుంజేసి తాను శివలోకంబున కరిగెను.

## వెన్నమరాజు సింహాసనం బెక్కుట

### శాలివాహనశకము ౮౦౯ నుంచి ౯౩౨ వఱకు

వెన్నమరాజు సింహాసనంబెక్కిన తరువాత వివాహంబు జేసికొని పెద్దకాలంబు రాజ్యంబు పాలించెను. సుతులు లేనందున సిద్ధేశ్వర శ్రీమన్మహాదేవునిగూర్చి ఘోరతపం బాచరించెను. అద్దేవుని ప్రసాదంబున నొక్కసుతుం డుద్భవించెను. అతనికిఁ బోరికివెన్నమరాజను నామకరణంబిడెను. [37] తాను సకల దేశాధీశ్వరులను జయించి వారిచే నప్పనంబులు గైకొనెను. అతఁడు ముఖ్య పట్టణంబగు హనుమకొండ ప్రవేశించి యెనుబదిమూడు వర్షంబులు [37a] రాజ్యంబు మహామహిమచేఁ బాలించి తన సుతుఁడగు పోరికి వెన్నమరాజును బట్టాభిషిక్తుం జేసి తాను శివలోకంబున కరిగెను.

## పోరికివెన్నమరాజు సింహాసనం బెక్కుట

### శాలివాహన శకము ౯౩౨ నుంచి ౯౪౧ వరకు

పోరికివెన్నమరాజు, సింహాసనంబెక్కిన తర్వాత వివాహంబు జేసికొని గుండమరాజను నొక్క సుతునింగని, తన శత్రుండగు కటక వల్లభునిమీదికి దండెత్తి యతనితో మాసత్రయంబు ఘోరయుద్ధంబు గావించి కటకవల్లభుని శిరశ్ఛేదనంబు గావించెను. వానినుతునికి బట్టంబుగట్టి యెప్పటియట్లు సువర్ణ నిష్కంబు లప్పనంబులు పుచ్చుకొని యష్టదిక్కులయందు జయస్తంభంబుల

వేయించి గుండమ రాజును పట్టాభిషిక్తుంజేసి డెబ్బదియారు వర్షంబులు [38] సుఖముగా రాజ్యంబు పాలించి తాను శివలోకంబున కరిగెను.

## గుండమరాజు సింహాసనం బెక్కుట.

శాలివాహనశకము ౨౪౮ నుంచి ౩౧౮ వరకు

గుండమరాజు వివాహంబుఁ జేసికొని యొక్క సుతుఁనిగని యెరుకు దేవరాజు అని పేరుపెట్టెను. తదనంతరం బాగుండమరాజు డెబ్బది[39] సంవత్సరంబులు రాజ్యంబు పాలించి యన్నిదిక్కుల యప్పనంబులు గైకొని యెరుకు దేవరాజును బట్టాభిషిక్తుంగావించి తాను శివలోకంబున కరిగెను.

## ఎరుకుదేవరాజు సింహాసనం బెక్కుట

శాలివాహన శకము ౩౧౮ నుంచి ౩౬౭ వరకు

ఎరుకు దేవరాజు బాలుండగుటంజేసి యతని మేనత్తకుంతలి రాజ్యంబు జేసెను.

## కుంతలిదేవి రాజ్యంబు చేయుట

శాలివాహన శకము ౩౧౮ నుంచి ౩౨౭ వరకు

ఈ కుంతలిదేవి రాజ్యముచేయు కాలమందు నామె గుజరాష్ట్రి మహారాష్ట్రింబులపై దండు వెడలి వారల సాధించి వారలచే యప్పనంబులు గైకొని మగుడి తనపురంబగు హనుమకొండకు వచ్చి మరలబడ్డ కటకవల్లభునిపై చతురంగ బలంబులనుగూర్చి రాణా గంగి దేవుని [40] సేనాధిపతిగా నియమించి పంపెను. ఆతఁడు కటకవల్లభునితో మహాయుద్ధంబుఁజేసి కటకవల్లభుని దునిమి వాని సుతునికిఁ బట్టంబుగట్టి యెప్పటియట్లు మూడుకోట్ల సువర్ణంబులు అప్పనంబులు పుచ్చుకొని వచ్చెను. అంత కుంతలీదేవి యాతని నన్మానించి నిర్వక్ర పరాక్రమముతో నవవర్షంబులు [40a] రాజ్యంబుఁజేసి యెరుకుదేవరాజుకు రాజ్యభారం బంతయు నప్పగించి తాను శివలోకంబున కరిగెను.

## ఎఱుకు దేవరాజునకు భువనైకమల్లుండను కుమారుఁడు గలుగుట

ఎరుకుదేవరాజు సర్వలక్షణ సంపన్నుండై దేవగిరిపై దండువెడలి దేవగిరిరాజులను గెల్చి యా రాజకుమార్తెను వివాహమాడి వారిచే కానుకలు గైకొని మరల పురంబు ప్రవేశించెను. అంత నెరుకరాజున కొక్కసుతుం డుద్భ వించెను. ఆ బాలునకు భువనైకమల్లుండును నామకరణంబు జేసెను. తరువాత నాతఁడు చతురంగ బలంబులతో విజయనగరంబుపై వెడలి యా రాష్ట్రంబేలు వీరనరసింహరాయల గెలిచి యతనిచే నప్పనంబులు గైకొని మగుడి హనుమ కొండ ప్రవేశించి డెబ్బది నాలుగేండ్లు 41 రాజ్యంబు పాలించి భువనైకమల్లుని సింహాస నాసీనుంగావించి తాను శివలోకంబున కరిగెను.

### భువనైకమల్లుండు సింహాసనం బెక్కుట

శాలివాహన శకము ౭౫౨ నుంచి ౮౧౮ వరకు

ఈ భువనైకమల్లుండు సింహాసనంబెక్కి తమకు శత్రుండగు కటక వల్లభునిపై వెడలి వానితో మహాయుద్ధంబు గావించి వానిని సంహరించి వాని సుతునికిఁ బట్టంబుగట్టి యెప్పటియట్లు మూడుకోట్ల సువర్ణనిష్కంబులు నప్పనంబులు పుచ్చుకొని హనుమకొండ ప్రవేశించెను. పిమ్మట దక్షిణదేశంబేలు వీరవరసింహ రాయుని "సకల మర్త్యగండ" బిరుదుగల వానిసిగాను, 'ధరణీవర' బిరుదుగం వానినిగాను, చారులచే విని చతురంగబలంబుల గూర్చుకొని పద్మాక్షిదేవీ వరలబ్ధంబులైన ఖడ్గఖేటకంబులు ఇరుగేలంబూని విజయనగరంబు చుట్టుముట్టి యా భువనైకమల్లుండు విజయనగరంబు జొచ్చి నరసింహరాయల గృహ ద్వారంబుచెంత దుర్గారూఢుండై ఖడ్గఖేటకంబులతోఁబోయి నరసింహరాయులను దనతో నేకాంతయుద్ధంబునకు రమ్మని భటులచేఁ బిలిపించెను. అంత నాతఁడు రాకపోవుటచే బలంబుల నప్పురంబు వెలుపలనుంచి తానొక్కరుండు నిర్భ యంబున బురంబుజొచ్చి నరసింహరాయల సన్నిధికిరాగా నాతఁడు నిర్భయంబున వచ్చుటకు జాల కొనియాడి యతనికి భువనైకమల్లుండను నామంబు సహజంబగునని కొలువునుండి దిగ్గునలేచి యంతఃపురంబు ప్రవేశించి తత్పత్ని య్యుఁ దానును భువనైకమల్లుని నెదుర్కొని వెచ్చిరి.

## భువనైకమల్లుని వివాహము

పిమ్మట నా దంపతులతని పాదంబులఁ గడిగిరి. తన సింహాసనంబుపై గూర్చుండనియమించి కరంబులు ముకుళించియున్న నరసింహరాయలు భువనైక మల్లున కిట్లనియె.

ఓ మహాత్మా ! నీవంటి నిశ్శంక వీరులకుగాక యీ బిరుదులు మా బోటి రాజులకుఁ దగవు. ఈ బిరుదులు నీవు గైకొమ్ము. నే నోడితిని. నీవు గెల్చితివి. అని తన బిరుదులు సువర్ణ ఫలకాంకితంబుగా[42] వ్రాయించి భువనైకమల్లునకుఁ గానుకగానిచ్చి తన చెలియలగు శ్రీరంగమదేవిని సర్వాభరణ భూషితగాఁ జేసి విలాసవతులగు పదుగురు చెలికత్తెలతో[43] గూడ భువనైకమల్లునకు వివాహంబుఁ జేసెను.

## వీరనరసింహ రాయలు శ్రీరంగమదేవి కరణమిచ్చి పంపుట

తరువాత మూడుమాసంబులు భువనైకమల్లుడు నరసింహరాయల గృహంబున నిలిచెను. మరియు నుత్తరపు గవినినుండి నరసింహ రాయులు భువనైక మల్లునకు కరణంబు లిచ్చుటయు,[44] శ్రీరంగమ దేవులకు కాంచిపురం బాదిగాఁగల చోళరాజ్యం బేలు పనుపునకు చదివించుటయు, అంతట దేవీయుక్తంబుగా దివ్య భూషణ చీనిచీనాంబర గజ తురగ గోగణ దాసదాసీ పరిజనంబులనిచ్చి పంపు సమయంబున మీ మా యింటికి తరతరంబు విరోధంబు లేదని ప్రమాణంబులు జేసికొని సువర్ణ ఫలకాంకితంబు వ్రాసికొని తర్లు సమయంబున శ్రీరంగమదేవి తన పతియైన భువనైకమల్లునితో నిట్లనియె.

"నేను బాల్యమున నుండి బుధానుమతంబున సర్వలక్షణ సంపన్నుఁడు మహారాజు నాకు పతియగునని పుణ్యంబు దయచేసిన దేవుని మనతోడనే వెంచేయ సెలవు దయచేయు" మని విన్నవించ నాతఁడంగీకరించెను. తరువాత నామె యా పాంచాల రాయుని బంగారుపల్లకిలో నుంచుకొని వచ్చి యద్దేవుని పేర గ్రామంబున కటకంబును గట్టించి దేవునికి నైవేద్యంబులకు పదకొండు గ్రామంబులు నడిపించెను.

## భువనైకమల్లుండు హనుమకొండ ప్రవేశించుట

అంతట భువనైకమల్లుడు శ్రీరంగమదేవుని తీసికొని గంగాపురంబునకు వచ్చి యక్కడ మీనాంబకుం[45]డను ఋషిచే నా గ్రామ మధ్యంబున నూరుగళ్ళు కట్టించెను. మరియుం జెన్నరాయల ప్రతిష్ఠ చేసెను. ఒక కోనేరు కట్టించెను. ఎనిమిది తులాభారంబులు దేవీ యుక్తంబుగా దూగెను. అట్టి[46] ద్రవ్యంబులు విప్రులకు దానంబు చేసి హనుమకొండ[47] ప్రవేశించెను.

అంత భువనైకమల్లుండు శ్రీరంగమదేవుల యందు త్రిభువనైకమల్లుని. పాంచాలియను కుమార్తెనుం గని పరమ సంతోషంబున నుండెను.

## వేంకటనాథుడు యుద్ధమునకు బయలు దేరుట

అట్టి యవసరంబున నిక్కడ వీరనరసింహ రాయల కుమారుండు వేంకటనాథుండు విజయనగరం బేలుచు నొక్కనాదు పరిజన సమేతుండై స్వారివెడలి పూర్వదక్షిణ పశ్చిమ రాజప్రజాన్వయముగా వచ్చి ఉత్తరద్వారంబున రాజప్రజాన్వయము[48] గాన రాదని ప్రధానుల నడిగెను. వారలా యుత్తరపురవిని నుండి అతని తండ్రి వీరనరసింహ రాయలు భువనైకమల్లున కరణంబులిచ్చుట మొదలుగాగల తద్వృత్తాంతంబంతయు నెరుంగం బలికిన వేంకనాథుండు విని నవ్వి ఏమనటులనే హనుమకొండకు బోయి భువనైకమల్లుని నేకాంత యుద్ధంబునకు బిలిచెదనని ప్రయాణభేరి వేయించెను.

## శ్రీరంగమదేవి యుద్ధంబు నివారించుట

ఆ సమయంబున భువనైకమల్లుం డీవృత్తాంతంబు చారులచే విని సర్వాభరణంబులం గూర్చుకొని దేదీప్యమానంబైన ఖడ్గఖేటకంబు లిరు గేలంబూని వేంకటనాథుండు తనమీదికి వచ్చుచున్న వాడని విని శ్రీరంగమదేవులకుం జెప్పబోవు సమయంబున శ్రీరంగమదేవి పతికి నీరాజనం బిచ్చుచు కన్నీరు దుడుచుకొన భువనైకమల్లుం డిట్లనియె.

"సతీమణీ! నీవు పుణ్యాంగనవై నాకు నీరాజనం బిచ్చి దీవించు సమయంబున కన్నీరుఁ దెచ్చుకొన కారణంబేమి" యని యడిగిన నాతనితో శ్రీరంగమదేవి యిట్లని విన్నవించె.

"తొల్లి మీరును మా యన్నయగు వీరనరసింహ రాయులును సఖ్యంబు జేసితిమని బ్రాహ్మణాగ్ని సమక్షంబున సువర్ణ ఫలకాంకితంబుగా వ్రాలు వెట్టితిరి. అట్టి సత్యంబు దప్పితిరి. మీ జిహ్వకు సత్యంబు దొలగెనని వీరనరసింహరాయులకు వేంకటనాథుఁ డొక్కఁడే సుతుఁడని దెలిపి పాదములపై బడెను.

## భువనైకమల్లుడు బ్రాహ్మణుల కగ్రహారములిచ్చుట

అంత నామె వచనంబులకు సంతసించి యతఁడు వైరంబు చాలించి బుధ జనులచే కార్యం బూహించి యాతఁడు తన రాజ్యంబుపై రాకుండునట్లు తన రాజ్యంబు చుట్టుగా రాజ్యంబునకు చక్రాకారంబుగా వేయిగ్రామంబులు భూసురుల కగ్రహారంబులుగా నిచ్చి పంపెను.

## వేంకటనాథుఁడు హనుమకొండకు వచ్చుట

భూసురు లతి త్వరితంబున వెడలి నెల్లూరుకటకు వచ్చియున్న వేంకట నాథునిగని యివి మా విప్రముఖ్యుల కొసంగిన యగ్రహారంబులు. ఈ భూములు త్రొక్కవలదని ఆన కట్టగా అంత వేంకటనాథుండు తన మేనత్తయగు శ్రీరంగము దేవులు పంపిన రహస్యపత్రికలు చదువుకొని వైరంబుమాని వారితో బాంధవంబు నొందితిమని చెప్పి యా విప్రులకు అగ్రహారమధ్యంబున మార్గం బిచ్చుటకై యాభై వేల మాడలు[49] సమర్పించిన వార లొడంబడ నాతఁడు శ్రీరంగమదేవిని జూచెదనని హనుమకొండకు చనుదెంచెను.

అంత భువనైకమల్లుండు దేవీయుక్తంబుగా నెనిమిది యోజనంబు లెదురుగా వచ్చి వేంకటనాథుని మహావినయ భక్తిపూర్వకముగా పూజించి తమకు రాజధాని యగు హనుమకొండకు దోడ్తెచ్చి యప్పురంబున మాసద్వయంబు నిల్పి పురంబు అంతఃపురంబు శృంగారించి తమ పుత్రియగు పాంచాలిని వేంకటనాథునకు

వివాహంబు జేసి అనేక వస్తు వాహనంబులును అమూల్యా భరణాంబరాదులు కొండపీడు మొదలుగా విదర్భదేశమును అచ్చెలియ కరణంబిచ్చి నరపతిరాయు లకు పట్టంబు నిజంబుగా గట్టి[50] దేవీయుక్తంబుగా వెంకటనాథుని విజయనగరంబు నకు పంపెను.

భువనైకమల్లుండు డిరువదియా రేండ్లు[51] రాజ్యంబు పాలించి తన సుతుడగు త్రిభువనైకమల్లునకు పట్టంబుగట్టి తాను శివలోకంబున కరిగెను.

## త్రిభువనైకమల్లుండు సింహాసనం బెక్కుట

### శాలివాహనశకము ౮౧౮ నుంచి ౮౯౭ వరకు

త్రిభువనైకమల్లుండు సింహాసనం బెక్కి రాజ్యంబు చేయుచున్న సమయంబున, కాకతిదేవి నిత్యవిధి పూజానుష్ఠానంబులు గావించు చుండగా త్రిభువనైక మల్లునకు కాకతిదేవి[52] వరప్రసాదంబున కాకతి ప్రోల రాజను నొక్కసుతుండు జన్మించెను. ఇట్లుండగా దమకు శత్రుండగు కటకవల్లభుండు తమపై మరల బడిన వానిపయి దండెత్తి వానిని యుద్ధంబున సంహరించి వానిసుతునికి బట్టంబు గట్టి ఎప్పటి యట్లు మూడుకోట్ల సువర్ణనిష్కంబు లప్పనంబులు పుచ్చుకొని వచ్చి గంగాపురంబున కొఱతయైన దేవతానివాసంబులు పూర్తిగా గట్టించి డెబ్బది నాలుగు సంవత్సరములు[53] రాజ్యంబు పాలించి కాకతిప్రోల రాజునకు పట్టంబు గట్టి తాను శివలోకంబున కరిగెను.

## కాకతిప్రోల రాజు సింహాసనం బెక్కుట

### శాలివాహన శకము ౮౯౭ నుంచి ౯౭౪ వరకు

కాకతిప్రోల రాజు బాలుండగుట జేసి యతని సరదార్లు సామంతులును విముఖులగుటను విని కటకవల్లభుండు విశ్వనాథదేవు దళవాయిగా జేసిపంప నతండు వచ్చి హనుమకొండ ముట్టడివేసి పంద్రెండు వర్షంబులుండెను.[54] అంత కాకతిప్రోల రాజు తన పురంబు నాప్తవర్గంబున కప్పగించి పురంబు వెలువడి దొరలను సరదార్లను [illegible] కొని కటకవల్లభునిపయి దండయాత్రజని కటక

వల్లభునితో యుద్ధంబుఁ జేసి వానితలఁ ద్రుంచి వానిసుతునికి బట్టంబుగట్టి యెప్పటి యట్లు మూడుకోట్ల సువర్ణ నిష్కంబులు పుచ్చుకొని హనుమకొండ ప్రవేశించి కటకవల్లభుని దళంబుల బారద్రోలెను.

## కాకతిప్రోల రాజునకు సువర్ణ మయంబగు శంభులింగంబు కనఁబడుట

పిమ్మట గంగాపురంబు జేరి కడమయైన దేవాలయంబులు గట్టించి చెన్న రాయని ప్రతిష్ఠ చేసి యక్కడ నొక్క కోనేరు గట్టించెను. మరియొకనా డా రాజు సముఖమునకు త్రిదండియను [55] ముని యే తెంచిన వారల బహు విధముల పూజించి వారిచే వారియాశ్రమ మహత్త్వంబు విని[56] యచ్చటను శివా లయంబులు గట్టించెను. రాజ్యంబేలు సమయంబున నొక్కనా డారాజు పట్టణం బున గ్రాసార్థులైన పరిజనంబులు శకటంబునకు రక్షకులై యుండి రాత్రి వచ్చు నెడ నాగ్నేయ భాగంబున క్రోశద్వయ దూరంబున నిర్నిమిత్తంబుగ వచ్చు నొ బండి యొరిక నొరగింబడెను. ఆ రాత్రి శకటంబు చక్కంజేయ రామికి వారచ్చట నిలిచిన వేగుటయు బహుజనంబుల గూర్చుకొని యా బండి చక్కం జేయు సమయంబున యా బండికమ్మి శుద్ధ సువర్ణంబగుటయు జూచి యా సువర్ణంబు తమకు లభింపకుండుటం జేసి యతి త్వరితంబున కాకతిప్రోల[57] రాజున కెరింగించిన విస్మయానంద భరితుఁడై అతి త్వరితంబున బుధజన పురోహి తామాత్యులతో నచ్చటికి చనుదెంచి యచ్చట పాతించిన పరుస వేదియగు శంభు లింగంబు గనుపట్టె. తజ్జ్యోతిర్మయంబగు సువర్ణలింగంబును హనుమకొండకు గొనిపోవ నుద్యోగించిన నా దేవుండు దరలకుండిన చింతించి కాశేశ్వర నివాసు లైన రామారణ్య శ్రీ పాదులను మహేంద్ర శ్రీ పాదులను హిడింబాశ్రమ నివాసు లైన త్రిదండి ఋషులను[58] బిలిపించి వారల నెదుర్కొని యత్యంత వినయ భరితులై యర్ఘ్యపాద్యంబుల బూజించి యా దేవుని జూపెను.

## కాకతిప్రోల రాజు ఓరుగల్లుపురంబు నిర్మింపఁజేయుట

అంత వారలత్యంత హర్షంబుగా నద్దేవునికి విభూతి ధారణంబుం జేసి అద్దేవుండు మధ్యప్రదేశంబున నుండునట్లుగా గొలిచి యోజన విస్తారంబుగా పురంబు

గట్టుందలంచి శాలివాహన శకవర్షము ౯౧౯ యగు శుభకృత్తునామ సంవత్సర కార్తీక శు ౫ గురువారంబున రోహిణీ నక్షత్రంబున[58] ఓరుగల్లు[59] పట్టణంబు గట్టిరి.

ఆపురి యభేద్యం బగునట్టుల రామారణ్య శ్రీ పాదులు దలంచి శ్రీవిద్యా క్రమంబను[60] యంత్రప్రకారంబుగా కోటకు రేఖలు వ్రాసి చుట్టును ప్రహరిగోడ గట్టించెను.

హనుమకొండ ద్వారమునుండి[61] స్పర్శ వేదియగు శంభులింగంబు నగర పర్యంతంబు రెండు కోసులవీధి యేర్పరచి యుభయ పార్శ్వంబుల దేవాలయం బులు ముక్తీశ్వరుండును, శ్రీ విశ్వనాధుండును, భీమేశ్వరుండును, విరూపాక్షుం డును, రామేశ్వరుండును మొదలుగాగల ఈశ్వర స్థానంబులు ఇన్నూట యేబది యును వేంకటనాథుండును, శ్రీరంగనాయకులును, గోపాలుండును, పాంచాల రాయుండును, ఆదిగా గల విష్ణుభవనంబులు నూరును,[62] దేవీభవనంబులు ఏబదియు,[63] వీరభద్ర వినాయక భైరవ భవనంబులు నలువదియును,[64] గట్టిం చెను. ఈ దేవతలకు ప్రతిష్ఠలుచేసి రామారణ్య శ్రీ పాదులు కాకతిప్రోల రాజుతో నిట్లనిరి.

"నీవునిత్యంబును శంభులింగంబు పూజానంతరంబున లోహము స్పర్శ చేయించిన నదిశుద్ధ సువర్ణంబగు. అది నీవు నిత్యవిని యోగంబు చేసికొ"మ్మనిన, నారాజుభారువు తెరంగెరింగించు డనెను. ఆరామారణ్య శ్రీపాదులట్లకాక యనుచు అబారువులలెక్క వినుమనిరి.

"నూటయిరువది గురిజలయెత్తు నొక్కతుల మనంబరగు. అట్టితులములు నూటయిరువది యొక్కవీసె యనంబడు. అట్టి వీసెలు నూటయిరువదియైన బారువ యనబడు. ఇది కలియుగ వ్యవహారవుబారువ" యని యెరుంగ బలికి రాజుచే ననుజ్ఞాతులై కాశేశ్వరంబునకు ఋషులతో జనిరి.

అంతకాకతిప్రోలరాజుమునులయనుజ్ఞవడసినిత్యంబును నయోమయంబు[65] బారువచెప్పించి జ్యోతిష్కరంబై పరుసవేదియగు నాలింగంబునకు స్పర్శ చేయించిన నది శుద్ధవర్ణంబైన ఆ ద్రవ్యం బుదేవబ్రాహ్మణ కార్యార్థంబుగా నిత్య వినియోగంబుచేయగ నొక్కసుతుం డుద్భవించెను.

# రుద్రుని చరిత్ర

ఆ వేళ నెఱింగి భూసురు లేకాంతంబునకు కాకతిప్రోలరాజును బిలిచి "ఈ బాలునిచేత నీవు మృతిబొందగలవు. బాలుని ఛేదించు"[66] మనిరి. ఆ మాట భూపాలుండు విని తనదేవియుం దానును నబ్బాలుని మధ్యరాత్రియందుఁ బరులెవ్వ రెరుంగకుండునట్లుగఁ గొనిపోయి శంభుదేవుని ముందటి మంటపంబునఁ బొత్తెల పరచి యా బాలునికి స్తన్య పానంబులు చేయించి పొత్తెలయందు నబ్బాలుననిడి యిద్దరు దంపతులు నిజనివాసంబునకుఁ జనిరి.

అంత నాగుడి కావలివార లేతెంచి యీ శిశువుంజూచి యాశ్చర్యచకితులై రాజసముఖంబునకు నేతెంచి యబ్బాలుని తెరంగెఱింగించిరి.

భూపాలుండునువిని యెరుంగని యట్లాశ్చర్యచిత్తుండై పుత్రిమోహంబు మనంబునం బెనంగొనఁ బురజనుల యట్ల తానును శంభునగరికింజని యబ్బాలునిం జూచి కటకటంబడి పెద్దపూజారిం బిలిచి యిబ్బాలుండు సర్వలక్షణ సంపన్నుండు, వీనిని అతి రహస్యంబున బోషించుమని రుద్రిజియ్యకు నొప్పనఁజేసి యబ్బాలునకు రుద్రినామంబుబెట్టి బిల్చుచుండెను. అంత నబ్బాలుండుదినదిన ప్రవర్ధమానుండై సం జూచి రాజశేఖరుండు విధ్యుక్తప్రకారంబుగా నుపనయనంబు చేయించి క్రమంబున [illegible] వేదాధ్యయనాది సకల శాస్త్రంబులును, ధనురాది సాధనాభ్యాసంబులును జపతపోమంత్రంబులును చేయించుచుండెను.

అంత నబ్బాలుండు నవయౌవనుండగుట తోడనే నా భూపాలుండు కౌమారునిం బిలిపించి బహువిధంబుల గారవించి యాతనికి నిద్దఱు భటుల[67] కొలువుండఁజేసి వారికిఁ గట్టడిజేసి పరులెవ్వరు తనయాజ్ఞలేక శంభులింగంబు నగరు జొచ్చరేని శాసించుమని యాజ్ఞాపించి పంపెను. అక్కుమారుండు రాజాను మతంబున సకల వైభవంబులుగొని శంభులింగంబు నగరికింజని రాజాజ్ఞ క్రమంబున నచటనుండెను.

# మహాదేవరాజు చరిత్ర

కాకతిప్రోలరాజునకు మఱియొక్క సుతుం డుద్భవించెను. అతనికి మహాదేవరాజని నామకరణంబుఁ జేసెను. అంత నా మహాదేవరాజునకు మహారోగంబు బొడమిన విద్వాంసులఁ దోడితెచ్చినవారలు దీని నివృత్తిగా బరిహారంబెఱింగి యైదువేల పుట్లతిలలు పర్వతాకారంబుగాఁ బోయించి తదగ్రంబున పన్నెండు మణుగుల కాలపురుషుఁడను ప్రతిమను ప్రతిష్ఠించి అరుణపుష్పాక్షతలు అనేక వస్త్రములు నలంకరించి పదిలక్షల సువర్ణ నిష్కంబులు దక్షిణలొడ్డి తమ పురోహితుల బిలిపించి యిందుకు దగిన ఫలదానంబు లిప్పించుడనిరి.

ఆ సంగతివిని పురోహితుడు రాజుతో నిట్లనెను. ఈ పురంబునున్న విప్రులందఱును దేవరవారిచేత దానంబులు పట్టినవారలుగాన పట్టరాదు. మన పురంబున నొక్క బ్రాహ్మణుండు దూదికేశవపిన్నయ్య యనునతఁడు శుక్లభిక్ష చేయుచు నెవ్వరిచేదానంబు పట్టనొల్లకయున్న వాఁడు. అతనిని మీరుపత్నీసమేతులై తద్గృంబునకుం జని ప్రార్థించిన నతండు దానంబంగీకరించునని చెప్పిన, నా రాజు పత్నియుం దానును నుపవసించి ధవళవస్త్రంబులు గట్టుకొని విహిత కార్యంబు నిర్వర్తించి యా రాజదంపతులు మధ్యాహ్నసమయమున దూదికేశవ పిన్నయ్య గృహంబునకుం జనిరి.

## దానపరిగ్రహణమున దూది కేశవపిన్నయ్య బ్రహ్మరాక్షసుఁడగుట

ఆ విప్రుండు వైశ్వదేవ బలిహరణంబు గావించి చనునప్పుడు రాజు తన దేవియుం దానును దమకు బుత్రభిక్ష చేయుమని దానలాభంబుల ప్రార్థించిన, నా విప్రుండు వారల వాక్యంబులు త్రోయక దానంబు పరిగ్రహించెను. ఆ రాజ కుమారునకు మహారోగంబు నివారణంబయ్యె. అంత దూదికేశవపిన్నయ్య బ్రహ్మ రాక్షసుండగుటయుంగని కాకతిప్రోలరాజు అతనిసతీసుతులను బిలిపించి యపార ద్రవ్యంబు లొసంగి బహుజనంబుల సహాయంబుజేసి వారణాసికిజని తద్దోష విముక్తి జేసికొమ్మనెను. తదాజ్ఞా ప్రకారంబున వారణాసికింజని సకల జనంబులు జూడ దూదికేశవ పిన్నయ్య పుణ్యలోకంబున కరిగెను.

## రుద్రమహారాజు తనతండ్రియగు కాకతిప్రోలరాజును జంపుట

తదనంతరంబున కాకతిప్రోలరాజు డెబ్బదిరెండు వర్షంబులు మహా మహిమ శోభిల్లు రాజ్యంబుం బాలించెను. అతడు షట్కాల శివపూజాపరుఁడు గావున నొక్కనాడు మధ్యరాత్రి శంభులింగంబునగరి కరిగి పదిలంబున సింహ ద్వారంబున నిలిచి యొక్కరుండ మంటపంబునకుంజని ద్వారంబునకు నడ్డంబుగా నొక్క మహనీయ తల్పంబునఁ బవ్వళించి సుఖసుప్తుండైన సుతుం గాంచి, యతని పూర్వరేఖలు చూచి కటకటంబడి పుత్రమోహంబున నిద్రా భంగంబు గాకుండునట్లు తలుపులు ఒరగిలంజేసి యద్దేవుని సముఖంబునకుంజని పూజగావించి తీర్థప్రసాదంబులు గైకొని మగుడ వచ్చుచుండెను. అంత విధి వశంబునఁ గాకతిప్రోలరాజు జంఘలు సుతుఁడగు రుద్రమహారాజు బొటిమన వ్రేలుకు తాకెను. అంత నాతడు దద్దరిల్లి లేచి ద్రుచ్చు ద్రుచ్చుయని యరచుచు తనచేతి సురియచే బొడచిన, నతండు రాజవుట నెఱింగి గడగడ వణంకుచు నాయుధంబుదీయక నిలుచుండెను.

అప్పుడా రాజు గుడివెలుపలనున్న జనులకు మంత్రి పురోహిత సామంతు లం బిలువుండని యానతిచ్చి యత్యంత భయాకులితచిత్తుండైయున్న తనపుత్రునిం జూచి నీవు భయపడకుమని వచించెను. వానిదగ్గరకు బిలచిగాఢాలింగనంబు జేసి నీవు నా గర్భంబున బుట్టిన సుతుండవని పూర్వవృత్తాంతంబు దెలియఁబలికెను. పుత్రా! యింత విచారమేల ఇది నీవు చేసిన పనిగాదు. తనకొరకు విచారపడకు మని గారవించెను,

## రుద్రమహారాజు పట్టాభిషేకము

భృత్యులతోఁ వచ్చిన పురోహిత ప్రధానులకు రాజాపోటుచూపి యతండు తన గర్భజాతుం డగుటదెలిపి వీనికిఁ బట్టంబు గట్టుడనిచెప్పి తత్‌క్షణంబ రుద్రమహారాజును పట్టాభిషిక్తుంజేసెను. పద్మాక్షిదేవి వరప్రసాదంబున ఖడ్గ ఖేటకంబులు సింహాసనమున నిడి గండపెండేరమును నతనికిచ్చి దినత్రయంబు నిలిచి కాకతిప్రోలరాజు కైలాస నివాసుండయ్యెను.

## రుద్రమహారాజు సింహాసనం బెక్కుట

### శాలివాహన శకము ౧౧౮౪ నుంచి ౧౨౧౨ వరకు

రుద్రమహాదేవరాజు పట్టాభిషిక్తుండై రాజ్యం బేలుచుండి మైలారుదేవరకు[68] నొడ్డపల్లి వినాయకదేవరకును మొగిలిచెర్ల ఏకవీరాదేవికిని [69] గుళ్ళుకట్టించి ప్రతిష్ఠలు చేయించెను. తన యాజ్ఞకు మరలబడ్డ కటకవల్లభునిపైఁ జని వానిని సంహరించి వాని సుతునకుఁ బట్టంబుగట్టి రెండుకోట్ల సువర్ణ నిష్కంబులు నప్పనంబులు పుచ్చుకొని ఫలసాట[70] పృధీశ్వరులపై దండువెడలి వారిని సాధించి వారివద్ద వరహా లప్పనంబులు[71] పుచ్చుకొని మగుడి పురంబు ప్రవేశించెను.

తరువాత తండ్రినిఁ బొడిచిన దోషంబు విముక్తి యగునట్లు జగదాచార్యాను మతంబునఁ గాశీవిశ్వనాథుని పూజాప్రకారంబులు మహామహిమగాఁ జేయించెను.[72] మఱియు శ్రీనగరంబునకుఁ[73] బోయి మల్లికార్జునలింగంబు సేవించెను. అచ్చట నెనిమిది [74] తులాభారంబులుదూగి కోటిసువర్ణంబులు దానంబులు చేసెను. అనంతర మేకశిలానగరంబునకు వచ్చి తత్పుర మధ్యప్రదేశంబున ముప్పది మూడుకోట్ల సువర్ణంబులు తెప్పించి సహస్రలింగంబుల శివాలయంబులు గట్టించెను. మఱియు హనుమకొండకు సహస్రస్తంభముల గుడియును మఱియుఁ బెక్కు దేవాలయంబులు కట్టించెను.

అందు రుద్రేశ్వరుల ప్రతిష్ఠలు చేసెను. దిగ్విజయంబు చేసెను. మగుడి పురంబునకువచ్చి తన తమ్ముండైన మహదేవరాజు దుర్మతంబు [75] నెఱింగి యతని గిరిచేయించెను.[76] తనకు సంతానంబు లేకునికిఁ జింతించి శ్రీశైలంబునకుఁ బత్నీయుక్తుండై చని శ్రీమల్లికార్జునలింగంబు సేవించి యక్కడనున్న సిద్ధులకును మతాధిపతులకును నానావిధవస్తు సముదయంబు లిచ్చి వారల చిత్తంబునకు మోదంబు గలుగచేసెను. ప్రసన్నంబగునట్లుగాఁ బూజలు చేసెను. అంత వారల ప్రసాదంబున నొక్క సుతుండు గలిగెను. ఆతనికి గణపతి దేవుండని నామ కరణం బిడియె. మఱియుఁ గొందఱు సుతులుంగలిగిరి.

పాండ్యదేశాధీశ్వరునిపై దండయాత్ర గదలి వానిని సాధించి వాని సుతునికిఁ బట్టంబుగట్టి వానిసుతునిచేఁ గోటిసువర్ణ నిష్కంబు లప్పనంబులుగొని సేతుబంధు రామేశ్వరంబునకుం జని ధనుఃకోటి తీర్థంబునాడి యచ్చట నెనిమిది తులాభారంబులు దూగి మగుడ యేకశిలానగరంబు ప్రవేశించెను.

## మహాదేవరాజు (రుద్రమహారాజు తమ్ముడు) సింహాసనం బెక్కుట

శాలివాహన శకము ౧౦౫౨ నుంచి ౧౦౫౯ వరకు

అంత మహాదేవరాజు కొందరి పరిజనంబుల వశంబు చేసికొని రుద్ర మహాదేవరాజును బొడిచి తనకుఁ [77] బట్టంబుగట్టు మనినవారు మహాదేవరాజుతో నిట్లనిరి. నీవు రుద్రమహాదేవరాను వధించిన కారణంబున నీకు పట్టాభిషేకంబు పూజ్యంబుగాదు. ఈ రుద్రమహాదేవరాజు సుతునకుఁ బట్టంబుగట్టి నీవు యువ రాజువు కమ్మనిరి. అతండట్లచేసిన నా మహాదేవరాజు మూడుకోట్ల సేనలతో గణపతిరాజు సహితంబుగా [78] దేవగిరిమీదికి దండుపోయి మాసద్వయంబు ఘోరయుద్ధంబుఁ జేసెను. అంత దేవగిరిరాజుచే మహాదేవరాజు గతించెను. [79]

## గణపతిరాజు సింహాసనం బెక్కుట

శాలివాహనశకము ౧౦౫౯ నుంచి ౧౧౨౬ వరకు

అంతట గణపతిదేవుండు తన పినతండ్రినిం జంపిన దేవగిరిరాజు వంశ క్షయంబు చేసెను. హతశేషులు భయాకులిత చిత్తులై కోటి ద్రవ్యంబులు కానుక బట్టి గణపతి దేవునకు నతని కూతురు రుద్రాదేవిని[80] సర్వాభరణ భూషితుల జేసి కానుకబెట్టిన నాకన్యకను వివాహంబై యేకశిలానగరంబునకు వచ్చెను. తనకు మర్లబడ్డ తమ్ములను ప్రహరించి తాను పట్టాభిషిక్తుండై ఓరుగంటి శిలా ప్రకారంబు లేర్పరచెను.

## తిక్కనసోమయాజి శివదేవయ్యను వీశ్వరునిగఁ జెప్పుట[81]

అంత నెల్లూరినుండి తిక్కనసోమయాజి గణపతిదేవరాజుచే ననుజ్ఞాతుండై పోవునప్పుడీ రాజు సింహాసనంబున మంత్రియైయున్న శివదేవయ్యగారిని జూచి

యితం డీశ్వరుండుగాని మనుష్య మాత్రుండుగాఁడు గావున రాజ్యభారం బితని యనుమతిని నడుపుమని చెప్పి చనెను.

క. వనుచు నెడదిక్క మఱియ
జ్జనవర సింహాసనమున సచివాగ్రణియై
దనరెడు శివదేవయ్యం
గనుగొని యా రాజుతోడ, గడకంబలికెన్

తే. గీ. వసుమతీనాథ! యీతడీ, శ్వరుఁడెగాని
మనుజ మాత్రుండుగాఁడు పల్మారు నితని
యను మతంబున నీవు రాజ్యంబు నెమ్మి
నేలుమనిచెప్పియాఘనుఁ,డేగుటయును. (సోమదేవరాజీయము)

గణపతిదేవుని కృత్యములు

తదనంతరంబున గణపతిరాజు శివదేవయ్య యనుమతి గైకొని ప్రయాణ భేరి వేయించి బలసమేతుండై మున్నూరువేల సాటిరాజుల గెలిచి [82] వారిని తన యాజ్ఞకు లోనుగాజేసి వారిచే నప్పనంబులు గైకొనెను. అంత నెల్లూరికింజని అక[illegible]గారిని భేదించి మన్మసిద్ధిరాజును [83] దిరిగి యభిషిక్తుంజేసి రెండువేల యేనూరు [84] గ్రామంబులతనికి చెల్లుజేసి కడమవి తనవశంబు జేసి కొనెను. నెల్లూరనొక్క మహాతటాకంబు త్రవ్వించెను. సిద్దరాజుచేఁ బూజితుండై మగుడి గంగాపురంబునకు [85] వచ్చి పెక్కు శివాలయంబులు రెండు గోపురం బులు గట్టించెను. అక్కడ నొక మహాతటాకంబును గట్టించెను.

మరల నేకశిలానగరంబునకు వచ్చి నగరిలో ననేక రాజగృహంబులు గట్టించి తన నగరికి వెలికె ప్రాకారంబు గట్టించెను. ఒడ్డె పాండ్యులపై [86] దండు వెడలి వారిని సాధించి వారిచే నప్పనంబులు పుచ్చుకొనెను. తనయాజ్ఞ సఫలంబు చేసికొని శ్రీగిరి దర్శించి మల్లికార్జునలింగంబు సేవించి పన్నెండు వేల సువర్ణ కమలంబులఁ బూజించెను. పంచారామంబు [87] సేవించి షోడశ మహాదానంబులు చేసెను. అడపగుండయ్యను బిలిపించి ఎలుగూరు [88] సర్వమా న్యంబుగా నొసంగి యొక్క మహాతటాకంబు గట్టించెను.

అంత గణపతి దేవుండు పండితారాధ్యులచే [89] దీక్షగైకొని యమ్మహా దేశికునకు రెండు గ్రామంబు [89a] లొసంగెను.

తన రాజ్యంబునం గలుగు గ్రామంబు లొసంగుచుం దానునన్నిటను శివాలయంబులు [89b] గట్టించుచు శ్రీరాములు రాజ్యంబేలిన చందంబునం దనభూమి జనంబులకుం జక్కగ సకలవస్తు సామగ్రి సమృద్ధిగానిచ్చి రాజ్యంబేలుచుండెను.

## గుండబ్రహ్మయ్యగారి [90] వ్రతనిష్ఠ

ఒక్కనాడు దక్షిణదేశంబునుండి గుండబ్రహ్మయ్యగారు శివభక్తి తాత్పర్యులై శరణాగత రక్షణత్వము తమకు వ్రతంబు చేసికొని శివభక్తిగలిగి యేకశిలానగరంబునకు బండ్రెండు బిడారంబులు సకలవస్తువులు నించుకొని గవిచర్ల సమీపంబున [91] సకల వ్యవహారంబులు సలుపుచుండెను.

అంత శ్రీమన్మహాదేవుండు వారల వ్రతంబు చూచుటకై కాలునింబంపెను. అక్కాలుండు చోరరూపంబుదాల్చి గణపతిదేవుని నగరికిం కన్నంబువేసి సమస్త వస్తువులు సామగ్రి ముచ్చిలి పుచ్చుచుండెను. అంత నగరి కావలి వారలెరింగి యా చోరుని వెంబడించిరి, కాని యా చోరుండు వారలకు జిక్కక పురంబు వెలువడి గవిచెర్లనున్న గుండ బ్రహ్మయ్యగారి కడకేగెను. తనవెంట బరతెంచుచున్న రాజభృత్యులంజూచి తాను తస్కరుడ ననియు రాజగృహకబు నకుం గన్నంబు వేసినవాడననియు నెటకేనియుం బారిపోవ నమయంబునం మిమ్ములగని శరణంబుజొచ్చితి కావుండని దీనాలాపంబులు బలికి ప్రార్థించెను. అంతనాతడు తస్కరుని భయంబు గనుగొని వాని దగ్గరకుం బిలిచి వెనుజరచి యభయంబిచ్చి వణుగకుమని వెనుకకు దీసికొనెను.

అంతట రాజభృత్యు లేతెంచి, యాతడు తస్కరుండు అతని బట్టుటకై మేము వచ్చిన వారలము నిలువు నిలువుమనిన వారంతో నాతడు తాను శరణాగత రక్షకత్వం బను వ్రతంబు గైకొంటిననియు నీ తస్కరుండు మాకు శరణు జొచ్చిన వాడనియు నీ తస్కరుని మీకు నివ్వకుండుట నిజంబని బలికెను.

## రాజు గుండబ్రహ్మయ్యను కొరత వేయుట

అంత రాజభృత్యు లతివేగంబునఁ బరతెంచి యా భూపాలునితో జరిగిన వృత్తాంతమును విన్నవించిరి. ఆ భూపాలుండు విని గుండబ్రహ్మయ్యను రావించి చోరుని యిమ్మని యడుగగా నాతఁడు రాజుతో నిట్లనెను. మేము శరణాగత రక్షకత్వం బను వ్రతంబు గైకొన్న వారలము. ఈతస్కరుండు మాకు శరణు జొచ్చినవాడు. వాని నియ్యకుండుట నిజంబు మీరెట్లు దండన విధించినను సరియే. 92 ఇంతయేల చంపదలంచెద రేని యా చోరునకై మాయిరుపుర ప్రాణం బులిచ్చెదము గైకొనుమని పలికెను. అట్లకాకయని పరిజనంబులతో 93 వీరలని గైకొని వీరలాశీర్వాదంబు గైకొని శూలప్రాప్తులఁజేసి యా చోరుని విడుఁవుడం యా భూపాలుం డాజ్ఞాపించెను.

అంత పరిజనంబు లేతెంచి వారలఁ దోడ్కొనిపోయి గవిచర్లకడ శూలం బులు పాతించి కొరతవేయు నప్పుడా వురిగల శివభక్తులును, బుణ్యపురుషులును, బుణ్యాంగనలును, మఱియు నానాజనంబు లేకంబుగాగూడి చోరునికై తమ ప్రాణంబులిచ్చు గుండబ్రహ్మయ్య గారినిఁ జూడ జనుదెంచిరి. అట్టి సమయంబున గుండబ్రహ్మయ్యగారు దనవ్రతంబు కడతీర చెల్లెనని సంతోష చిత్తులై శివ లింగంబు బూజించి శూలంబుల పైఁ బడినఁ గుసుమకోమలంబులై యుండెను. 94

## శివుండు ప్రత్యక్షంబగుట

అప్పుడు శ్రీమన్మహాదేవుండు ప్రత్యక్షంబై పుష్పవృష్టిఁ గురియుచుండ వారల విమానారూఢులగు మన గుండ బ్రహ్మయ్యగారిట్లనిరి. మేము శరణాగతుని విడిచి ఎట్లు విమానం బెక్కుదుము. మా వెంటనే చోరునకు కైలాసంబు కృప నేయుమనగా కాలుండు చోరరూపంబుమాని మహిషవాహనుడై నిజరూపంబుఁ జూపించెను. గుండబ్రహ్మయ్యగారు కైలాస నివాసులయిరి.

## గణపతిరాజు కృత్యములు

తదుపరి గణపతిరాజేకశిలానగరంబునకు నైరుతి భాగంబున యోజన త్రయ దూరంబున నొక్క మహాతటాకంబు గట్టించెను. దాని కీశాన్యభాగంబున

గణపురంబను పురంబు గట్టించెను. అక్కడ శివాలయంబులు గట్టించి ప్రతిష్టలు చేసెను. అంత రాజ్యంబు పాలించుచు నేకశిలానగరంబునకు పశ్చిమ భాగంబున యోజన పంచకంబగు[95] దూరంబున పురంబు[96] గట్టించెను. మూరు రాయ గండ పెండారంబులు వామపాదంబున ధరించెను. అనంతరము కటకస్థలభునిచే నప్పనంబులు గొని తెప్పించెను. గోదావరి గర్భంబునం గొన్ని క్రతువులు గావించెను.

## సిద్ధుండు గణపతి రాజునకు పాషాణమునరికి జలధారనుజూపించుట

అతడు రాజ్యంబేలు సమయంబున నొక్కనాడొక సిద్ధుండు చనుదెంచి గణపతిరాజు సముఖంబున నిలిచి యిట్లనియె. నేను యోగసిద్ధికొరకై భువన భోభాగంబుల సంచరించి వచ్చుటం జేసి మహాదాహంబు జనియించెను. ఇందుకు శతఘటంబుల క్షీరంబులు సంపూర్ణ సిద్ధికి బోయించినగాని దాహంబు మానదని సిద్ధుండు పలికిన నా క్రమంబునం దన సేవకులచే దెప్పించి శతఘటంబులు పూర్ణములుగా క్షీరంబుల వెదకి పోయించెను.

ఒక్క యామంబుననన్నియు నుద్రాగినంజూచి[97] గణపతి మహిరాజాశ్చర్య చిత్తుండాయెను. అంత నా సిద్ధుండు గణపతి దేవుని హనుమకొండకు దీసికొని పోయి యా కొండమీద తూర్పుదిక్కున గుహ వాకిట పాషాణంబు వెగనరికించి యందు సిద్ధుండొక్క ధారను గణపతి రాజుకుం జూపి యీ జలంబులు కేదార తీర్థంబులు. హేమోదకంబులు గాని సహజ జలంబులు కావని విన్నవించెను.

హేమ సంకాశంబైన జలంబులు చూచి రాజాశ్చర్య చిత్తుండయ్యె. అక్కడ కేదారలింగంబు హనుమద్గిరి నాథుండను విష్ణువిగ్రహంబు[98] ప్రతిష్ఠం జేసి యేకశిలానగరంబునకుం దిరిగివచ్చెను.

## గణపతి రాజునకు ముమ్మమ్మయను కుమార్తె జనించుట

గణపతి మహారాజు తనకు సంతానంబు లేకునికి పద్మాక్షీ వరప్రసాదంబున నొక కన్యకారత్నంబునుం గాంచి ముమ్మమ్మయను[99] నామకరణంబు జేసెను.

ఆ కోమలి నవయౌవనను రాలైనఁ జూచి చోళాఖ్య తిలకుండగు వీరయ్య దేవుండను రాజసుతునకు[100] వివాహంబుఁ జేసి యెనిమిదికోట్ల సువర్ణంబులు నిక్షేపంబు జేసెను. తనపురంబు నంగల యగ్రగణ్యుని జూచి మీకు నాయకత్వం బిచ్చెద మనిన మాకు క్షాత్ర ధర్మంబు లొప్పవని వారుపల్కిరి. అంత నానా వర్ణంబులు వారికి నాయకత్వంబు కృపజేసెను. నానామండ లీకరగండ[101] బిరుదు జెల్లించుకొని గణపతి దేవుండరువై యెనిమిది యేండ్లు[102] రాజ్యంబు పాలించి శివలోకంబున కరిగెను.

## రుద్రమహాదేవి రాజ్యంబు పాలించుట
## ఈమె గణపతి రాజు యొక్క భార్య

శాలివాహన శకము ౧౧౭౭ నుంచి ౧౨౦౫ వరకు

రుద్రమహాదేవి వీరపత్ని[103] గావున పద్మాక్షీ దేవి దత్తంబైన ఖడ్గ ఖేటకంబులు సింహాసనంబున నిడి శివదేవయ్యగారి[104] యనుమతంబున రాజ్యంబు పాలింపు చుండెను. తొలుతం జేయగ మిగిలిన కలుకోట మహోన్నతంబుగా గట్టించెను. తన భూమి ప్రజలకు నుండుటకు భూమికోటలు వేయించెను. ఆ నడుమ యున్నతంబుగా పుట్టకోట వేయించెను. కలుకోటకు నాలుగు గవిను లున్ను నాలుగు దిడ్డులను నేర్పరిచెను. భూమికోట కెనిమిది గవినులున్ను పదహారు దిడ్లు నేర్పరిచెను. అనేక శివాలయంబులు గట్టించెను. పురబాహ్య గణములందుఁ సర్వ వృక్షంబులు వేయించెను. అయిదువేల విప్రులకు వివాహంబులు చేయించెను. చెరువులు త్రవ్వించెను. సత్రంబులనేకముల పెట్టించెను. నాలుగుకోట్ల నిక్షేపం బుల చేసెను. కటకవల్లభునిపై దళంబుల పరిచి వానిచేనప్పనంబులు గొని తెప్పించి వానిని తన యాజ్ఞకులో జేసికొని మహావైభవమునఁ దనరు చుండెను. తన కూతురైన ముమ్మమ్మ మహాదేవికి మంచి సుతుండు కావలెనని నోము నోమించెను. తమ తమయింటి వేలుపైన కాకతమ్మకు జాతరఁ చేయించెను. ఒడ్డేపల్లి వినాయకునికిన్ని మొగలిచర్ల యేకవీరాదేవికిని అయినవోలు మైలారపు దేవికిని నకల దేవతలకును మహోత్సవంబు చేయుచు నయిదుదినంబులు పురంబు వెలుపల యుండెను.

అంత సవతి సుతులైన హరిహర దేవుండును మురారిదేవుండును బరిజనం బుల గొంతటిని (గూర్చుకొని పట్టణంబు గవాటంబులు మూయించి బోసీయక మరలబడ్డ వారలను సామోపాయంబున మట్టుపరచి రుద్రమాంబ పురంబు ప్రవేశించి వారల బంధించి పుత్రమిత్ర కళత్ర సహితంబుగా దునిమించెను. హనుమకొండ[104a] సిద్ధేశ్వరుని సహస్ర కమలంబుల (బూజించెను. పద్మాక్షీ దేవికి నిత్య మహోత్సవంబు గావించు చుండెను.

అంత దేవగిరి రాజు సమస్త సేనాసమేతుండై యేకశిలా నగరంబు పై విడిసిన వారలతో నెదిరించి యొక పక్షంబు ఘోరయుద్ధంబు (జేసి మూడు లక్షల పదాతుల నుగ్గు(జేసి లక్షగుఱ్ఱంబుల నేలగూల జేసెను. పారిన వారల వెన్నుతగిలి దేవగిరి జొచ్చుపర్యంతము దరిమి వారినుంచి కోటిద్రవ్యములు కానుక బట్టె. మఱియు నా ద్రవ్యంబు తన సరదార్లకు పంచిపెట్టించెను. అచ్చట జయ స్తంభములు వేయించి వారల తన యాజ్ఞకు లోనుజేసెను. మరియు నేకశిలా నగరంబు ప్రవేశించెను.

అంత సమస్త బంధు సామంత బలంబుల కుమారులకు రుద్రమహారాజు పేరు పెట్టించెను. సకల జనంబులు "అంబా" యని పలుకుట (జేసి తనపేర అంబాలయమను గ్రామంబు (గట్టించెను. నిజ నామంబున వేయి రుద్రనగరముల గట్టించెను.[105] అష్టదిక్కుల జయస్తంభంబులనెత్తించిమహావైభవంబుతో రాజ్యం బేలుచుండెను.

## ముమ్మమ్మ గర్భముదాల్చి ప్రతాపరుద్రుని కనుట

అట్టి సమయంబున ముమ్మమ్మదేవి గర్భము దాల్చెను. నవమాసములు నిండగా శివదేవయ్య గారిని రావించి పూజించి ఈ శుభవార్త నెరింగించెను. అంత నా మను (డిట్లనియె. ఈ ముమ్మమ్మ గర్భంబున నుండిన బాలుండు సర్వలక్షణ సంపన్నుండు విక్రమార్కుడను దానకర్ణుండు, అఖిలక్షోణీత లాధ్యక్షుండు నగును. ఇదినిజంబు. అబ్బాలుం డింద్రసన్నిభుండుగానిమర్త్యంమాత్రుండుగాడు. పది నెలలకు బుట్టినప్పుడే యబ్బాలుండు సింహాసనం బెక్కగలండు. ఈ వచ నంబు సత్యంబనిన విని యత్యంత హర్షంబుతో శివదేవయ్య వచనంబుల( దన సామంత వర్గంబున కెరిగించెను. అంత పురంబునం గల దేవాలయంబుల

శృంగారంబులు చేసి యద్దేవతల మహావైభవంబులఁ బూజించెను. నృత్యగీతాదులను బంచమహావాద్యంబులు[106] ఘోరున మ్రోగంగఁ జేసి పురంబెల్ల శృంగారించెను. భూసురుల బిలిపించి యాభై లక్షల వరహాలు[107] పంచిపెట్టించెను. సామంత వర్గంబునకు చీనిచీనాంబరములు మణిమయాభరణంబు లొసంగి మీకు రాజు గలుగుచున్నాడని యెరుంగం బలికి వీడ్కొలిపెను.

ఆ దేవికిఁ గ్రమంబున సీమంతాదికంబులు[108] చేయుచుండ దశమమాసంబున శాలివాహన వత్సరంబులు వేయిన్ని పదమూడయిద నరుగుచున్న[109] ఆనంద నామ సంవత్సర[110] చైత్ర శు॥ ౨ గురువారమందు రోహిణీ నక్షత్రంబున బ్రాహ్మముహూర్తంబున సూర్యాంగారక బృహస్పతు లుచ్చస్థానంబున, శనైశ్చరుండు నిజస్థానంబున వసింపఁ ముమ్మడమ్మదేవికి సుతుం డుదయించెను.

## రుద్రమహాదేవుని పుత్రోత్సవంబు చేయుట

అంత రుద్రమహాదేవి[111] యే తెంచి యబ్బాలుని శుద్ధోదకంబుల శరీరంబు గడిగి కొలువుకూటంబునకు వచ్చి సింహాసనంబుపైఁ బొత్తిల పరచి [illegible] నునిచెను. అనంతర మేకశిలానగర మందలి ప్రజల బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రాదులను సామంతులను[112] మన్నీల దొరల భటవర్గంబును నాదిగాగల డెబ్బది నియోగంబులు వారిని రావించెను. ఆ బాలుని వారికి జూపి మీకు రాజు గలిగెను. ఇదిగోయనిన సకల జనంబులును మహానందంబున నోలలాడిరి. ఆ బాలుని వారు దీవించి వెళ్లిరి.

రుద్రమహాదేవి శివదేవయ్యగారిచే నా బాలునికి విభూతి ధరియింప జేసెను. మరియు పుత్రోత్సవంబున వీరు వారనక యా బాల గోపాలంబులకు నయిదుకోట్ల వరహాలు పంచిపెట్టించి చీనిచీనాంబరంబు లొసంగెను. విప్రులకు లక్షధేనువు లొసంగెను. పురంబలంకరించి సమస్త దేవతా వైభవంబులు సాగించి పుత్రోత్సవంబు గావించెను. ఆ రుద్రమహాదేవి సకలజనంబుల సంతోషంబు గాంచి యబ్బాలునకు నొక దివ్యమందిరంబున నవరత్న ఖచితంబైన నొకతొట్టెగట్టి యాతొట్టెలో నా బాలునుంచి మాంత్రికుల నాప్తులను బిడ్డలగన్న వృద్ధాంగనలను నిత్యంబునుం బాలుని జూచుటకు[113] నియమించెను.

## నా మ క ర ణం బు చే యు ట

విధ్యుక్తంబుగా పుణ్యాహవాచనంబులు చేయించి యపార ద్రవ్యంబు భూసురుల కొసంగి శివదేవయ్యగారినిం జూచి యాబాలునకు నామకరణంబు చేయు మన నా యయ్య రుద్రమదేవికి యిట్లనియె. ఆ బాలుండు నీ పేరు మోసుకొని నీ యట్ల ధరాచక్రంబు మహామహిమతోఁ బాలించునని ప్రతాపవీరరుద్ర దేవు డని నామకరణంబు చేసెను.

ఆ బాలుండంత దినదిన ప్రవర్ధమానుండై శుక్లపక్ష సుధాకరుంబోలి పెరుగుచుండెను. అట్టియెడ ప్రతాపరుద్రునకుఁ బీడాపరిహారార్థంబుగా మూడు వేల వరహాలు పంచిపెట్టు చుండెను. అబ్బాలునకయిదు వర్షంబులు రాగనే రుద్ర మహాదేవి తమ యంకపీఠమునఁ గూర్చుండఁ జేసి యాడించు చుండెను. అంత నా ప్రతాపరుద్రుండు తన్నాశ్రయించిన జనంబులకు యుక్తాయుక్తంబులు దలంచక యేమియడిగిన నదియొసంగు చుండెను. రుద్రమాంబయు నాతని వచనమును జెల్లించుచుండెను. అతండూహ నెరుంగ నంతవరకుఁ బంచిపెట్టిన గ్రామంబులు పదునైదునూరులు మూడుకోట్లు సువర్ణంబులాయెను. అటుతరువాత ముమ్మమ్మ మహాదేవికి మఱియొక సుతుండుద్భవించెను. అన్నమదేవుండను నామకరణంబు చేసెను.

## ప్రతాపరుద్రుని విద్యాభ్యాసము

అంత ప్రతాపరుద్రునకు గర్భాష్టకంబున నుపనయనంబు గావించె, యక్షరా[illegible] వేదాధ్యయనంబును జెప్పించెను, వదియవవర్షంబునఁ బద క్రమంబును బదకొండవఁయేటను ధనురాది సాధనంబు,జితశ్రమలు చేయించెను. పండ్రెండవయేట కావ్యానాటకాలంకార శబ్దశాస్త్రం బెఱింగెను, పదమూడవయేట గజతురగాద్యారోహణంబు లెరింగించెను. పదునాల్గవయేట సమస్తదేశభాష సంజ్ఞ లెరుంగజేసెను. పదియేనవయేటను రాజనీతి ప్రకారంబు ధర్మాధర్మంబును బోధింపజేసెను. పదియారవయేటను విశాలాక్షి మొదలైన రాజకన్యకలను బదియార్వురిని పెండ్లిజేసెను. తదనంతరంబున శ్రీమత్ప్రతాపరుద్రుని సింహాసనంబున నాసీనుంజేయవలయునని తలంచి రుద్రమహాదేవి శివదేవయ్యగారిని రావించెను. తరువాత నాతని పాదంబులకు నృపాలునిచే మ్రొక్కించి యతనిచేత

విభూతి ధరియింపంజేసి, పట్టాభిషిక్తుంజేసి, శ్రీమత్ప్రతాపరుద్రుని నాయయ్యకు నొప్పనజేసెను. ఆరుద్రమహాదేవి ముప్పది యెనిమిదేండ్లు రాజ్యంబు పాలించి దాను శివలోకంబున కరిగెను.

## ప్రతాపరుద్రమహారాజు సింహాసనం బెక్కుట.

శాలివాహనశకము ౧౨౦౫ నుంచి ౧౨౮౨ వరకు

ప్రతాపరుద్ర మహారాజు పట్టాభిషిక్తుండై యున్నయెడ గాళేశ్వర నివాసులైన రామారణ్య శ్రీపాదులును మహేంద్ర శ్రీపాదులును మొదలైన మునులేతెంచిరి. అంత వారికి సాష్టాంగ దండప్రణామంబులు చేసి వారలం బూజించి వారలచే దీవనలు గైకొని వారల యభీష్టంబేమని యడిగెను. వారు తమకుం బరుసవేదిలింగంబు సేవించుట మా కభీష్టంబని వచించిరి. అట్లకాకయని యా మునులం దోడ్కొని శంభులింగంబు నగరికింజని యా దేవునిం జూపిన వారలా లింగమును సేవించి చనిరి. తదనంతరంబున గొందఱు దుష్ట నాయకులు గూడి స్పర్శ లింగంబునుగొనిపోవ నుద్యోగించి బహుజనంబుల గూర్చుకొని యా దేవుని కావలివారల గొట్టి నగరు జొచ్చిరి.

ఆ సమయంబున శ్రీమత్ప్రతాపరుద్రుండు వినిదేవదత్తంబైనఖడ్గఖేటకంబుల నిరుగేలంబూని తన సమీపంబుననున్న యాప్తవర్గంబులతోగూడి యా మంటపంబున నున్న దుష్టనాయకుల దునిమెను. మరియు నొక్కనాడా పురిదుష్టనాయకులుగూడి, యాకులచంద్రయ్యయను విప్రుని యిల్లు సొచ్చి సర్వధనంబు లపహరించి విప్రుం బొడచిపోయిరి.

అతండు మూర్ఛాగతుండయ్యెను. భూపాలుండా వార్తవిని యా విప్రుండు చచ్చినం దనకు బ్రహ్మహత్య తగులునేమోయని మహాభయంబంది చింతించు చుండెను. అట్టి సమయమున నావిప్రునిపత్ని పతివ్రతగావున లక్ష్మీదేవి వర ప్రసాదంబునంజేసి తన పెనిమిటికి ప్రాణహానిగాకుండ బ్రతికించుకొనెను.

ఆవార్త భూపాలుండువిని యా విప్రదంపతులను రావించి పూజించి నీని చీనాంబరంబు లిచ్చియొక్క గ్రామం బొసంగి పంపెను. వారలా గ్రామంబున లక్ష్మీదేవిని ప్రతిష్ఠించి యా పురంబును లక్ష్మీదేవి పురంబని[114] పేరు పెట్టి కొనిరి.

## ప్రతాపరుద్రుని రాజ్యపరిపాలనము

తదనంతరంబున నారాజు సంతోషచిత్తుండై కొలువుకూటంబున సింహాసనాసీనుండై తనబంధువరుల రప్పించి సోమదేవరాజు నాటనుండి వంశపరంపరగ గొలుచుచున్న సరదార్లను మన్నీల ప్రెగ్గడలను, మఱియును పురిగలదొరలను తదనంతరంబున వేదవేదాంగపారగులగు విప్రులను బుధజనంబులను, వివేక చతురులగు వారు మొదలుగా గలుగు సకల నియోగంబుల వారిని రావించి, విహితాసనంబుల గూర్చుండ నియోగించి,115 గంధకస్తూరి కర్పూర మిశితంబులైన గంధంబులను దాంబూలంబుల నొసంగి శ్రీమత్ప్రతాపరుద్రుండు వారలతో నిట్లనియె. వింటిరే మొన్నిటిరేయి116 వింత దేవునిపై బందిపోట్లు పడిరి. ఈరేయి విప్రునిపైబడిరి. రాజ్యంబ నాయకంబై యున్నది. ఇందులకు గార్యంబెరింగించు మనెను.

అంత వారలందఱు నేకక్రమముగా నిలిచియిట్లనిరి.నీవు సాక్షాద్రుద్రుండవు గాని మనుజమాత్రుండవుగావు మీర లేరీతింజేసిన నదియే మాకు సమ్మతంబనిరి.

ఆ రాజు విచారించి గణపతిమహారాజు నానా వర్ణంబులవారికి నాయకత్వంబు లిచ్చుటంజేసి బహునాయకత్వంబై యున్నది గనుక యొక్క యుపాయం బిందులకు నుత్తమంబు. ఉత్తమ జాతులవారుదప్ప నాయకత్వంబునకు నితరులర్హులు గారని రాజు యిట్లనియె. మానధనులును విశ్వాసపరులును నతివివేక సంపన్నులును గాంభీర్య సముద్రులును వివేకపరులును బాపభీతులును స్వామి హితోపచారులును నగు సచ్ఛూద్రులు పద్మనాయకులు వీరలు నాయకత్వంబునకు దగుదురని సభాసదులకు శ్రీమత్ప్రతాపరుద్రుండు యెరుంగంబలికిన విని యా సభాసదులు రాజనీతి వివేకమునకు నెంతయం గొనియాడి మాకు సమ్మతం బట్లనే చేయుమనిరి.

117 ఆ ప్రతాపరుద్రుండు పద్మనాయకుల బిలిపించి సన్మానించి యిందుల నాయకత్వంబున కర్తలుగా నేర్పరచి యొక్కొక్క కొత్తడంబున కొక్కరిని సర్వలక్షణ సంపన్నులుగా నొనర్చి వారలకు ధనకనక వాహనాందోళికాదులును నునిచి చీనిచీనాంబరంబుల నొసగెను. మఱియు ఛత్రచామరంబులు నాల వట్టంబులును సాహసకృత్యంబులు బిరుదులు నొసంగెను. డెబ్బదేడు గోత్రములకు

డెబ్బదేడుగురి నిట్లు బహుమానంబుజేసి యేకశిలానగరంబునకు శిలాప్రాకారంబున డెబ్బదియేడు కొత్తడంబు లుండఁజేసి వారి బంధువుల నుపనాయకులఁజేసి కొత్తడంబుల నుండునట్లుగాఁజేసి మఱియు డెబ్బదియేడుగురు నాయకులకుఁ దన రాజ్యంబులో నొక్కభాగంబుఁ బంచిపెట్టెను. మఱియు నొక్కభాగంబు బంధువులకును నొక్కభాగంబుఁ దన మూలబలంబుల కొసంగెను. ఒక్కభాగంబు విప్రుల కొసంగెను. సవిశేషంబైన రాజ్యంబు తన భండారంబునకుఁ జెల్లంజేసి మహామహిమతో రాజ్యంబు పాలించుచుండెను. సప్తసంతానంబు లుద్ధరించెను. హేమాద్రి కల్పోక్తప్రకారంబున సకలదానంబులుచేసి ప్రతివర్షకబును బన్నెండు తులాభారంబులు దూగి కోటిసువర్ణంబులు దానంబులుఁ జేసెను.

## ప్రతాపరుద్రుండు దిగ్విజయంబు చేయుట

అనంతరము దిగ్విజయంబుఁ జేయుటకై సకలసేనల రావించి ప్రయాణభేరి వేయించి కటకవల్లభుని దగిలి వానిని సాధించెను. వాని సుతునికిఁ బట్టంబుఁగట్టి యెప్పటియట్లు మూడుకోట్ల సువర్ణనిష్కంబు లప్పనంబులు గొనెను. మఱియు వానిని సేనాయుక్తంబుగాఁ దనవెంట రావించి యచ్చట పాండ్య దేశాధీశ్వరుల సాధించి వానిసుతునికిఁ బట్టంబుగట్టెను. వానినిఁ దనవెంట రా నియమించి యెప్పటియట్లు నప్పనంబుగొని దక్షిణాభిముఖులై సముద్రతీరంబు నకుం జనెను.

గోదావరి యుత్తరించి రామేశ్వర పర్యంతంబుగాగల పురంబులు దన వశంబుఁ జేసికొనెను.౨౦౦౦ [118]ఓడలు రావించెను. అందుకుఁ దగిన వర్తకులను నియమించి నానాదేశంబులకు వర్తకంబు సేయంబనిచెను.అచ్చట పెక్కుదానంబులు చేసెను. నాల్గుతులాభారంబులు దూగి, తామ్రపర్ణీతీరంబున యున్న సమయంబున నరసింహరాయులు విజయనగరంబునుండి దన మేనల్లుఁడగు నరసింహదేవునిచేఁ బన్రెండు లక్షల పదాతి వర్గంబులతోఁ బ్రతాపరుద్రునిఁ గొలువంజేసి తాను విజయనగరంబునకు మరలెను.

తరువాత ప్రతాపరుద్రుండాడమళయాళ రాజ్యంబేలు[119] ముకుందాదేవి నోడించి ౧౪ వేల సువర్ణటంకంబు[120] లప్పనంబులు గైకొనెను, ఆమె సేనలఁవెంట రా నియమించి టెంకణ[121] మాళవ మళయాళ బాహ్లీక దేశంబులగెలచి వది వదేసి లక్ష లప్పనంబులు గైకొనెను. వారినిఁ గొలిచి రా నియమించి పశ్చిమ

దేశాధీశ్వరుల గెలిచి వారిని తనయాజ్ఞకు లోఁజేసికుని యేబదిలక్షల సువర్ణ నిష్కంబులు పుచ్చుకొనెను. వారిని మూఁడులక్షల గుఱ్ఱంబులతోడనుం గొలువ నియమించి గుజరాష్ట్ర మహారాష్ట్ర దేశాధీశ్వరుల[122] నోడించి వారిచే నప్పనంబులు గొనెను. మఱియుఁ దక్కిన రాజులం గెలుచుచు వారినిఁ దన యాజ్ఞకు లోఁజేసికొని యప్పనంబులు గొని వారిని సేనాయుక్తంబుగాఁ దనవెంట రా నియమించెను.

అంతటఁ బూర్వదక్షిణ పశ్చిమ భూములనుఁ దన యాజ్ఞకు లోఁబరచుకొని యతండు ఢిల్లీశ్వరుండు తనకు నెదురుగాఁ పంపిన కానుకలు గైకొనెను. భాగీరథిం జేరి గంగాయమునా సరస్వతీ కృతస్నానుండై పెక్కుదానంబులు జేసెను. ఎనిమిది తులాభారంబులు దూఁగెను. ప్రయాణభేరి వేయించి యా పట్టణంబు తనవశంబుగాఁ జేసికొనెను. ఆ పురంబునఁగల మాధవదేవునిఁ బూజించి యద్దేవుని వైభవంబునకు నా పురంబిచ్చెను.

ఉ॥ కాశికి నేగి వేగ మణి కర్ణికలోన మునింగి భక్తివి
శ్వేశుభజించి యవ్విభున కిమ్ముగ నప్పురమిచ్చి యిచ్చట
న్నైశలబుద్ధ భూమిసుర బృందములం బిలిపించి వారికిం
గౌశల మొప్పఁ గోటినవ కాంచన నిష్కములిచ్చి వెండియున్
"సోమదేవ రాజీయం"

అటనుంచి కాశికింజని మణికర్ణికయందు మునిఁగి విశ్వనాథుని సేవించి యా నగరంబు విశ్వనాథున కొసంగెను. అచ్చట నిరువది తులాభారంబులుఁ[123] దూగి కోటిసువర్ణంబులు దానంబు జేసెను. అట్టి తఱి నిజభుజా పరిపాలితంబైన దుర్గంబుల కొల వెఱిగించెదను. అట తాళీ సహస్ర చక్రకోటాధీశ్వర బిరుదును ధరాధర బిరుదును సిద్ధ సింహాసనాధీశ్వర మున్నగు బిరుదులను సాధించెను. మఱియు గయ కుంజని యా సుల్తానుచేఁ బూజితుండై యచట సర్వజనంబులచేత మాతా మహులకును పితామహులకును విహిత కృత్యంబులు జేయించెను.

మగుడి వింధ్యనగరంబుఁ దాటి గోదావరీ మంత్రకూటంబుఁ[124] బ్రవేశించి విధ్యుక్త ప్రకారంబు నచటఁ బంన్రెండు క్రతువులు చేయించెను. కాళేశ్వరంబున కేతెంచి ముక్తీశ్వరుని దర్శించెను. పంన్రెండు తులభారంబులు దూగెను. కోటి

సువర్ణంబులు దానంబు జేసెను. రెండువేల విప్రులకు వివాహంబులు జేసి సకల దానంబులు గావించెను. వేయి శివాలయములు, మున్నూరు విష్ణు స్థానంబులు ప్రతిష్ఠలు జేసెను. ఏకశిలానగరంబున కీశాన్యభాగంబున ప్రతాప గిరియను నొక్క దుర్గంబు గట్టించెను.

అంత మౌద్గల్యమను క్షేత్రమునకు వచ్చి యా గుండంబున స్నానంబుఁ జేసి రామేశ్వరుని నారాధించెను. అచ్చట సున్నతంబుగా గుడి యొకటి కట్టించ నచటి మునులిది మాండకర్ని ఏకాంతస్థలమగుటచ్చట జనసమ్మర్దము గూడదనిరి. అంతనాతడాఁ ద్రవ్యంబు టెప్పించి పాకాలచెరువు కట్టించెను.[125] ఒక్కపురంబుఁ గట్టించి కోటఁబెట్టించెను. పాకాలసీమలో నలువది గ్రామంబులు రామేశ్వరుని వైభవంబున కొసంగెను. ఎనిమిది తులాభారంబులు దూగెను. షోడశ మహాదానంబులు చేసెను. తరువాత నేకశిలానగరంబునకు వచ్చుచుండెను.

అట్టి సమయంబున దనతమ్ముడైన యన్నమదేవుండు రాజ్యంబు[126] పండ్రెండు వర్షంబులు పాలించి ప్రతాపరుద్ర నరేంద్రునకు యోజన దూరంబున నెదుర్కొని దండ ప్రణామంబులు చేసి ముకుళితహస్తుండై మ్రోలనిలిచెను. అంతఁ దమ్ముని జూచి ప్రతాపరుద్రుండు కౌగలించుకొని కుశలంబడిగెను. పరిజనంబుల గారవించెను. సంతోషచిత్తుండై పురంబుఁ బ్రవేశించి శంభులింగంబు నారాధించెను.

తదనంతరంబున సింహాసనాసీనుండై కూర్చుండి తనవెంట వచ్చిన నానాదేశాధీశ్వరుల నిజనివాసంబునకు బనిచెను. అంతఃపురంబునకుం జని తన తల్లియైన ముమ్మమ్మ మహాదేవికి[127] సాష్టాంగదండ ప్రణామంబు లాచరించెను. ఆ యమ్మచేత దీవెనలు గైకొనెను. భోజనశాల కేగి మజ్జనభోజనాదులు దీర్చుకొని సుఖసుప్తుండై యుండెను.

అనంతరము విశాలాక్షి యందు[128] విరూపాక్షుండు వీరభద్రుండను నిద్దరి సుతులను గాంచెను. మహామహిమతో రాజ్యంబు పాలింపుచుండ నేకశిలా నగరం బలకాపురి సమానంబై ప్రకాశింపఁ దొడంగెను. ఆ దుర్గంబునం గల సంఖ్య యెట్టిదనిన,

## నానావర్ణంబుల సంఖ్య[120]

| | |
|---|---|
| వేదవేదాంగ పారంగతులైన విప్రగృహంబులు | ౧౮౦౦౦ |
| రాజగృహ రాజ్యకార్యములు దీర్చుమంత్రుల ఇండ్లు | ౨౦౦౦ |
| రణరంగ చతురు లైన క్షత్రియ నికేతనంబులు | ౨౦౦౦ |
| సకల సామాగ్రిచే నొప్పు వైశ్యగృహంబులు | ౩౦౦౦౦ |
| ఇందులోఁ ప్రసిద్ధికెక్కి కోటికిఁబడగెత్తిన వైశ్యుల ఇండ్లు | ౪౨౦ |
| నాలుగవ జాతియై విలసిల్లు పద్మనాయకులు | ౯౯ |
| మరియునష్టాదశ వర్ణంబులగృహంబులు | ౧౫౦౦౦౦ |
| విశ్వకర్మ వంశజుల ఇండ్లు | ౨౦౦౦౦ |
| అనవరతంబు సంపూర్ణంబైన సంపదలచే నలరారు గొల్లఇండ్లు | ౪౦౦౦ |
| కాపుల ఇండ్లు | ౧౬౦౦౦ |
| ఈడుగుల ఇండ్లు | ౩౦౦౦ |
| రుద్రజియ్య మొదలైన శివబ్రాహ్మణుల ఇండ్లు | ౧౫౦౦౦ |
| కుమ్మర ఇండ్లు | ౪౫౦౦ |
| పట్టునేసె సాలె ఇండ్లు | ౨౫౦౦ |
| పద్మసాలె వాండ్ల ఇండ్లు | ౬౫౦౦ |
| మేదర ఇండ్లు | ౨౦౦౦ |
| చిత్తరు వ్రాసే ఇండ్లు | ౧౫౦౦ |
| ఉప్పర ఇండ్లు | ౧౫౭౦౦ |
| మేదరవాండ్ల ఇండ్లు | ౧౫౦౦ |
| బెస్తవాండ్ల ఇండ్లు | ౧౬౦౦౦ |
| తెనుగు ఇండ్లు | ౬౫౦౦ |
| బుక్క ఇండ్లు | ౬౩౦౦ |
| సంగర ఇండ్లు | ౧౩౦౦౦ |
| రజకుల ఇ డ్లు | ౫౦౦౦౦ |
| అగణ్యవస్తు వాహనశోభితంబైన వేశ్యాగృహంబులు | ౧౨౯౦౦౦ |
| ప్రవాసులైన వారికి వండిపెట్టె వంటలక్కల ఇండ్లు | ౫౦౦ |

| | |
|---|---|
| బలిజ భవనంబులు | ౧౫౦౦౦ |
| మరియు నితర గృహంబులు | ౭౭౧౦౦౦ |
| శివాలయంబులు | ౫౫౦౦ |
| విష్ణుస్థానంబులు | ౧౩౦౦ |
| మైలారు పోలేరులు | ౨౪౦౦ |
| భైరవాది దుర్గగణపతి వీరభద్రనివాసంబులు | ౪౪౦౦ |
| ఇందును ప్రసిద్ధ స్థానములు భేరీలు | ౫౫౦ |
| నిస్సానంబులు | ౨౫౦౦ |
| పంచమహా శంఖంబులు పట్నమం దహోరాత్రంబులు మ్రోయుచుండు గుళ్ళమీది పసిడి కుండలు | ౧౫౫౦౦ |
| దేవతాస్థానముల దీపములకు నూనెదినంబు కొలది కొలపాటు పుట్లు | ౨౫ |
| నగరిదీపాలకు నిత్యబ్రాహ్మణుల సంతర్పణకున్ను ఘనసార చందన పరిమళ ద్రవ్యములకును | ౫౦ |
| ఆ నగరిలో భాగీరథీ జలంబులు గౌతమీ జలంబుల చేతను శివుని పూజచేయు యోజనవిస్తారంబయిన పురంబునకు నానావస్తుశోభితంబైన యంగళ్లు | ౩౦౦ |
| విన్న యంగళ్లు | ౮౦౦ |
| పురంబునకు చుట్టున్ను వీరభటవాసంబులు | ౩౦౦ |
| గూడెంబులు | ౨౫౦౦౦ |
| చుట్టుపురంబు ఇంద్రపురి సమానంబై ఏకశిలానగరంబున కధీశ్వరుండైన కాకతిరుద్రుని గొలచియున్న నానాదేశాధీశులు అసంఖ్యాలు పద్మనాయకులు | ౭౭ |
| ఒక్కొక్క నాయకుని వీరభటులు | ౧౫౦౦ |
| ఉత్తమాశ్వంబులు | ౧౦౦ |
| మదగజంబులు | ౧౦ |
| కైదువంబులు గొని రాజమొగసాలగాచుధనుర్ధరులు | ౯౦౦౦౦౦ |
| రాజునగరిలో హయంబులు | ౨౪౦౦ |

సామజంబులు

ఉత్తర దేశాధీశ్వరుండగు కనోజరాజువచ్చి కొలచి

యున్న గుఱ్ఱంబులు

వీరపాండ్య రాజును గెలచి తెచ్చిన ఏనుగులు.

ఇట్టులపార సంపదచే నుండి రెండవ దేవేంద్రుండై మూరు రాయరగండ పెండేరంబులు వామపాదంబున ధరియించియున్న శ్రీ మత్ప్రతాపరుద్రుని నిత్య భోగంబు తెరంగెఱింగించెద.

బ్రహ్మముహూర్తంబున మంగళగీత నాదంబుల చేత మేలు గాంచును. విహిత కార్యంబులఁ దీర్చుకొనును. పరిమళ తైలముచే నభ్యంగనంబు గావించు కొని కాశ్మీరఘనసార చందనంబుల నలుగు బెట్టించు కొని పన్నీట జలకమాడి దివ్యాంబరంబులు ధరించును. ఆమీద కిరీటంబు ధరియించి మూరురాయర గండ పెండేరంబు ధరియించును. శాంభవీ దత్తంబైన ఖడ్గఖేటకంబు లిరుగేలం దాల్చును. కనక పాదుకలఁ దొడుగును. వందిబృందము పొగడగా భూసురు లాశీర్వాద మంగళ గాయక గీతనాదంబులును భూరిభట వీర హుంకారంబులును నొక్కటియై హృదయానందంబు వెలిగొన దత్ప్రధానుఁడైన మల్లికార్జునకరము బట్టి వసంత సమేతుండైన మలయానిలంబు తెరంగున మౌక్తిక ఛత్రచామరాది శోభితులై మణిమయ స్తంభ విరాజితంబైన కొలువు కూటంబునకుం జనుదెంచును సింహాసనాసీనుండై యుండును.

అట్టియెడ రాజదర్శనంబునకు శాఖవెల్లి మల్లికార్జున భట్టు మొదలైన బ్రాహ్మణ విద్వాంసులు, బంగారు పల్లకీలెక్కి చనుదెంచువారు నూట యేబండ్రును, సమస్త కళా ప్రవీణులైన పరిహాసకులు వరద రామనాథుండు లోకేసుబాచయ్యగారును రేంకరరాజు కేదారిరాజు మొదలైనసాహసవిక్రమార్కులు యుత్తమ క్షత్రియు లేనూరును దివ్యకాంతల బోలిన కాంతలు నవరత్న ఖచితం బైన పల్లకీలెక్కి చనుదెంచు వారు శిరిగిరి మల్లుకాశేశ్వరపుగంగు జలరుహనేత్రి చిత్తరు నారిప్రతిమ వీరు మొదలుగా గల కొలువు స్త్రీలిన్నూరు యింక నాద బిరుదుపాత్రలు భరత కథల అంబాదేవి సర్వమండల చక్రవర్తి చిలుక పలుకుల త్రిపురారి మొదలైన బిరుదుపాత్రలు ౧౦౦౦ భాస్కరుడు మొదలు గాగల కవీశ్వరులు ౨౦౦ గుండంభట్లు ప్రతాపభట్లు మొదలగు వేదవేదాంత పారంగతు లయిన పురోహితులు నూరు మరియు నానాదుర్గాధ్యక్షులైన నానాదేశాధిపతులు

పద్మనాయకులు మదగజంబులపై మౌక్తిక ఛత్ర చామరంబులు విలసిల్లుచుండ బిరుదు టెక్కెంబులును నాలవట్టంబులును బర భూపతులును బైకంబగునట్లుగా సకల సేనా సమేతులైన వారు శ్రీరంగ మదేవుండను మొదలు రాయ రుద్రమ దేవుండును నిడదవోలి చందాదేవుండును మొదలు గాగల డెబ్బదియేడుగురు పద్మ నాయకులు వీరలకుఁ బెద్దయైయొప్పురాజు తమ్ముఁడు అన్నమ దేవుండు మున్నగు వారు వచ్చుచుందురు.

వీరలకు లెంక నాయకులఁ జెప్పెద విశ్వనాథుని రామలెంక జెట్టి నాగు లెంక గోగులమల్లు లెంక వాసిగల నాగులెంక కోడూరు మల్లులెంక వీరలు మొదలైన లెంక నాయకులు ౩౦౦౦౦౦ పదాతివర్గంబులతోఁ బురంబులుగాచుచుండును. పెద్దతలారి నిశ్శంకు వల్లభుండును మఱియు నానాదేశాధిపతులును రాయబారులును గజంబులకు దొరయైన మంకాళి యను దొరయును నశ్వంబుల కధికారియైన సాహిణిమారయ్యయును సకల ధనుర్ధరులకుఁ బెద్దయైన కొలిపాక సిద్ధయ్యయును మనుబోతుల కట్టియెక్కి వచ్చెవారు ౧౦౦ నానావిద్యల వారు కొలువు చేయఁగ బైడివిత్తంబుల బారవేయుచు పసిడికుప్పెల జల్లులవారు ౫౦౦౦ లుం గొలువఁ బేరోలగంబున గూర్చుండును. దేశాధిపతుల విన్నపంబు విలోకించును. రాయబారుల మనువు లాలకించును. రాజ్యపరిపాలనంబు సేయుచు శివదేవయ్యయు శరభాంకుడును, మల్లికార్జునుండును పాలకుర్తి సూరప్ప మొదలు గాగల ప్రధాని వర్గంబులతో ముచ్చటలాడుచున్న సమయంబున నీశ్వరస్థానంబులు ౫౦౦౦ విష్ణుస్థానంబులు ౩౦౦ దుర్గగణపతిక్షేత్రపాలకాది దేవతా స్థానంబులు ౪౩౦౦ నివియునుం గాక దేవతా స్థానంబుల కధికారులు పచ్చలపాలకీ లెక్కి చనుదెంచి దేవతానైవేద్యంబు చెల్లెనను వాక్యంబులు విని సింహాసనంబు డిగ్గి యంతః పురంబునకు జనును.

భోజనశాల కేతెంచి తనబంధువులుం దాను దేశాధిపతులును తమ్ముఁడైన యన్నమ దేవుండును డెబ్బది యేడ్గురు పద్మనాయకులును నొక్కబంతిగా కూర్చుండి నానావిధ పదార్థంబులతో ౧౫౦౦ గూడ భోజనంబులు చేయును. తేటనీట నెంగిలవార్చియు పోఁగుచు గర్పూర విడియంబు సకల జనంబుల కొసంగును. వారల నందరి ననిపి యొక్క రహస్య హర్మ్యంబున తూగుటుయ్యాలపై బవళించి సేవకా జనంబులు పాదంబు లొత్తుచుండ దాసదాసీ జనంబులు ౩౨౦౦ గలిగి యున్న ప్రతాపరుద్రుండు కొంత తడవు విశ్రమించును.

అంత నమ్మహారాజు కొలువుకూటమున కేగునెడ లులాయ వ్యాఘ్ర భల్లూక గజయుద్ధంబులును, మల్లుల పెనుగులాటలును, సరసకావ్య నాటకాలంకారశబ్ద శాస్త్ర ప్రసంగబులును, హాస్యవచోవిశారదులైన పరిహాసకుల వాక్యంబులు, పుణ్యకథా శ్రవణంబులు, వారాంగనా నృత్యగీత వినోదంబులును మొదలుగాగల చిత్రవినోదంబుల గాలంబు గడుపుచు బొద్దుబుచ్చు చుండును. సాయంకాలపుగుట తోడనే నగరు వెడలివచ్చు సమయంబున ప్రతాపరుద్రుని సేవకులు కరదీపికలు ౩౦౦౦ గ్రహించి నలుదెక్కుల గొల్వగా నిజపరివార సమేతుండై శంభుమూర్తియగు జ్యోతిర్మయంబగు శంభులింగంబు నగరికిన్ జనును. శంభులీలా విలాసంబులు చదువుచు ప్రదక్షిణ త్రయంబు గావించి సేవించుచు గొనియాడుచు నొక్కయామంబారాధించును. అచ్చటంబాసి నగరుకేతెంచి సకల జనంబులను విహితంబుగా ననుపును. పెద్దతలారియైన నిశ్శంక వల్లభుండు పరివారంబులతో గొలువ రెండు ఘడియలు కొలువు గావించును. అంత నతనిని వీడ్కొలిపి యభ్యంతరవర్తి యైయుండును. ఇట్లుంగి రాజ్యభోగంబు లనుభవించుచు దేవ బ్రాహ్మణపూజలను దటాక ధననిర్మాణంబులను నగణ్య పుణ్య కృత్యంబుల సలుపుచు నుండును.[130]

శ్రీమత్ప్రతాపరుద్ర దేవునకు జెల్లిన భూములమేర లేవియన, ఉత్తరదేశంబునకు భాగీరథిమేర పూర్వదక్షిణ పశ్చిమంబులకు సముద్రముమేర[131] దన యాజ్ఞ చెల్లించుచుండె. ఏడవచక్రవర్తియై రాజ్యంబు పాలించుచుండె.[132]

అందు నప్పనంబు లిచ్చు కటకవల్లభుండాదిగా లోను జిల్లెరిరాజులు ప్రతివర్షంబు లిచ్చు యప్పనంబులు ౨౪ కోట్లు. తన నిజ భుజపాలితంబైన రాజ్యంబు వలనవచ్చు ధనంబులు ౨౦ కోట్లు. అదిగాక యగ్రహారంబు బ్రాహ్మణులకు జెల్లుచుండు. గణపతిరాజు మొదలుకొని యటమునునేలిన కాకతి రాజులిచ్చిన యగ్రహారంబులు ౨౦ వేలు విప్రులకు జెల్లుచుండు. దేవతా వైభవంబులు ౨౦౦౦ గ్రామంబులు చెల్లుచుండు అదిగాక తన బండారంబునకు వచ్చు ౪౪ కోట్లు ప్రతివర్షంబునకు వ్యయంబు వ్యయంబుతులా భారంబునకు ౩ కోట్లు ౨౩ లక్షలు నిత్యవైభవంబులకు గంధ కస్తూరి కర్పూర కాశ్మీర జవ్వాజి పరిమళంబులకు బంతి భోజనంబులకు నగరిదీపాల తైలంబునకు ౩ కోట్లు ౬౦ లక్షలు.

పూరంబుగాను నిశ్శంక వల్లభుని జీతంబు ప్రతిసంవత్సరంబున కుబలిసహితంబుగా ౮౮ లక్షలు ౨౦ వేలు, అన్న సత్రంబుల లెక్క యొక్కొక్క సత్రంబునకు వెయ్యేసి విప్రుల చొప్పున ౧౦౦ సత్రంబులు ఆలక్ష ద్విజులకు నేడాదికి నొక్క కోటి ముప్పది లక్షలు నగరి మొగసాల గొలుచువారలకు నవలక్షధనుర్ధరులకు నేడాదికి ౩౮౦ లక్షలు, రాజమదగజంబులకు నుత్తమాశ్వంబులకు జీతంబుల వారికి ౨౩౦ లక్షలు ఏకశిలానగరంబునంగల దేవతా వైభవంబులకు నొక్క కోటి. నగరంబులో రాజగృహంబులకు గట్టినవారికి ప్రతివర్షంబునకు నొక్కకోటి. వారణాసికిని సిద్ధేశ్వరునకు శ్రీశైల మల్లికార్జునునకు శ్రీవెంకటేశ్వరులకును శ్రీరంగనాయకులకును నేకాంబ్ర నాథేశ్వరునకు రామేశ్వరునకు మొదలుకొని దివ్యదేశ నివాస మూర్తులకు ప్రతివర్షంబునకు కోట్లు చెల్లించుచుండును. తమ భండారమునకు కోట్లు చెల్లించుచుండును.[133]

ఇట్లు విక్రమాదిత్యుని చందంబున మహామహిమతో రాజ్యంబు పాలింపుచు సకల భోగంబులు పరివార సమేతంబుగా ననుభవింపుచు రాజ్యంబేలుచుండెను. అట్టితరి దేశంబులు వివేకంబులు నత్యంత తార్థంబులై [134] యానందకరంబుగా శోభిల్లుచున్నవి. సకల జనంబులు గొనియాడుచుందురు. ఈ చరిత్రంబులు మానవులకుఁ గడు దుర్లభంబులు [135] గావున శ్రీమత్ ప్రతాపరుద్రుండు సాక్షాద్రుద్రుండు గాని మర్త్య మాత్రుండు గాడు. అతనిచరిత్రంబు లాదిపురాణంబులట్లు సకలానందంబై యుండును.

అదియెట్లనిన నీ ప్రతాపరుద్రుం డొక్కపుణ్య గ్రహణ కాలంబందు మార్గల్యంబునకుం జని యగ్గంధంబున దీర్థంబులాడి యచ్చట రామేశ్వరుని సేవించి పెక్కు దానంబులు చేసెను. మఱియుఁ బ్రతాపరుద్రుండు పదకొండు హిరణ్య ధేనువులు చేయించి యొక్కొక్క ధేనువుకు ౧ లక్ష సువర్ణటంకంబులు దక్షిణ యొసంగి వేదవేదాంగ ప్రచండులైన విప్రోత్తములకు దానంబిచ్చెను.

ఆ దానంబు లందనేరని విప్రోత్తములు చండాలవాటికకుంజని కొన్ని కుయుక్తులు బలికిన నా చండాలురు రాజుచేతఁ దమకు బ్రాణహాని యెరుంగక యానందం బుట్టువడ బ్రాహ్మణుల నరికట్టుకొని యా సువర్ణ ధేనువులు సజీవంబుల య్యేనేని మరల దొడ్కొని పొండునిర్జీవ ధేనువులయ్యేనేని యవి మీసొమ్ములని బ్రాహ్మణులతో వాదించ సాగిరి. ఆ బ్రాహ్మణులు ప్రతాపరుద్రున కెరింగించిరి.

ప్రతాప రుద్రుండంత బహువిధంబుల రామేశ్వరుని నారాధించెను. రామేశ్వరుండు ప్రత్యక్షం బయ్యెను. ఆ సమయంబున నా సువర్ణ ధేనువులు రాజు మొదలుకొని సకలజనంబులు చూచుచుండ నడవసాగినవి.[136] అనంతరము రాజు చండాలుర దండించి[137] యేకశిలానగరంబు ప్రవేశించెను. ఒక్కనాడు ప్రతాప రుద్రుండు కొలువుచాలించి సకల జనంబుల వీడ్కొల్పి శివదేవయ్యగారు తాను నంతఃపురంబునకుం జనుదెంచిరి. రాజుపట్టపు దేవియగు విశాలాక్షి శివదేవయ్య గారింజూచి పరపురుషుండు గదా యని మరుగునకుం బోయెను. అంత ప్రతాప రుద్రుండు శివదేవయ్యగారిని నిజమందిరంబున కనిచి మజ్జనభోజనాదులు దీర్చి నవరత్న ఖచితంబైన యొక్క పీఠంబునం గూర్చుండి తనపట్టపు దేవియైన విశాలాక్షి కిట్లనియె, శివదేవయ్యను జూచి పరపురుషుండని తొలంగి పోయితివి. ఆయయ్య ఈశ్వరుండుగాని మనుష్యమాత్రుండుగాడు. ఆయయ్యగారు బూజించి సుగతిగాంచు మని యెరుంగం బలికెను.

ఆవాక్యంబువిని విశాలాక్షిదేవి తన చిత్తంబునం బాదు కొల్పి శివదేవయ్య గారి యెదుటం దానిల్వ నోడియుం బతివాక్యంబులు మనంబున నిల్పి శివదేవయ్య గారి రూపంబుగా నొక్క సువర్ణ ప్రతిమను జేయించి, యొక్క సువర్ణ వేదిక పై నునిచి షోడశోపచారంబులం బూజింపుచుండె.

[137a] అంత నొక్కనాడు మాసశివరాత్రి యయ్యెను. ఆ ప్రతాపరుద్రుండు శివదేవయ్యను బిలిపించి స్నానాదికృత్యంబులు దీర్చి శంభునగరికిం జనెను. అద్దేవునిం బూజించి యచ్చట జాగరణంబు సేయుచుండెను. అట్టి సమయంబున శివ దేవయ్యయు గిఱ్ఱున నిలిచిన,[138] మహీపాలుండును నొక శిల్పినచ్చట జూచి నంతనే పంచబాణడు జ్యోతిషంబు విప్రులకురా నేర్చునే, నజ్యోతిష్యంబు తమ దని వ్యతీపాత ప్రవేశంబున జిల్లెడు కొమ్మ విరిచిన రక్తంబు గారెను. రాజదిగని సంతోషించి యొక్క గుఱ్ఱంబును పల్లకియుం గృపజేసెను.

ఆవార్త భూసురు లెరంగి కటకటా! యితర జాతి ప్రజ్ఞలుమించి నిగ్రహాను గ్రహంబులైన విప్రజనంబుల మహాత్మ్యం బెరుంగరాదయ్యెనని రాజసముఖంబు కేతెంచి యిట్లనిరి. జ్యోతిష్యులకుగాక యితర జాతులకు ప్రజ్ఞలెట్లు లభించు శిల్పి యీవిన పరీక్ష, నిజంబుగాదు. అమృతవేళ నెరింగి ధేనువుల యెదుట క్షీరంబులు

పిదుకుదురేని జ్యోతిష్యం బెరుంగుట నిజంబగును. వేదవేదాంగంబు ద్విజాతులకుఁ గాక యితర జాతులకు నెట్లులభించు పరీక్షజూపిన నది నిజంబుగాదు అమృతవేళ నెరింగి ధేనువుల నెదుట క్షీరంబులు పిదుకు నేని జ్యోతిష్యం బాతని సొమ్మని వచించి యొక్క గొడ్డుటావును జూపిరి.

అదిగని వాడు పరీక్షనీయక తొలంగి పోవుటం జూచి యొక విప్రుండది యెరింగి పిదికిన, గుంచెడుపాలు పట్టుటయుం జూచి యా ప్రతాప రుద్రుండత్యంత విస్మయంబందెను. ఆవిప్రుండు గోరినయట్లు గోదావరి తీరంబున శతవర్షంబను
[139] గ్రామంబ గ్రహారంబుగ నిచ్చెను.

మఱియు నొక్కనాఁడు దక్షిణదేశంబు నుండి సుదర్శన మిత్రుండు గజారూఢుండై నూర్గురు విద్వాంసులు గొలువ నేకశిలానగరంబున కేతెంచి ప్రతాపరుద్రుని కొలువుకూటంబునగల విద్వాంసులను వాదించి భిక్షకేతెంచు వాఁడనని[140] పలికెను. ఆవిద్వాంసులు వాదముఖంబున సుదర్శనమిత్రుని నవమానపరిచిరి.[141]

అతండు గెలువనేరక, చిక్కి, కారు మాటలతోనైన గెల్చెదనని తలంచి యద్దినంబు కృష్ణచతుర్దశి యగుటంజేసి రేపమావాస్య నష్టచంద్రుండు ఇదినిజంబు, మీరందరు కాదనియందు రా యనియెను.

అప్పుడేక శిలా నగరవాసులు విద్వాంసులును నవ్వి పోయిరి. అనిన సహస్ర ధారల నుపమించు నేర్పుటంజేసి సుదర్శన మిత్రుండను బేరు పెట్టుకొని వేదశాస్త్ర ముఖంబుల నిల్వనేరక పోయి, కారుమాటలకుం జొచ్చితివి అట్లయినను నప్రతిష్ఠ పనియని యందురు. రేపునష్ట చంద్రుండుగాఁడు. సంపూర్ణ చంద్రుండు ఇది నిజంబని విప్రులందఱుఁ సభవెడలిపోయిరి.

ఆరాత్రి శాఖవెల్లి మల్లికార్జునభట్టు హనుమకొండకేగి యచ్చట స్నాన సంధ్యాది కృత్యంబుల దీర్చి భద్రకాళిగుడిఁ జొచ్చి యద్దేవి నారాధించి [142] పదకొండు శ్లోకంబుల స్తుతించెను. ధనకారూఢయైయున్న యద్దేవి ప్రత్యక్షంబై లేలెమ్ము వత్సా! నీవాక్యంబులు ప్రతిష్ఠించెదనని వరంబొసంగెను. అతండు భద్రేశ్వరిచే వరంబుఁగొని యేకశిలానగరంబున కేతెంచెను. అంత వాక్య కృత్యంబుల నగదీర్చెను.[143]

అంత నస్తమయంబయ్యెను. తూర్పుదిక్కున చంద్రోదయంబయ్యెను. క్రమక్రమంబున జలదుర్గిని గతిచందంబున మహానిశిని మధ్యాహ్న గతుండగుచుఁ జంద్రమండలంబు ద్విగుణితంబై నిష్కళంకంబై సర్వజనంబులకు నానందంబుగా వెన్నెల గాయదొడంగెను.

సుదర్శన మిత్రుండదిఁ గాంచి యేకశిలానగరంబున నున్న విద్వాంసుల పాదంబుల కొరగి నాయది మానవ ప్రజ్ఞ మీదిదైవికమానుషప్రజ్ఞ. మీకు మాకు హస్తి మశకాంతరంబుగాదే అపచారంబు[144] క్షమియించుడని పలికెను.

అంతఁ బ్రతాపరుద్రుండు శాఖవెల్లి మల్లికార్జునభట్టును బ్రహ్మరథం బెక్కించి యేకశిలానగర[145] విప్రులకు ౧౦ లక్షల వరహాలు సమర్పించెను. ఆ విద్వాంసులు సుదర్శన మిత్రుని గౌరవించిరి. అతనికిగా ౧ లక్షవరహా లిచ్చి పంపిరి.

మఱియునొక్కనాడు సంతూరను గ్రామంబునఁ గృష్ణమాచార్యుల తమ్ముడనంతాచార్యులు [146] రజక స్త్రీతోఁ గూడెను. ఆ రజకుఁడిద్దరిని బొడిచెను. అంతవారు మరణించిరి. ఆపురి విప్రులిది శూద్ర వీసుగతో గూడి యున్నది గనుక మేము మొయ్యమనిరి. అదివిని కృష్ణమాచార్యులు తనమదిని విచారించి వాసుదేవమూర్తిని గీర్తనఁజేసెను. శవంబు దనంతట తానే కాష్ఠంబు వఱకు జరిగిపోయెను.

ఇదిగని సకల జనంబులేతెంచి కృష్ణమాచార్యుల పాదములకుఁ బ్రణమిల్లి మాయపరాధంబు క్షమియింపుమని వేడికొనిరి. అయయ్య నాకు రాగద్వేషంబులు లేవు. మీరు వెరువకుఁడని వచించెను. ఆవార్త ప్రతాపరుద్రుండు చారులచేవిని కృష్ణమాచార్యుల రావించి పూజించి కనకగిరిసీమలో నాల్గవ భాగంబును[147] ౫౦ గ్రామంబుల కధికారంబును నొక్కయూరగ్రహారంబుగ నొసంగి పంపెను.

కృష్ణమాచార్యులు సంతూరు ప్రవేశించి సకల ధనంబుల బంచిపెట్టెను. కల్లూరను గ్రామంబు కట్టించెను.[148] మూడు వర్షంబు లధికారంబుచేసి గ్రామంబుల గలుగు పదార్థంబు దెప్పించి తామ్ర పత్రికలు చేయించి ఆ పత్రికలమీద

దాను రచించిన చాతుర్లక్ష గ్రంథంబుల చెక్కించెను. వాటిని శకటంబులపై నిడుకొని శ్రీరంగంబునకుబోవ నుద్యోగించెను.

అంత గొండపుధూర్తులుగూడి రాజు సముఖంబునకుఁబోయి కృష్ణమాచార్యులు మీరలధికారంబులిచ్చిన గ్రామంబుల పదార్థంబులుఁజెప్పించి [149] తామ్ర పత్రంబులుఁ జేయించి శ్రీరంగంబునకు గొనిపోవుచున్నాడని యెరింగించిరి. ప్రతాపరుద్రుండదివిని యతండు మహాత్ముండు అతని కేమియిష్టంబో నాకు నదే యిష్టంబని వచించి యూరకుండెను.

ఆ వార్త యిష్టజనులచే నాకృష్ణమాచార్యులు విని [150] తనమనసంబున వాసుదేవుని నారాధించి యొక్క వచనంబు రచియించిన మెచ్చి యేకశిలానగరంబునఁ గనకవృష్టి గురిపించెను. ఇదిగని ప్రతాపరుద్రుండచ్చటి జనంబులను కృష్ణమాచార్యులను బూజించి వారిచే వీడ్కొనెను. కృష్ణమాచార్యులు శ్రీరంగంబున కరిగెను.

మఱియొక్కనాఁడు తిక్కన సోమయాజుల వరప్రసాదంబుచేత గుమ్మర మొల్లరామాయణంబు వచనకావ్యంబు రచియించి వీరప్రతాపరుద్రున కంకితముగా జేయ నిశ్చయించెను. అట్టిసమయంబున నారాజు ముఖంబున విద్వాంసులు కొందరదివిని ఇదిశూద్ర కవిత్వంబు నిశ్శబ్దంబని [151] నిరాకరించి పలికిరి. రాజు సర్వజ్ఞుడు గావున దానినిమెచ్చి బ్రాహ్మణకృత్యంబయిన కావ్యంబు కావలెనని యనెను.

ఆవిద్వాంసులంత భాస్కరునిఁ బిలిపించిరి. అతఁడు రచియించిన శ్రీ రామాయణంబు వినుసమయంబున నచ్చటికి యేతెంచి మొల్లరామాయణంబు మున్ను నేను రచియించియున్నానని యచట నచట నొక్కొక పరముగ నర్థయుతంబుగఁ జదువసాగెను. [152] అదివిని ఆ రాజు సర్వజ్ఞుఁడు కావున వీని ప్రజ్ఞకుమెచ్చ విప్రజనంబు మెచ్చునో [153] యని మొల్లని బిలిచి పల్లకియును నగరిలో నిత్యజీవితంబు కట్టడిజేసి తనయెదుటనుండ నీకతన దేవి విశాలాక్షి సముఖంబున నుండ జేసెను. ఆ వార్త విని శాఖవెల్లి మల్లికార్జున భట్టు నిరోష్ఠ్య రామాయణంబు రచియించెను. తదనంతరంబున రంగనాథునిం బిలిపించిన నతఁడు దక్షిణ దేశంబుననుండి యాందోళికపైనెక్కి చనుదెంచునప్పుడు త్రిపురాంతక విజయంబను గోపురంబులుజూచి యవి యేమియని యడిగిన నవి ౧౬ [154] త్రిపురాంతక గోపురంబులని యచ్చటివారు పలికిరి.

అంత నాతఁడు శివభవనంబులను జూడనొల్లక మైదపు జిడ్డు 155 గప్పించుకొనియె. అప్పుడు రంగనాథుండు నేత్రంబులుగానక జాత్యంధునివగిదియుండెను. రంగనాథుండు మగుడి శ్రీరంగంబునకుఁబోయి యాదేవుని బ్రసన్నునిఁ జేసికొని నేత్రంబులు ప్రసాదింప వేడికొనెను. 155a ఆ దేవుడు కరుణించి త్రిపురాంత దేవుని వేడుకొమ్మనుమని వచించెను.

అంత రంగనాథుండు మరలఁ ద్రిపురాంతంబున కేతెంచి యద్దేవునికి నమస్కరించి తనయెత్తు క్రతువులు 156 సమర్పించుదునని వ్రతంబుజేసి భక్తిమయంబుగా నొక్కరగడ 157 చెప్పెను. అద్దేవుండు ప్రసన్నుఁడై రంగనాథునికి నిలువు 158 కన్నులొసంగెను. రంగనాథుండంత పాలకుర్తికింజని సోమనాథునిచే దీక్ష గైకొని యాయయ్యయొద్ద శివరహస్యంబులు దెలిసికొను చుండెను.

రంగనాథుని రగడ యీక్రింద నుదహరించుచున్నవాడ.

క. శ్రీపార్వతీశుఁజూడక, పాపాత్ముఁడనగుచుఁబోవఁ బథమునఁజక్షుల్
దీపించు దృష్టి తొలఁగిన శ్రీపతినడుగంగఁ జెప్పె, శివుఁగర్తనుగాన్.

రగడ; శ్రీశైల వల్లభుని శిఖరంబుఁ బొడగంటి
కాశీపురాధీశు గౌరీశుఁ బొడగంటి
మహినొప్పు శ్రీశైల మహిమనేఁ బొడగంటి
బహువేద శాస్త్రముల్ ప్రణుతి సేయుటఁ గంటి
భూలోక కైలాస పురమనఁగఁ గనుఁగొంటి
ఫాలాక్షుఁ డిచ్చోటఁ బాయకుండుటఁ గంటి
ధృతిఁ దూర్పు మొగసాలఁ ద్రిపురాంతకము గంటి
పర్వత లింగంబుఁ బ్రాణేశుఁడవి కంటి
పర్వతేశ్వరు హృదయ పద్మనిలయునిఁ గంటి

* ఈ రంగనాథుని రగడ ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (1917, 1918) ప్రచురించిన ప్రతాపుచరిత్రలో లేదు. చూడు పైన, పీఠిక, "ప్రతాపరుద్రచరిత్ర - పూర్వముద్రణలు", క్రింద.

భక్తుల ప్రతిహత ప్రతిభమతులని కంటి
భక్తులకుఁ బ్రత్యర్థి పరులులేరని కంటి
భక్తులాపదలచేఁ బట్టుపడరని కంటి
శివభక్తి దూషకులు చిరపాపులని కంటి
శివభక్తిదూషకులు చెడిపోదురనికంటి
త్రిభువనము భక్తులకుఁ దృణ కణంబని కంటి
సభలందు భక్తులకు జయవాదమని కంటి
గౌరీశుఁడే సర్వకర్తగాఁ బొడగంటి
కారుణ్యమున శివుఁడు గనిపించె ననికంటి
బహుపాపములు నన్నుఁ బట్టివిడుచుటఁ గంటి
నయముగా నయనములు నాకీయఁ బొడగంటి
భయభక్తులను భర్గుపాదములు పొడగంటి
నిదిపుణ్య మనికంటి నిదిగణ్య మనికంటి
నిదియోగ మనికంటి నిదిభోగమని కంటి
నిదిధర్మమని కంటి నిది మర్మమని కంటి
నిదినిత్యమని కంటి నిదిసత్యమని కంటి

* సోమనాథు పురాణ గురురాజ చరిత్రములందువలె యీ ప్రతాపరుద్ర చరిత్ర యందును రంగనాథుఁడనియేగలదు. ఈ రగడలో "శ్రీరంగకవి" యని పేరున్నది. రెండును నొక్కనిపేర్లేయనియు నిది వైష్ణవము వీడినతర్వాత పేరుగావచ్చునని వేటూరు ప్రభాకర శాస్త్రిగారు వ్రాసినారు. మల్లికార్జునస్వామిని దర్శింపకపోవుటచేఁ గనులుపోవుట, అట్లుపోవుటకుఁ గారణమడుగఁగా శ్రీపతి (అహోబల నృసింహుఁడు) శివుఁడే కర్తయని తెలుపుట కృత్యాది పద్యమునఁ గలదు. సభలందు భక్తులు జయించుట శివానుగ్రహమునఁ బోయిన కన్నులు మరల వచ్చుట రగడలోగలదు.

(బసవపురాణము పీఠిక)

వింక శ్రీగిరిఁ జేరనేఁ గందుననికంటి
శంకరుని కృపవడయు సమయమిదియని కంటి
నింక నాయెత్తు కృతులిత్తునని పొడగంటి
నింకఁగృతిసెప్ప నాకేమి భరమని కంటి
వడిఁగృతుల్ నాయెత్తు వచ్చునని పొడగంటి
తనర శ్రీరంగకవి * దాతయని పొడగంటి
భువిలోపలఁ బ్రసిద్ధ పుణ్యుఁడని పొడగంటి.

ఈ విషయమే శివయోగసార పూర్వభాగమందలి కవిస్తుతిలోని యీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

క. అనమ శివభక్తిరసమా ననునిం బాల్కురికి సోమనాథునిఁ గసిరా
జసము న్నతుఁడగు నద్యః ప్రసాదియగు చక్రపాణి, రంగనఁగొలుతున్.

## సోమనాథుని ప్రభావము

**అంత** నిక్కడ ప్రతాపరుద్రుండు సోమనాథుని ప్రభావంబు విని యాశ్చర్యంబు నొందెను. అప్పుడు తన మంత్రియగు పాలకుర్తి సూరయ్య యా ప్రతాపరుద్రున కిట్లనియె. పాలకుర్తి సోమనాథుడు చెప్పిన శివకథలు దేవరవారు ఉప్పలం[159] శంభుని సేవింప బోయినప్పుడు గూర్చుండి వినవచ్చునని వచించెను. మరునాడు ఆరాధ్య చరిత్ర రాజు వినుచుండగాఁ గొందఱు ధూర్తజనులు పాలకుర్తి సోమనాథుండు చెప్పినవి నూతనంబులు గాని యాద్యంతంబులు[160] గావని నిరాకరించిరి. ఆ ప్రతాపరుద్రుండంత దన నివాసంబునకుం జనియె.

అచ్చటి శివభక్తులు సిగ్గుపడి పాలకుర్తి జని సోమనాథున కెఱింగించిరి. సోమనాథుండు శైవులు గానివారలఁ జూడకుండుటం జేసి యొక్క బండిపై గుడారంబునిచి[161] యందుతాను గూర్చుండెను. లింగముద్రగల యెడ్లగట్టించెను. సూర్యమంత్రిని సూతునిగఁజేసి ఏకామ్రగురుండగు రంగనాథుండును మొదలుగా గల శైవులందరు తన్ను గొలువ[162] నేకశిలానగరంబున కేతెంచెను.

ఆ బండి గట్టినయెడ్లు కవాటము జొరకున్న నెరింగి, గవిని యడ్డదూలంబున భవిప్రతిమయు రెండు యేనుగులుండగా జేసినట్లు తెలిసికొనెను. అంతట

సోమనాథుండు శివుని ధ్యానించి యా ప్రతిమలపైన భస్మంబుజల్లిన నవి తునకలై క్రిందపడెను. అంత నేకశిలా నగరంబున దన శిష్యుండగు ఇందులూరి[163] యన్నమదేవు నివాసంబున కేగెను.

ఆ ప్రతాపరుద్రుం డీసంగతి యెరింగి విస్మయం బందెను. కొందఱు ధూర్తులు సహింపఁజాలక శిలలు వెగిపడుట మంత్రవిద్య గాని వాక్యసిద్ధికాదు. ఇతని సమీపమునకుబోయి యీగుట్టు తెలిసికొని యిప్పుడె వచ్చెదుమని రాజుచే ననుజ్ఞగొని యా సోమనాథుని సమీపమునకు జనిరి. కాని యతం డన్యమతస్థులఁ జూడకుండెను.

అంత నాద్వార పాలకులచేత నివారితులై మగుడి పురవీధి కే తెంచి గుంపులు గూడి కటకటా! వేదశాస్త్రసంపన్ను లఁజూడ రాదట. చండాలుఁలై నను లింగధారుండైన మాట్లాడి చూడవచ్చునట. అట్ల కాకయని యితనిని హాస్యంబు చేసి యీ ప్రొద్దే పురంబు వెడలనంపవలయునని తలంచిరి. ఆ పురి లోపల గ్రాసార్థమై తిరుగు యంగహీనులనుండి మొండి ముక్కిడి వెట్టివాండ్లను నంధులను బధిరులను మూకులను మరియు రోత జనుల రావించి, మీరు సోమనాథుని హాస్యంబు చేసి వచ్చితి రేని మీకు అన్న వస్త్రంబు లిచ్చెదము. అని వారిని యొడం బరిచి, వారికి లింగధారణంబు విభూతిరుద్రాక్ష ధారులం జేసి కొన్ని కుయుక్తులు జెప్పి పనిపిరి.

వారలు సోమనాథుని సముఖంబునకుం జనిరి. ఆయయ్య ద్వారపాలకులచే నా వార్తనెరింగి తన సముఖంబునకు వారలఁ బిలిపించు కొనెను. అంతట వతని ప్రభావంబునం జేసి యంగహీనులకు నంగంబును, యంధులకు గన్నులును, బధిరులకు వీనులును, మూగులకు వాక్యంబులును గలిగెను. వార లత్యంత సంతోషంబున నాయయ్యకు నమస్కరించి, బహువిధంబులఁ గొనియాడి సోమ నాథుని చేత ననుజ్ఞాతులై పురవీధి కే తెంచిరి.

సకల జనంబు నామూగ బధిర యంగహీనంబులు నివారణం బగుటజూచి యా సోమనాథుని మహిమ గొనియాడిరి. ఆధూర్తజనులు లజ్జజెందిరి. ఆ ప్రతాప రుద్రుండు విభూతిరుద్రాక్షల ధరించువాడు గనుక నాయయ్యవద్ద కే తెంచి సేవించి తనకు శివుండు ప్రత్యక్షంబగు తెరంగెరింగించుమని వేడుకొన్నఁ గరుణించి యా

ప్రతాపరుద్రునకు సోమనాథుం డిట్లనియె. ఏవుండు భక్తిసులభుండు. ఒక్క వ్రతంబు చేపట్టి నడుపుము. వ్రతంబు భంగంబు గాకుండ నడిచితివేని ప్రత్యక్షం బగునని యెఱింగించెను.

## రాజు వ్రతముపట్టుట - ఈశ్వర సాక్షాత్కారము

ఆ రాజు శివదేవయ్యను జూచి యెట్టి వ్రతంబుఁ జేయవలయునని యడిగెను.[164] అంత రాజునకు నాతఁడు, భాగీరథిజలంబుల నభిషేకంబు గావించి గాని భుజింపనని[165] వ్రతంబు పట్టుమని యెరింగించెను. అట్లకాక యని నిజ నివాంబునకరిగి నిత్యంబును భాగీరథి జలంబుచే నభిషేకంబులు గావించుకొనుటకుఁ దాగుటకు భాగీరథిజలంబులు దెచ్చునట్లుగా ౩౫౦౦ పరిజనంబులు[166] నేర్పరచి నిత్యకృత్యంబుగ భాగీరథి జలంబులు దెప్పించి శంభులింగమున కభిషేకంబు చేయుచుండెను.

వర్షత్రయంబు జనెను. ఈశ్వరుఁడు ప్రతాపరుద్రుని దృఢభక్తి జూడఁగోరి యేడుదినంబులు భాగీరథి జలంబులు రాకుండునట్లును మహావర్షంబు గురిపించెను. ప్రళయకాలమేఘంబురీతి నురుములు మెరుపులు మహావాయువును గలుఁగ భాగీరథి జలంబులు దెచ్చు జనంబులు రాలేక మిట్ట పల్లంబు లెరుంగ రాక వాన చేత నొక్కొక మూలకొదిగిరి.

ఇక్కడ ప్రతాపరుద్రుండు భాగీరథి జలంబులు రాకుండుటం జూచి యేడు దినంబులు యుపవసించి నిత్యము త్రికాలంబును బూజసేయ వచ్చుచుండెను. అంత పరునాడు ప్రభాతసమయంబున ప్రతాపరుద్రుండును మహాదేవుని గుడిలోనికి జనుదెంచు సమయంబున ఖడ్గఖేటకంబులును, మయిదవుజిడ్డును బట్టించుకొని బరిజనంబులు తన్ను గొలిచి వచ్చుచుండ గోటసమీప వీధిలోపల మహా వాయువుచే ఖడ్గఖేటకంబు లెగిసిపోయినవి. పిడుగులును వాయువులును వానయుగూడ నొక్క తడవ[167] విడివచ్చిన నోర్వలేక పరిజనంబులు నేలపైఁబడిరి.

రాజు చలింపక ధైర్యంబు వహించి యుపవాసంబుల సొక్కక బుద్ధి చలింపనీక భక్తి మరువక వేసారక శంభుని నగరికిఁబోవ శక్యంబు గాక పెద్దగ నెలుగెత్తి శంభులింగా! మహాదేవా! నీలకంఠా! మృత్యుంజయా! కైలాసనివాసా! యని పిలువసాగెను.

## కాశీబుగ్గ యుత్పత్తి

ఆ క్షణంబున నందివాహనారూఢుండై ప్రమథగణంబులు గొలువ నీశ్వరుండు ప్రత్యక్షం బయ్యెను. అంత నిర్మలంబై[168] సూర్యమండలంబు గానంబడెను. ప్రతాపరుద్రుండు శంభులింగంబునకు సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి బహువిధంబుల స్తుతించెను.

అద్దేవుండు మెచ్చి నీకు వరంబులిచ్చెద నడుగుమన ప్రతాపరుద్రుండంత ముకుళిత హస్తుడై వ్రతభంగంబు గాకుండునటులు గృపసేయుమనెను. అంత శంకరుండు మెచ్చి యప్పురంబునకు నుత్తరభాగంబున గ్రోశమాత్రంబున భాగీరథీ జలంబుల బుగ్గ గజతుండ సమానంబై మీకు గానవచ్చు. నీ వ్రతంబు చెల్లుచుండు. నీవు గంగగర్భంబున శరీరంబు దొలంగి దివ్యవిమానారూఢుండవై కైలాసంబునకు వచ్చెదవని వరంబొసంగెను.

శివుండు ప్రత్యక్షంబైనచోట శివాలయంబు గట్టించెను. అంత ప్రతాప రుద్రుండు సకలజనసమేతుండై పంచమహావాద్యంబులు మ్రోవ మహావైభ వంబుతోఁ బురంబు వెలువడి యక్కడికివచ్చి యొక ప్రదేశంబున వారిని నిలిపి శంకరుని బ్రార్థింపసాగెను. అట్టి సమయంబున గజతుండ సమంబై చంద్ర ప్రకాశంబైన భాగీరథీజలంబుల బుగ్గ బయలు వెడలి వచ్చెను. ఆ జలంబులను ప్రతాపరుద్రుండు చూచి యత్యంత సంతోషంబున సర్వజనంబులు తాను స్నానంబు చేసిరి. అక్కడనే శివాలయంబులు గట్టించెను. ఎనిమిది తులాభారం బులు తూగి కోటిసువర్ణంబులు దానంబు చేసెను.

మఱియు నాజలంబులను హేమకుంభముల నుంచి మదగజ కుంభంబుపై నిడుకొని మహావైభవంబుతో శంభులింగంబు నగరికింజని యభిషేకంబు గావించి నైవేద్యంబులు సమర్పించెను. బంధుహిత సామంతవర్గంబులతోఁ గూర్చుండి శ్రీమత్ప్రతాపరుద్రుండు రెండవ దేవేంద్రుండువోలె సకలవిభూతి సంపన్నుడై సింహాసనాసీనుండై యుండెను.

అట్టి సమయంబున, బొలకుర్తి సోమనాథుం డాదేశంబున వ్రతంబు చెల్లిన[169] దక్షిణదేశంబునకుఁ బోయెదనని వచించిన ప్రతాపరుద్రుం డొక్క గ్రామంబు[170] నగ్రహారంబుగ నొసంగి పంపెను. ఆయయ్య యనుమతంబున

రంగనాథునిఁ దనవద్ద నుంచుకొనెను. అపారంబుగ ధనంబుల చరిత్రంబులకు చెల్లింపుచుండు.[171]

## ప్రతాపరుద్రుండు తనపైకి యుద్ధమునకు వచ్చిన పశ్చిమ దేశాధీశ్వరుల జయించుట

ఈ ప్రకారంబున ప్రతాపరుద్రుండు రాజ్యంబు సేయుచుఁ దన యాజ్ఞ మీరిన[172] పశ్చిమదేశాధీశ్వరులగు తురుష్కులపై దళంబుల బంపి వారి నోడించెను. పత్నీయుక్తంబుగా వారిని [172a] ఏకశిలానగరంబుతో గిరివేయించెను.[173]

ఆ సమయంబున దేవగిరినున్న రామదేవరాజు[173a] పారసీరాజు తమ్ముని గలిసికొనెను. ఇక్కడ నేకశిలానగరి గిరిచేసిన పారసీరాజు మృతిబొందెను. అతని యనుజుండు జుమానుముల్కు[173b] ఫకీరువేషంబున నేకశిలానగరంబు జొచ్చి పురంబంతయు జూచి తనచేత సాధ్యంబు గాకుండు టెరింగి తనయన్న సతికిని సుతులకును దాను నెరుక జేసి కొనెను. తాను ఫకీరు వేషంబువేఁ బురంబు వెడలి[174]తినని చెప్పి తమ రాజ్యంబునకు వారలను నిలిపి రామదేవ రాజులును దానును ఢిల్లీకి బోయిరి. సుల్తానును జూచి యేకశిలానగరంబు తెరంగు బలంబు[175] కొలంది చెప్ప కొంచెంబని కార్యంబూహించి యేకశిలానగరంబు సాధించదలంచిరి.

అప్పుడు సుల్తానుతోడ గూడిన రాజులు పశ్చిమదేశాధీశ్వరుండు ౧ లక్ష గుఱ్ఱంబులును, ౨లక్షల పదాతివర్గంబులును, [176] మహారాష్ట్ర దేశాధీశ్వరుండు ౨ లక్షల గుఱ్ఱంబులును, ౨ లక్షల పదాతివర్గంబులును,[177] కటకవల్లభుండు ౫౦ వేల గజంబులును, ౮ లక్షల పదాతివర్గంబులును, తక్కిన చిల్లరరాజులు ౨ లక్షల గుఱ్ఱంబులును, లక్షల పదాతివర్గంబులును[178] నీవిధంబుగ దళంబుల గూర్చుకొని రాచర్ల వద్ద విడిసిరి.

ఢిల్లీశ్వరుఁడు మలేఖానుని[179] దళవాయి జేసికొని ౨౫౦ వేలు గుఱ్ఱంబులును, ౧౫ లక్షల కాల్బలంబులును గూర్చుకొని యేకశిలానగరంబునకు నుత్తర భాగంబున విడిసెను. కటకవల్లభుండు మూల బలంబులతో నేకశిలానగరంబున కీశాన్యభాగమున మౌద్గల్యమున విడిసెను. ఇటుల మూడుదిక్కుల విడిసిరి.

ప్రతాపరుద్రుండీసంగతి చారులచే విని నరపతిరాయుల కెరింగించెను. అతడు ౩ లక్షల పదాతి వర్గంబులును, [180] దక్షిణభాగంబున వేల్పుగొండ స్థానంబుగా గొంత బలంబులు డెబ్బైయేడుగురు పద్మనాయకులు, రాజు తమ్ము డగు యన్నమదేవుండును బశ్చిమంబున విడిసిరి. శత్రుబలంబులమీదికి సేనల బంపించెను. కటకవల్లభునిమీదికి నరపతిరాయల బంపెను. సుల్తాను బలంబుల మీదికి తన మూలబలంబులను బంపెను. వారు తలపడి ఘోర యుద్ధంబు చేసిరి. ఆ సమయంబున మలఘుఖానుండు[181] సమసెను. హతశేషబలంబు ఢిల్లీమార్గముఁ బట్టి పారిపోయెను. [182] అటుతరువాతఁ గటకవల్లభునిపై నరపతిరాయలు తలపడి యుద్ధంబుఁజేసి రెండువేల గజంబుల ద్రుంచి వెయ్యి గజంబులఁ బట్టి కొనెను.

అప్పుడు కటకవల్లభుండు పలాయితుండయ్యెను. అంత హతశేషులైన వారలు ఢిల్లీకింజని సుల్తానుకుఁ జెప్పిరి. మరల బలంబులగూర్చి బిరుదుఖానుని[183] యుద్ధమునకుఁ బంపెను. వారలు నుత్తర భాగంబున దిగిరి. చిల్లరరాజు లెప్పటి యట్లు బలంబులగూర్చుకొని పశ్చిమంబున విడిసిరి. [184] కటకవల్లభుండు బలం బులగూర్చుకొని మాద్గల్యంబున విడిసెను.

కటకవల్లభునితో నరపతిరాయలు సంగరంబుచేసి ౪ వేల గజంబుల దునిమి వేయిగజంబుల బట్టికొని కటకవల్లభుని తలద్రుంచెను. హతశేషులు కటకంబునకుఁ బారిపోయిరి. [185] సుల్తాను బలంబులఁగూల్చి బిరుదుఖానుని తలద్రుంచెను. మరణించఁగ జిక్కినబలంబులు దొలంగిపోయెను. చిల్లర రాజులు పారిపోయిరి.

సింధు కటకంబున ముకుందసుందరుండనువాడు[186] పట్టణంబు గట్టుకొని మరల బలంబులగూర్చుకొని యెప్పటియట్లు మాద్గల్యంబున విడిసెను. అట సుల్తాను ఉల్లాఖుఖానుని [187] దళవాయింజేసి ౩ లక్షల గుఱ్ఱములు, ౧౦ లక్షల పదాతివర్గంబును గూర్చి యేకశిలానగరంబునకు నుత్తరభాగంబున విడిసెను. చిల్లరరాజులు యెప్పటియట్లు బలంబులు గూర్చుకొని పడమర రాచర్ల వద్ద [188] విడిసిరి. ఎప్పటియట్లు మూడు దిక్కులవారు సంగరంబుచేసి యోడిపోయిరి.

## ప్రతాపరుద్రుని భటులు కటకవల్లభుఁడని ముకుందసుందరుని బట్టుకొని తదుపరి విడుదల చేయుట

అంత కటకవల్లభుండును ముకుందసుందరుండును నేకశిలానగరంబుఁ జూడవలెనని విప్ర వేషంబులఁ బురంబుజొచ్చిరి. అన్ని వీధులు చూచిరి. ఎప్పటియట్లు కటకవల్లభుండును ముకుందసుందరుండును, రాజద్వారంబు చూచుచుండిరి. అట్టి సమయంబున నతని దొరలు యితడు కటకవల్లభుండని ప్రతాపరుద్రున కెరిగించిరి. ప్రతాపరుద్రుం డీముకుందసుందరుని పట్టించి గిరి[189] వేయించెను. ఆ పురి వైశ్యుండు కోటపల్లి విశ్వనాథుం డనువాఁడు శ్రీమత్ప్రతాపరుద్రునకు మూడుకోట్ల సువర్ణంబులిచ్చి యా ముకుందసుందరుని విడిపించెను.

## కటకవల్లభ ప్రభృతులగు రాజులు పరాజయ మొందుట

అంతఁ గటకవల్లభుండు తనదేశంబుఁ జేరి[190] నరపతిరాయలతో సంగరంబుజేసి యోడిపోయెను. ఉల్లాఖుఖానుడు[191] జగడంబుజేసి యోడిపోయెను. అన్నమరాజును[192] జిల్లరరాజులతో సంగరంబుజేసి యోడిపోయి తమతమ దేశంబులకు జనిరి.

అంత గటకవల్లభుండు కటకంబునకు బోవువాఁడై మార్గల్యంబుననున్న గుండంబునందలి హేమగోపురంబు చూచెద నని గుండంబుకడ కేగెను. ఈ జలంబులు పాకాలనుండి యెదురు గ్రుమ్మునని[192a] చెరువుకట్ట త్రవ్వించెను. అంత నాజలంబులుపోయి గుండంబులో మహోత్పాతంబులు కనుపించెను. కటకవల్లభుండు భయంబంది గజగజ వణకుచుఁ దన పురంబునకుం జనియె.

## ఉల్లాఖుఖానుండు సంధిచేసికొనుట

తిరిగి బలంబులఁ గూర్చుకొని యేకశిలానగంబునకు నెప్పటియట్లు వారు విడిసిరి. కదుమ మొనలవారు నెప్పటియట్లు వచ్చి విడిసిరి. కటకవల్లభునిపై నరపతి రాయులును ముకుందరాయులును[193] జిల్లరరాజులపై నన్నమదేవుండు ౭౭గురు పద్మనాయకులు రాఁజూచి సుల్తానుబలంబులకు దళవాయియై యెదుమార్లు పోరిపోరి సాధింపలేక చింతాక్రాంతుడై యున్న ఉల్లాఖుఖాను సంధిజేయందలంచెను. అంత నితరజాతి నాయకులు తమ నాయకత్వంబులు తీరుగాక! యని తలంచి[194]

సంధికి నొడంబడి ౫౦ లక్షలు వరహాలివ్వఁజేసికొనిరి. అప్పుడు ౨౫ లక్షలు పుచ్చుకొని కార్యాంతరంబున ౨౫ లక్ష లిచ్చునటు లొడంబడుచుకొని యేకశిలా నగరంబునకు వచ్చిరి.

అంత వారు ప్రతాపరుద్రుని సన్నిధికివచ్చి స్వామి హితపరులజూచి[195] యిట్లనిరి. దేవరవు మాకు రణరంగంబున ననుజ్ఞ ఇవ్వవలెను. దేవరవారు చూచుచుండ సుల్తానుదళంబుఁ గూల్చి ఉల్లాఖుఖానుఁ బట్టి తెచ్చి మీకు గానుకగా నిచ్చెదము. నవలక్షల ధనుర్ధరులకుఁ గయ్యంబులు మీరే చూచుచుంటిరి. నేడు మా కయ్యంబు మీరే చూడవలయునని వంతంబులాడిరి. అంత రాజులకలక్షల [illegible] నిచ్చెను. అంతట ఉల్లాఖుఖానుండు ౩౦లక్షల పదాతివర్గంబుల తోటి తరలి భోజారెడ్డిని[196] బిలిపించుకొని సంధిచేసికొనెను. ఆక్షణమందే ౧౦ లక్షల వరహాలిచ్చి కడమవి కార్యాంతరంబున నివ్వఁజేసికొనెను.

## ప్రతాపరుద్రునికి దైవశక్తి దొలగుట

తదనంతరంబున రాజు సముఖంబునకు బరుసవేది పూజార్లువచ్చి శంభు లింగంబునందు స్పర్శఁజేసిన లోహంబు సువర్ణంబు గాదయ్యె. జ్యోతిర్మయంబగు తేజంబు నిలువదయ్యె. నని విన్నవించిరి. ప్రతాపరుద్రుం డిదివిని వెఱగుపడెను. దేవరప్రసాదంబు తనకుఁ దొలగుట నెరింగెను. అంతట యుద్ధరంగంబునకు సన్నద్ధుండై హనుమకొండ సిద్ధేశ్వరు నారాధించి యనంతరము పద్మాక్షింబూజించి యద్దేవి పూర్వదత్తంబైన ఖడ్గఖేటకంబులు దేవి సమీపంబున సమర్పించెను.

అంతట ఖడ్గంబు సర్పాకారంబై పద్మాక్షీదేవి వదనగహ్వరంబు దూరి పోయెను. ఆ ఖేటకం బంగరాగంబుచందంబున నద్దేవి వక్షస్థలంబునందు లిప్తంబయ్యెను. దానినిజూచి శివదేవయ్యయు శాఖవెల్లి మల్లికార్జునుండు మొదలుగా గల పెద్దలు ప్రతాపరుద్రునకు నిట్లనిరి. ఖడ్గఖేటకంబులు తొల్లి మాధవవర్మకిచ్చు నప్పుడాదేవి యిదిమొదలు మీ సింహాసనంబు సహస్రవర్షంబులుండునని యానతిచ్చెను. నేటివఱకు సహస్రవర్షంబులు జరిగిపోయినవి. కాన నింక మానుష శక్తియేకాని తొల్లింటిరీతి దైవశక్తిలేదని వారు వచించిరి.

## ప్రతాపరుద్రుండు పట్టుబడుట

ప్రతాపరుద్రుం డిదివిని చింతాక్రాంతుండయ్యెను. పద్మాక్షిదేవిని వేయి

విధంబుల స్తుతించి సకలజనంబులతోటి తాను నిజనివాసంబున కేతెంచెను. పరుస వేది లింగంబునకు సాష్టాంగదండప్రణామంబు లాచరించెను, మరునాడు కయ్యంబునకు నాయత్తపడెను. కటకవల్లభునిపై నరపతిరాయల బంపెను. జిమా ముముల్కుపై[197] అన్నమదేవుని పద్మనాయకులను నవలక్షధనుర్ధరులను బంపెను. సింధురాజునుగూర్చి పశ్చిమంబునకు[197a] టిప్పుసుల్తాను*[198] బలంబులమీదికి బ్రితాపరుద్రుండు, యితరజాతినాయకులు ౫ లక్షలును, భోజారెడ్డి ౩ లక్షలును, తక్కినరాజులును, కన్నోజురాజు ౨ లక్షల గుఱ్ఱంబులును వీరపాండ్యరాజు ౧౩ ఏనుగులును, [199]దన కాసామదపుటేనుగులు ౨౦౦లును,తన్ను గొలిచిరాగ, మద గజారూఢుండై మౌక్తిక ఛత్రచామరంబులు శోభిల్ల యుద్ధంబునకు జనుదెంచెను. యుద్ధంబునేయు సమయంబున నితరజాతినాయకులు కొంత జగడంబు చేసి కదకుంజనిరి. [200]వారింజూచి తేరాల భోజారెడ్డి యుద్ధంబు జాలించి కడకుంజనెను. మరియు దక్కినరాజులు యుద్ధంబుచేసి[201] కొంతబలంబు జంపి తాము సమసిరి. వీరపాండ్యరాజులు[201a] ఘోరయుద్ధంబుచేసి బలంబులతోగూద సమసెను.

ఇట్లు సర్వసేనలు శాలివాహనశకము ౧౨౬౧ [202]రుధిరోద్గారి సవంత్సర ఆశ్వయుజబ. ౨ గురువారమునాడు యుద్ధరంగంబున గజారూఢుండై యున్న సమయంబున ప్రతాపరుద్రుండు పట్టుబడియెను.[203] అన్నమదేవుండును దెబ్బై యేడుగురు పద్మనాయకులిదివిని శోకమోహంబులు మనంబున బెనగొన జిమాముల్కుపై[204] నేగి యెదిరించి ఘోరయుద్ధంబుజేసి యాతని తలద్రుంచిరి.

అంతట జుమాముల్కు తమ్ముడగు సిద్దిఖానుండు హతశేషలును ఉల్లాఖానుని గలిసికొనెను. ఉల్గాఖుఖానుండు సిద్దిఖానుండిద్దఱు విచారించుకొని ప్రతాపరుద్రుని డిల్లీశ్వరు సముఖంబునకు బంప నూహించిరి.

రాత్రి ఏగుటయు[205] నితరజాతినాయకులు తమతమకు నొడంబడినరీని ౨౫ లక్షల వరహాలిమ్మని ఉల్లాఖుఖానుని యడిగిన నతడు నితరజాతినాయకులతో మున్ను మీకునిచ్చిన ౨౫ లక్షలు మగుడనిమ్మని వారిని బాధించెను.

* ఇది అపపాఠము. క్షమింపరాని ముద్రారాక్షసము. సూచికల క్రింద ఇచ్చిన వివరణ చూచేది-సం.

ఈవార్త సర్వంబును ప్రతాపరుద్రుండు విని తహతహపడి తాను రణశిక్షకై తెచ్చినదానిలో ౨౫ లక్షల వరహాలు సుల్తానుదళవాయియైన ఉల్లాఖుఖానుకు నిప్పించి, యితరజాతి నాయకుల బిలిపించెను. 206అంత సిగ్గుపడి ప్రతాపరుద్రుని దయావితరణంబులు దలంచి యితరజాతి నాయకులును, తేరాల భోజారెడ్డియు విచారించుకొని ప్రతారుద్రుని విడిపించుకొను వారమని శపథంబులు బలుకుచు జనుదెంచిరి.

అప్పుడు సుల్తానువశంబుల లక్ష గుఱ్ఱంబులను ౮ లక్షల పదాతి వర్గంబులును వెనుకనిల్పి ఢిల్లీమార్గంబుఁ బట్టిపోవుచుండెను. రామగిరిచేరువ నితరజాతి నాయకులు భోజారెడ్డి మున్నగువారు సుల్తానుబలంబులఁ బోనివ్వక యరికట్టి యుద్ధంబునకుఁ దలపడి రెండు ఝాములు ఘోర యుద్ధంబుజేసి ౫౦ వేల గుఱ్ఱంబులను ౩౦ లక్షల207 పదాతి వర్గంబులను గూల్చి యితర జాతినాయకులు నిరవశేషంబుగా మడసిరి.

అట సుల్తాను దళంబులు కయ్యంబున నలసినవై గోదావరి గర్భంబున రాత్రి విడిసినవి.

ఆ ప్రతాపరుద్రుండు మజ్జన భోజనాదులు దీర్చి కూర్చున్న యెడ యేకశిలానగరంబు ప్రజలు ప్రతాపరుద్రుని సముఖంబునకు వచ్చిరి. అందు కరదీవి కలవారు ౧౦౦౦౦ ఛత్రచామరంబులవారు నూడిగంబులవారు ౧౦౦౦౦, 208 పరిహాసకులు నలుబది మందియును 208a శాఖివెల్లి మల్లికార్జునుండును మొదలుగాగల విద్వాంసులు ౧౦౦౦ ను గుండంభట్లు మొదలుగాగల పురోహితులు ౧౦౦౦ను ఉత్తమ క్షత్రియులు రాజబంధువులు 209 ౫౦౦ లును నపారధన, సమేతులైన వైశ్యులు ౨౦౦ నాటక శాలల వారు 210 ౫౦౦, ఝట్టిమల్లులు ౨౦౦ చికిత్సకులు ౨౦౦, జ్యోతిష్య ప్రజ్ఞావంతులు ౨౦ రథకక్షౌరకులు మొదలు గాగల పనులవారు సకల జన నియోగంబుల వారు ౧౦౦, రాజుయొక్క ఉత్తమాశ్వంబులు ౧౦ యును, గజంబులు ౮ యును, 211 శివదేవయ్యయును శరభాంకుండును, మల్లికార్జునుండును రంగనాథుండును మొదలుగాగల వారు, ప్రతి మాసంబునకుఁ దులాభారంబునకు 212 ౩ కోట్లనిచ్చు సకల నియోగంబుల వారును, రాజ సముఖంబునకు వచ్చిరి.

ఆరాజందఱిని [213]గారవించి శివదేవయ్యఁజూచి అహితాజ్ఞుల తెరగెయ్యది యని [214] యడిగెను. ఆయయ్య మనమీదేశంబు నుండి నతిశీఘ్రంబున [215]మరలం గల వారమని యానతిచ్చెను.

## ప్రతాపరుద్రుఁడు విద్యానాథునికి నంగుళీయకమును బహుమతిగా నొసంగుట

అందునొక విప్రుండు ప్రతాపరుద్రీయంబను గ్రంథంబు [216] చెప్పి యా రాజుకు నంకితంబుగా నిచ్చెను. ఆరాజు శలాక పరీక్షచే నచట యాశ్లోకం బులు చదివించెను. సర్వజ్ఞుండు గావునఁదెలిసి యావిప్రునకు బ్రతాపరుద్రుండు తన యంగుళీయకము[217] నిచ్చెను. ఆవిప్రునకు విద్యానాథుండని పేరుపెట్టి యేనుగుపై నెక్కించి యుత్సవము గావించెను.

ఆవిద్యానాథుండంత రాజు సెలవుపొంది యేకశిలానగరంబున కేతెంచి యాయుంగరంబు [218] వ్యవహారుల ముందఱఁ బెట్టి యిందుకుఁదగిన ద్రవ్యం బివ్వుఁడని యడిగెను. ఉంగరంబును జూచి యిది యమూల్యంబు ఇందుకు దగిన ద్రవ్యంబివ్వలేమని వచించిరి. ఆ విద్యానాథుండు మీరేమి యొసంగిన నదియే మాకు ౧౦ లక్షలని పల్కెను. ఆవిప్రుని వాక్యంబు ప్రతిష్ఠించి యా యుంగరం బునకు ౧౦ లక్షలిచ్చిరి.

## నరపతి రాయులు మొదలగు వారు శత్రువుల సంహరించుట

ఇక్కడ నరపతి రాయులు ప్రతాపరుద్రుండు పట్టుబడుట వినెను. తనకు నుద్దేశంబై యున్న[219] కటక వల్లభునిఁ జంపి సుల్తాను దళంబులద్రుంచి ప్రతాప రుద్రుని మగుడ తెచ్చెదనని పల్కెను. కటకవల్లభుని గజంబులు రాకుండుటం జేసి[220] యశ్వద్ధామ మతంబుఁ దలంచి బలంబుల నాయత్తపఱచి రాత్రి సుఖ సుప్తులై యున్న కటకవల్లభుని[221] దళంబులపైఁబడి పొడిచియు నరికియుఁ బెక్కు విధంబుల గయ్యంబు చేసి ౪ వేల గజంబులఁ దునిమెను. ౩ వేల గజంబులఁబట్టు కొనెను. పన్నిద్దర రాజకుమారుల దుంచెను. కటక వల్లభుని దళంబులంత పారి పోయెను.

అప్పుడు నరపతి రాయులది గెలుపుగఁ జేసికొని సుల్తానుబలంబులఁ గూడి ఘోరయుద్ధంబు జేసి ౫౦ వేల గుఱ్ఱంబుల, ౧ లక్ష పదాతి వర్గంబులఁ ద్రుంచి సుల్తానుబలంబులఁ బోనివ్వక యరికట్టెను.

అప్పుడు ఉల్లాఖుఖానుండు విచారించి రాజును మగుడ విడిపించుకొనినచోఁ గార్యహానియగునని తలంచెను. విలిచి కయ్యంబుఁ జేసితిమేని ప్రాణహానియగునని భావించెను. రాజును నెటులయిన ఢిల్లీపురంబునకుఁ బంపవలయునని తలంచి, యొక్క గూఢమార్గంబున ౨౦వేల గుఱ్ఱంబులతోడ[222] ఢిల్లీ పురంబునకుఁ ప్రతాప రుద్రుని, బరివార సమేతముగా బంపెను.

అదే సమయంబునఁ గటకవల్లభుండు ౫ వేల గజంబులఁ గూర్చికొని ఉల్లాఖుఖానునిఁ గలుసుకొనెను. మఱియు అన్నమదేవుండు ౭౭ గురు పద్మనాయకులు నరపతిరాయులఁ గలిసికొని సుల్తానుదళంబులఁ జుట్టుకొని[223] కటక వల్లభుని దళంబుల పైఁబడి సర్వబలంబుల గూల్చి నాలుగువేల దళంబుల దునిమిరి. మఱియు శిబిరంబుఁజొచ్చి కటకవల్లభుని తల ద్రుంచిరి, మగుడి నరపతిరాయులును అన్నమదేవుండును వింధ్యానగరంబుఁ[224] జేరిరి. కటకవల్లభుని ప్రధానులు లింగసముఖంబునకుఁ[225] బోయి యేకశిలా నగరంబుననున్న రామచంద్రదేవునిఁ దమకు నియ్యజేసికొని[226] కటకంబునకుఁ బట్టంబు గట్టికొని యేకశిలానగరంబుఁ జేరిరి.

## సుల్తాను ప్రతాపరుద్రుని గౌరవించుట

ప్రతాపరుద్రుండు పట్టుబడి వచ్చుచున్న వార్త ఢిల్లీ సుల్తానుండు చారులచే విని యోజనంబు మేర[227] నెదురుగాఁబోయి మహావైభవంబుతోఁ బురంబునకుఁ దోడ్కొనిపోయి, బహువిధంబుల సత్కారంబులు గావించెను. సింహాసనంబునఁ గూర్చుండంజేసి తానునొక సింహాసపీఠంబునఁ గూర్చుండి ముచ్చట లాడుచున్న[228] సమయంబున ప్రతాపరుద్రుని లలాటంబున లోచనంబు గనుపించెను. [229]సుల్తాను దానింజూచి వెఱగుపడి లేచి కటకటా! ఎట్టియపరాధంబుఁ జేసితినని మనంబున జింతించి తన సౌధంబునఁ బ్రతాపరుద్రుని యుండంజేసి తనతల్లికివార్త నెరింగించెను.

## సుల్తానుతల్లి "మీరిద్దఱు హరిహర స్వరూపులని" వచించుట

ఆమానిని ప్రయాగ మాధవ సేవాపరిణతి యగుటంజేసి తన కుమారుం డగు సుల్తానుని నూరడించి ప్రతాపరుద్రుండును నీవును మహనీయ శయ్య యందు సుప్తులైనచో మీ యిద్దరి తారతమ్యంబులు నాకు నెరుంగ వచ్చును నేను చూచెదనని పల్కెను.

అట్లుకాకయని యారాత్రి యొక్క మేడపై నిద్దఱు పవ్వళించి సుఖ సుప్తులైయున్న యెడ సుల్తాను తల్లి యేతెంచి చూచెను. అప్పుడు వారిద్దఱియందు హరిహరాత్మకంబైన తేజంబులు గన్పించెను. ఆతేజంబిద్దఱి యెడ వెడలి యేకంబై యంతరిక్షంబున కెగసి పోయినది. ఆ జనని చింతించి వారలను లేపి 230 "మీరు హరిహరాత్మకంబైన తేజంబులు" మీలోమీరు వైరంబులు చాలింపుడు మీయిద్దఱికిం దొల్లింటి యట్లు మహామహిమ చెల్లదని బోధించెను.

## సుల్తాను ప్రతాపరుద్రుని విడిచిపెట్టుట

సుల్తాను ప్రతాపరుద్రుని వెంటవచ్చిన విప్రులకు ౩ కోట్ల ద్రవ్యంబులు పంచిపెట్టి ప్రతాపరుద్రునకు నానావస్తువులు సమర్పించి వినయపూర్వకంబుగ నిట్లనియె. ఏను నీకు నపరాధంబు చేసితినని మనంబునం దలంచక యేకశిలా నగరంబుం బ్రవేశించి సింహాసనంబునం గూర్చుండియున్న శుభవార్తనాకుం బంప వలయును. ఇదియే నా విన్నపంబని వచించెను. ప్రతాపరుద్రుండతని కిట్లనియె. ౭౭ ఏండ్లు231 రాజ్యభోగంబు లనుభవించితిని. ఇంక చాలును. ఏను మణికర్ణిక యందు స్నానము చేసి విశ్వనాథుని నారాధించుచు వారణాసి యందు నిల్చెదను. రాజ్య భోగంబులు సహస్రగణిత భోగంబులు. ఇక్కడికి నానందంబని వచించిన232 సుల్తాను233 నిట్లనియె. ఏకశిలానగరంబున నొక్క దినంబైనను సింహాసనంబునం గూర్చుండి234 మగుడ కాశికిం జనుమని ౨ వేల235 గుఱ్ఱంబు లను సహాయంబుగా నియమించి ప్రతాపరుద్రుని మదగజారూఢుం జేసి సుల్తాను యోజనదూరంబు పర్యంతము ప్రతాపరుద్రుని వెంటం బాదచారియై నడవసాగెను. అంతం బ్రతాపరుద్రుండుసుల్తానును నిల్పి కాశికిం జని మణికర్ణికయందు స్నానమాచ రించి విశ్వేశ్వరుని నారాధించెను. అచ్చట నెనిమిది తులాభారంబులు236 మూరు కోటి237 సువర్ణంబులు దానంబులిచ్చి యేకశిలానగరంబునకుం బయనమయిరి.

## శివదేవయ్య ప్రతాపరుద్రునితో "నీవు కైలాసంబున కేగెదవని" వచించుట

గోదావరి జేరి కాళేశ్వరంబు వచ్చి యచ్చట నిల్చి తీర్థంబులాడి కాళేశ్వరంబున ముక్తేశ్వరుఁ గొల్చి యేకశిలానగరంబునకుఁ జను సమయంబునం శివదేవయ్య ప్రతాపరుద్రుని నేకాంతంబునకుం బిలిచి, యిఁకఁ బదునెనిమిది దివసంబులకు నీవు కైలాస నివాసుడవు కాగలవు. ఇది గౌతమీ గంగాగర్భంబు, ఇందుల నీ దేహంబు[238] విడిచి దివ్యదేహంబు దాల్చి కైలాసంబున కే గెదవని శివుండు మీకు వరం బొసంగెను. కావున నిచ్చటనే యుండి యేకశిలానగరంబునం గల ప్రజలకీవార్త చారులచేఁ దెలియఁ జేయుమని వచించెను.[239]

## ప్రతాపరుద్రునిఁ జూడ నేకశిలా నివాసులందఱు నే తెంచుట

అంత రాజు దనపట్టపుదేవులను రమ్మనమనియు బండారంబునం గల సకల ద్రవ్యంబులను ఆహితాగ్నులను దెమ్మనియుఁ గబురు పంపెను.[240]

అతిత్వరితంబున నేకశిలానగరంబునఁగల యా బాలగోపాలమును[241] సకల భండారు ద్రవ్యంబులను దీసికొని మూడు దివసంబులకుఁ బ్రతాపరుద్రుని సముఖంబునకు నందఱు వచ్చిరి. నరపతిరాయులును అన్నమదేవుఁడును ౭౭గురు పద్మనాయకులును సుల్తాను దళంబులను నిర్విశేషంబుగా దునిమి యా జుమానుఖానుని[242] దేశంబున కేగియాతని తఱిమించి యా పట్టణంబుఁ గూలనేసి యానీము పాడుచేసిరి. అనంతరము చారులచేఁ బ్రతాపరుద్రుండు కాళేశ్వరంబున కేగుదెంచుట విని వారలందఱు ప్రతాపరుద్రునిఁ గలిసికొనిరి.

అప్పుడు ప్రతాపరుద్రుఁడు నరపతిరాయులను[243] బిలిచి కౌగలించుకొని తొల్లి మా పెద్దలయట్లు పరాక్రమంబుఁ జేసితివిగాన నీకుఁ బ్రతాపంబు చెల్లునని ప్రతాప బిరుదునిచ్చెను. మఱియు నరపతి రాయులకుఁ దనకూతురు రుద్రమహాదేవి[244] నిచ్చి వివాహంబు చేసి ౫ కోట్ల సువర్ణంబులును కృష్ణానదిమేరగా దక్షిణదేశం బరణంబిచ్చి పంపెను.

రామచంద్రదేవునిం[245] బిలిచి గజపతికిఁ బట్టంబుగట్టి యన్నమదేవుని కూతురు మమ్మమ్మ దేవిని[246] నతనికి వివాహంబుఁ జేసి ౩ కోట్ల సువర్ణంబులిచ్చి కటకంబునకు నతని గజంబులఁ గూర్చి పంపించెను. ప్రతాపరుద్రుఁడు తన

తమ్ముఁడైన యన్నమదేవునిఁ బిలిచి నీవీ రాజ్యంబునకుఁ బట్టాభిషిక్తుండవై రాజ్యంబు పాలింపుమని వచించెను.

అంత అన్నమదేవుండిట్లనియె రాజ్యంబు సకల భూపతులు గొలువ నీవు పాలించిన వెనుక నట్టి ప్రతాపంబు నాకుఁ జెల్లనేరదని వచించి శివదేవయ్యను జూచిన నాయయ్య, ఈ సింహాసనంబు మీ సంతతికి లేదు. ఆశ లుడుగుఁడని వచించెను.

## ప్రతాపరుద్రుఁడు తననుగొలిచిన వారినందఱిని సత్కరించుట

ప్రతాపరుద్రుఁడు తన్నుఁ గొలిచిన కన్నోజిరాజు కయ్యంబునఁ జచ్చిన నతని సుతునికిఁ బట్టంబుఁ గట్టి ౨౦ కోట్ల[247] ద్రవ్యంబులు ౫౦ వేలగుఱ్ఱంబులిచ్చి పంపెను. వీరపాండ్య రాజుల కుమారునికి వేయి గజంబులు కోటి ద్రవ్యంబులిచ్చి తన మేనత్తకూతురు కాకితదేవి[248] నిచ్చి పంపెను. తదనంతరంబున ౭౭ గురు పద్మనాయకులఁ బిలిపించి[249] సింహాసనంబున మీరు స్వామిహితంబునం గొలిచితిరి. మీకు నే యిచ్చిన దేశంబులకు మన్నీలై, ధరపై రాజులై, స్వతంత్రులై, యుండుడని ౩ కోట్ల ద్రవ్యంబులు వారలకుఁ బంచిపెట్టి పంపెను.

వారలు తమతమ దేశంబుల కేగి కొందఱు రాజులై కొందఱు గజపతి మన్నీలై కొందఱు రాయన్నీలై స్వతంత్రులై యుండిరి. తనకు సహాయుండై వచ్చిన సుల్తాను బలంబులకు ౧౦ వేల వరహా లిచ్చి పంపెను. తన బలంబులలోన నవలక్ష ధనుర్ధారులలోఁ గయ్యంబున మడసినవారల పుత్రుల గారవించి ౯ లక్షల ఎన్నిక జేసి ౪ కోట్ల సువర్ణంబులు వారలకిచ్చి యన్నమదేవున కప్పగించెను. తదనంతరంబున మిగిలిన ద్రవ్యంబంతయు సర్వజనంబులకు బంధుజనంబులకుఁ బంచిపెట్టెను. రాజ్యభారంబు అన్నమదేవుల వశంబుఁ జేసెను.

## శాలి వాహన శకము ౧౨౯౧ సంవత్సర మాఘశు ౭ లు

## ప్రతాపరుద్రుండు - భార్యయగు విశాలాక్షియు స్వర్గస్థులగుట

తాను గోదావరి యందు స్నాన మాచరించి దివ్యాంబరంబులు ధరించి[250] నానా భూషణంబులు దాల్చి విభూతి రుద్రాక్షమాలికాలంకృతుండై గోదావరి గర్భంబునఁ గూర్చుండి, శంభులింగంబును దన హృదయంబున నిల్పి ధ్యానిం

చెను. అనంతరము రాజు తన పట్టపు దేవియగు విశాలాక్షిని౯ జూడగనే శివ దేవయ్య విశాలాక్షి కిట్లనియె తల్లీ! నీవు నన్ను౯ జాలకాలంబు పూజించితివి. నీ కిష్టంబైన వరంబిచ్చెద వేడుమనెను. ఆయమ్మ యాతనికి నమస్కరించి మహాత్మా! తనకు౯ బతిజీవంబు వెంటనే తన జీవంబును జనునట్లు వరంబు౯ దయచేయు మనెను. ఆయయ్య యట్లనే యొసంగెను.

శాలివాహన శక ౧౨౬౦ సంవత్సర 251 మాఘ శు ౭ గురువారం252 ఉదయ కాలంబున౯ ప్రతాపరుద్రుండు నిజదేహంబు విడిచి దివ్యదేహంబు దాల్చి దివ్య విమానారూఢుం డాయెను. ఆ రాజు కాంత విశాలాక్షియు నిజదేహంబు విడిచి దివ్యదేహంబుదాల్చి పతితో౯ గూడ దివ్య విమానంబెక్కెను. ఇట్లు నా దంపతు లా విమానంబున సర్వజనంబులు చూచుచుండ౯ గైలాసవాసులైరి.

## వీరభద్రదేవు౯డు పట్టాభిషిక్తు౯డగుట

అంతట అన్నమదేవు౯డు ప్రతాపరుద్రునికి విహితకార్యంబులు చేయించి వైరాగ్యంబవలంబించెను. ప్రతాపరుద్రుని కుమారు౯డు వీరభద్ర దేవుని 253 తలంపెరింగి యన్నమదేవుండు వీరభద్రదేవునకు౯ బట్టంబు౯గట్టి తానును విరూపాక్షుండును నీశాన్యభాగంబునందలి వింధ్యశైలంబునకుం జనిరి. శివ దేవయ్యగారు శ్రీశైలంబునకు౯ జనిరి.

254 వీరభద్రదేవు౯డు పట్టాభిషిక్తుండై రాజ్యంబు చేయుచుండెను. అట్టి సమయంబున నక్కడ ఢిల్లీయందు ఉల్లాఖుఖానుండు సిద్దీఖుఖానుండు మదయుత తమ దేశంబు లన్యులు దోచుటవిని నరపతిరాయలు రౌద్రాకారుండై ప్రయాణభేరి వేయించి ౩ లక్షల గుఱ్ఱంబులను ౧౦ లక్షల పదాతి వర్గంబులను గూర్చుకొని విజయనగరంబుమీదుగా౯ జనుచెంచెను. అప్పుడు వీరభద్రదేవు౯డు తన పురంబును సుల్తానువారి దళంబును గొంత రాజ్యంబును లోనుజేసికొని యేలు చుండెను.

## సుల్తాను నరపతిరాయలతో సంధి చేసికొనుట

విజయనగరంబునుండి నరపతిరాయలువచ్చి సుల్తానుబలంబుల రానివ్వక యావల కృష్ణానది దాటనివ్వక గండ్లు౯ గాచియుండెను. మఱియు ముప్పదిలక్షల పదాతివర్గంబులతోటి సుల్తాను వారిదళంబులతో యుద్ధంబుచేయుచు గవినులు గడ్డి కవాదంబు రానివ్వక యిట్లు పెక్కుభంగుల౯ జీకాకు౯ జేయుచుండెను. అట్టి సమయంబున౯ బండ్రెండు సంవత్సరంబులు పోరిన సుల్తానులు వెనుదీయక యచ్చట బెగడకోట 255 యను పురంబుగావించుకొని యుండె.

క్రమక్రమంబున బలంబులు కొంచెంబైన సుల్తాను నరపతిరాయులతోఁ బోరజాలక తన భూములు తనకు లోనుగాక మరల బడుటవిని, ఢిల్లీకిపోక. నరపతిరాయలతో సంధిచేసికొనెను. నరపతిరాయులకు నప్పనంబులు పంపెను.

## సుల్తానుబాధల తాళజాలక వీరభద్రదేవుఁడు కొండవీడుననున్న రాయలకడకేగుట

అటు తరువాత నేకశిలానగరంబును ఢిల్లీసుల్తాను దనయాజ్ఞకు లోనుగాఁ జేసికొని దేవాలయంబులు పడగొట్టించుచు బహువిధంబుల బాధపెట్టుట ప్రారంభించెను. వీరభద్రదేవుండది సహింపఁజాలక సుల్తానువారి భృత్యుల నందఱిని దునిమించి తాను పురంబునంగల జనంబులు నేకమై పురంబు వెడలి కొండవీట నున్న రాయలఁగలని యుండెను. 256

ఇట్టి పవిత్ర చరిత్ర నొక్కసారి త్రికింపుడు. ౨౨౫ * కథలుగలిగి కాకతిరాజులఁ గ్రమంబునఁ దెలియఁజెప్పితని గాంచుఁడు. తొల్లి ౧౨౦౦ సంవత్సరంబులు కాకతిరాజులచే నేడి పాలించఁబడి సకలైశ్వర్య సిద్ధికరంబై విలసిల్లి యుండునో యా చరిత్ర యాలకింపుఁడు. అంపకందారంబునుండి మొదలు సోమదేవరాజేలుచుండగాఁ గటకవల్లభుండువచ్చి యుద్ధంబుచేసి వానిచేతను బట్టుపడి మృతిచెందెను. తరువాత నారాజు పట్టపుదేవియగు సిరియాళదేవి హనుమకొండకువచ్చి హనుమకొండను మాధవవర్మయను సుమారునిఁ గాంచెను, ఆ మాధవవర్మ మహారాజు పద్మాక్షిదేవి వరప్రసాదంబున నేకచక్రంబుగ రాజ్యంబు పాలించెను.

వారి సాంప్రదాయకులు శ్రీమత్ప్రతాపరుద్రుని పర్యంతరము నేకశిలా నగరము గట్టి పెక్కు సాహసంబులుచేసి ౧౨౦౦ ఏండ్లు [illegible]

ఈ ప్రతాపరుద్రుని చరిత్ర నెవరువిన్నను, జదివినను వ్రాసినను వారికి శివుఁడా చంద్రార్కంబుగఁ బుత్ర పౌత్రాద్యైశ్వర్యంబులను నిచ్చుగాక.

ఏకాంబ్రనాధునిచే రచింపబడిన ప్రతాపరుద్రచరిత్ర

యందు సర్వమును

సంపూర్ణము

# సూచికలు పాఠభేదాలు

## సంకేతాక్షర వివరణ

ప. ప : ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, (1917, 1918) లోని పాఠము.

సి. చ : సిద్ధేశ్వర చరిత్ర (హైదరాబాదు, 1960) లోని పాఠమ

సో. రా : సోమదేవరాజీయము (తణుకు, 1969) లోని పాఠము.

# సూచికలు - పాఠభేదాలు

1. 'గణనాథుని' అని ప.ప; కానిసి. చను బట్టికూడా 'నాగనాథుని' అనునదే సరియైనపాఠము.

2. 'శ్రీశైలోత్తరదిగ్భాగంబున' అని ప.ప. లో అధికపాఠము.

3, గర్గశేయుండు (సి.చ)

4. నూటయెన్బదియాఱు (సి.చ); నూఁటబదేడు (సో.రా).

5. శాత్రవుల గెలిచినచరిత్రి సంగ్రహించుక ఇన్నూరు యిరువదేను కథలుగా అనుక్రమణిక సర్వంబు దెల్పెద (ప.ప); నూటయిర్వది యైదు నొప్పను కథలు (సి.చ)

6. క్షేమాంకు (ం) డు (ప.ప; సో.రా); క్షేమకుడు (సి.చ)

7. విజయాంకనాథుండును (వ.ప); జయార్కుడు (సి.చ)

8. ఈ పంక్తిపర్వాత (వ. వ) లో కొంత అధికపాఠము ఇట్లుంది: 'అతనికి రాజనరేంద్రుండు జన్మించె. ఆ రాజనరేంద్రునకు సారంగధరుండు జన్మించె'.

9. ఋషీశ్వరుండుగా (ప. ప.)

10. దినంబులు (ప. ప.)

10a. శ్రీనగంబునకు (సి. చ); శ్రీగిరి (సో. రా.)

11. యోగవాలంబులు (ప. ప.); యోగవాగ (గె) ములు (సి.చ; సో. రా.)

12. 'యా నృసింహమూర్తియను' అని (ప. వ.) లో అధిక పాఠము; మాయా నృసింహస్వరూపంబు (సి. చ;) మాయానృసింహ వేషమున నలరు శ్రీజనార్దనదేవుని వీక్షించె (సో. రా.)

13. అతిభీషణంబుగ గనుపడిన (ప. ప.) అతిభీషణాకారుడైన (సో. రా.)

14. అతని కూతురు నందయను కన్యకును (ప. ప;) సునంద (సి. చ; సో.రా)

15. వసుమతి (ప. వ; సో. రా.) ఈ వసుమతి (సి. చ,) లో లేదు.

16. అంత నానందుండు (వ. ప.)

17. ఇట్లు చాలుక్యవంశతిలకుండైన నందుని పరోక్షంబున (ప. ప): చాళుక్య వంశతిలకుండైన నందుండు (సో. రా.) "చోళాఖ్యవంశుండైన" అనే పాఠం తప్పు.

18. పదమూడు వేల నూరు (ప.ప.)

19. మూఁడు వేలును నూఱు (సి చ;) మూడువేల నోనూరు (సో. రా;) పదమూడు వేల యేనూరు (ప. ప.)

20. తంత్రి కూటంబు (ప. ప.) - ఈ పాఠం స్పష్టంగా తప్పు

21. యదరిపడి (ప. ప.)

22. పదిమూర్లు (ప. ప.), నెనిమిది మాఱులు (సి. చ.); నారు మారులు (సో. రా.)

23. ఇటనుండి ప. ప. లో ఉన్న కొంత అధిక పాఠానికై చూడు అనుబంధం 1. సి. చ. సో. రా లు ఈ అధికపాఠాన్ని అనుసరించాయి.

24. యెర్కరాజుల పౌరోహితుడు (ప ప.)

25. లవణము వడ్డింప (ప. ప.)

26. యా యంగన వడ్డించిన లవణమును తమరు పచనంబు చేసిన అన్నంబును వడ్డించుకొని అందరు సంతుష్టిగా నారగించిన (ప. ప.)

27. దళంబులు (ప. ప.)

28. మంచి ముహూర్తంబున (ప. ప.)

29. సహ్స్ర వర్షంబులు (వ. ప.); సహస్ర ద్వయమేలు మాసములు(సి. చ.); ద్వి సహ్స్ర మాసములు (సో. రా.)

30. అమరావతి (ప. ప); అమరసావేమల (సి. చ); యమరవాని (?) రాజ్య (సో. రా.)

31. శాలివాహన శక వర్షంబులు ఇన్నూట ముప్పయి అరగు తారణనామ సంవత్సర మాఘ శు. ౫ గురువారంబున శ్రవణా నక్షత్రంబున మాధవ వర్మ రాజేంద్రుండు సింహాసనం బెక్కుటయు (ప. ప); శాలివాహన (శక) వర్షమందు శతంబులు నవిరెంటి మీద పొందుగా ముప్పది రెండు వర్షములు నందున తారణ సంవత్సరమున యందలి మార్గ శిరంబును

మాస మందు పంచమి తిథియగు గురువార మందలి శ్రవణంబు నందు శుభలగ్న మందు సింహాసన మవలీలనెక్కె (సి. చ); శాలివాహన ఘనశక వత్సరములు మునుకొని మున్నూట ముప్పది యారగు తారణ నామ వత్సరమునందు మాఘ సిత పక్ష పంచమీ మఘవ మంత్రి వాస రంబున శ్రవణాఖ్య బరగుతార (సో. రా.)

32. అమరావతి నున్న (ప. ప); అమరవాది (సి. చ., సో. రా.)

33. లవణ దధి గుడిచితమి (ప. ప).

34. అన్యో దోషంబు చెందరాదు (ప. ప.)

35. సమాధాన శాంతలంబుల (ప. ప.)

36. ఎనుబది వర్షంబులు (ప. ప.); డెబ్బదినాల్గు వర్షముల్ (సి.చ.); డెబ్బది యెనిమిది యేండ్లు (సో. రా.)

37. పొరికి వెన్నమరాజు విషయం ప. ప. లో లేదు.

37a. డెబ్బది మూడేండ్లు (సి.చ.); డెబ్బదియేడేండ్లు (సో. రా.)

38. డెబ్బది వర్షంబులు (ప. ప.); డెబ్బది మూడేండ్లు (సి. చ.); డెబ్బది యారేండ్లు (సో. రా.)

39. డెబ్బది అయిదు (ప. ప.); నేబది తగ నెనిమిదేండ్లు (సి.చ.); డెబ్బది రెండేండ్లు (సో. రా.)

40. కాణంగి దేవిని (ప. ప.); రాణి గంగిదేవు (సి. చ.); రాణంగి దేవుని (సో. రా.)

40a. పందొమ్మిదేండ్లు (సి. చ.); నీవ వర్షంబులు (సో. రా.)

41. డెబ్బది ఆరు యేండ్లు (ప.ప.); నెనుబది తొమ్మిది (సి. చ.); డెబ్బది నాల్గు వర్షముల్ (సో.రా.);

42. సువర్ణ పులకాంకితముగా (ప. ప.)

43. విలాసవతియు కాంతిమతియు నను నిద్దరు చెలికత్తెలతో గూడ (ప. ప.)

44. మరియు ఉత్తరపు గవిని నుండి రాయలకు చెల్లిన ఉత్తరదేశంబు

భువనైకమల్లునకు నృసింహరాయలు అరణం బిచ్చుటయు, శ్రీ రంగమ్మ దేవికి కంచీపురంబు ఆదికాక చోళరాజ్యంబు పసుపునకు చదివించుటయు (ప.ప.); యరణ మప్పుడు కాంచిపురంబు నాదిగను నొప్పగ జోళ దేశంబును (సి. చ.); యుత్తరదేశ మజ్జన పతికినిగాంచికపురి మొదలుగా గల్గు చోళ దేశమంతయు రంగమదేవి పసుపునకు నొసంగె (సో. రా.)

45. మీనాంబరుండనా (ప. ప.); మీనాంబరంబను నొక్కతిప్ప (సి. చ.); మీనాంబరుండు (సో. రా.)

46. కోటి ధనంబులు (ప. ప.)

47. హన్మద్గిరి (ప. ప.)

48. ప్రజాన్యాయము (ప. ప.); రాజప్రజాన్యాయనడవళ్లు (సి.చ.); రాజ ప్రజాన్వయము (సో. రా.)

49. ఎనిమిది లక్షల నెంచి స్వర్ణంబులు (సి. చ); నేబదివేల మాడలిచ్చి (సో. రా.)

50. కట్నంబు గట్టి (ప.ప.); నరపతిరాయ పట్టంబు దిరంబుగాగట్టి (సో. రా.)

51. డెబ్బది ఆరేండ్లు (ప.ప.); నెనుబది రెండేండ్లు (సి.చ.); డెబ్బదారేండ్లు (సో. రా.)

52. కాకిత దేవి (ప. ప.); కాకితమహాదేవి (సి. చ); కాకతిదేవి (సో.రా.)

53. డెబ్బదినాలుగేండ్లు (ప. ప.); యెనబదాఱేండ్లు (సి. చ.); డెబ్బదినాలు గేండ్లు (సో. రా.)

54. పదినెలలు (ప. ప.); పన్నెండు ఘనవర్షములు (సి.చ.); బదియు రెండు వత్సరములు (సో. రా.)

55. త్రిదండ మునులు (ప. ప.)

56. వారిచే హిడింబాశ్రమ మహత్త్వంబు (ప.ప.); హిడింబాశ్రమమహిమ (సి. చ.); హిడింబాశ్రమమహాత్మ్యంబు (సో. రా.)

57. కాకిత ప్రోలరాజు (ప. ప.); ప్రోలరాజు (సి. చ.)

58. మునులను (ప. ప.)

58a. శాలివాహనశకవర్షముల్ తుదకు తొలి తొంబనూటను తొమ్మిదౌ యేటికగు శుభకృన్నామమగు వత్సరముననగు కార్తికంబున నందలి శుక్ల పక్షంబునందలి పరగంగవిదియ నక్షయంబగు రోహిణందు శుభలగ్న మందు (సి. చ.); శాలివాహన శతాబ్దంబులు దొమ్మిది నూరుల దొంబదియవ వరశుభకృన్నామ వత్సరంబునను కార్తిక శుక్లపంచమీతిథిని దివిజగురు వాసరంబున గరమొప్ప రోహిణీ నక్షత్రమునను (సో. రా.)

59. వోరంగల్లు కట్టుటయు (ప. ప.)

60. శ్రీవిద్యాధరంబను (ప. ప.); శ్రీవిద్యాచక్రంబును (సో. రా.)

61. గవని (ప. ప.)

62. ఇన్నూరు (ప. ప.)

63. నూరును (ప. ప.)

64. యాభై (ప. ప.)

65. అయ్యేలోహంబును (ప. ప.)

66. చంపుమనుటయు (ప. ప.)

67. రెండువెయిలబంట్లు (ప. వ.); ఇన్నూటయరువదియేర్పడ భటుల. (సో. రా.); రెండువేల భటుల (సో. రా.)

68. అయినవోలు మైలారు దేవునకు (ప. ప.)

69. మొగ్గిచర్ల యేక్వారాదేవికిని (వ. ప.)

70. వెలనాటి (ప. ప.); వెలనాటి గొప్ప పృథ్వీశుల (సి. చ.); వెలనాటి నృపులపై (సో. రా.)

71. వరాహలాంఛనంబులు (ప. ప.); గింగి భైరవుల వరాహలాంఛనంబుల (సి. చ.); గంగేశ్వర వరాహలాంఛనములు (సో. రా.)

72. 'తదనంతరంబున గయకుంజని పితృదేవతలకు మోక్షంబు గలుగునట్టి పితృయాగంబులు చేసి కృతార్థుండై'- అని ప. ప. లో ఇచట అధిక పాఠము.

73. శ్రీశైలంబునకుం. (వ. ప.)

74. మూడు (వ. ప.); పది (సి. చ.); నెన్మిది (సో. రా.)

75. దుర్మంత్రంబు (ప. ప.)

76. అతని పురివెడలించుటయు (ప. ప.); గిరువువేయించి (సో. రా.)

77. వాని సుతునకు (ప. ప;) సి. చ, సో. రా. లలో తవకనే ఉన్నది.

78. సహితంబుగా రాజ్యంబుచేసి (ప. ప.); నమ్మహదేవరాజు గణపతిదేవరాజు సహితంబుగా మూడేండ్లు రాజ్యంబు బాలించి (సో. రా.)

79. దేవగిరిరాజులు సేయు గజయుద్ధంబున మహాదేవరాజు సమయుటయు (ప. ప.); నమ్మహదేవరాజు...నసమ గజయుద్ధమున మృతుడయ్యెనంత (సో. రా.)

80. రుద్రమదేవిసి (ప. ప.) ; రుద్రమాంబను (సో. రా.); రుద్రమ్మ (సి. చ.)

81. ప. ప. లో తిక్కనసోమయాజి రాకకు సంబంధించి. ఇచటనుండి కొంత అధిక పాఠము కలదు. ఈ అధిక పాఠానికై చూడు అనుబంధం. 2. సి. చ., సో. రాలు అధిక పాఠాన్ని అనుసరించాయి.

82. మున్ను వెలనాటి రాజులగెల్చి (ప. ప.); వెలనాడు చేరియు వీడెల్లిగాల్చి వెలనాటి రాజును వెసగెర్చి (సి. చ.); మున్వెలనాటి ధరణిపతుల గెలిచి (సో. రా.)

83. మన్మథరాజును (వ. ప.)

84. రెండువేయిలనూరు (ప. ప.); అరువదెనిమిదియు నట్టి పట్నముం (సి. చ.); రెండువేలనైదునూఱు గ్రామములు (సో. రా.)

85. గంగాతీరంబునకు (ప. ప.) - ఈపాఠము స్పష్టంగా తప్పు.

86. నొద్దె వార్ధవుం? (వ.వ.); పాండ్యరాజులఁగెల్చి (సి. చ.)

87. పంచయామంబుల (ప. ప.)- ఈపాఠము సరికాదు.

88. యెల్లూరు (వ.వ.); ఎలుగూరు (సి. చ.); ఎంగూరు (సో. చ.)

89. 'అట గణపతిరాజు నా పండితేంద్రు కట మన్మదైనట్టి యా మల్లికార్జు నారాధ్యునొద్దను నట దీక్షవడసి' - అని (సి..చ); 'పండితారాధ్యవరునిచే బరమ భక్తి దీక్షగైకొని' - అని (సో. రా.)

89a. బదికొండు గ్రామంబులిచ్చి (సి. చ.); రెండు గ్రా(మ)ము లొసంగి (సో. రా.)

89b. శివాలయంబులు గోపాలనిలయంబులు.

90. గుండాబ్రహ్మయ్య (వ. ప.); ఈ గుండబ్రహ్మయ గారికథ (సి. చ.) లో లేదు.

91. గవినిచెర్లకాడ (ప. ప.); గవనిచర్ల (సో. రా.)

92. మీరు ఎట్టి దండుగునడిగిన నిచ్చెదము (వ. వ.)

93. వీరల సర్వదనంబులు గొని వీరల శూలప్రాప్తులంజేసి. (వ. వ.)

94. కుసుమకోమల కుట్మలంబులయ్యె (వ. వ.)

95. యోజనత్రయ (ప. ప).

96. విచళనగరంబును పురంబు (వ. ప.)

97. ద్రావి గుర్రునదేచినం జూచి (ప. ప;) ద్రావెనటు ఘట్టింగఁజక్కఁగా (దే) నిచి (సి. చ.)

98. హరిహరుల (వ. వ.)

99. ముమ్మక్కయను (ప. వ.); యుమ్మక్కను (సి.చ.); ముమ్మమ్మ (సో. రా.)

100. చాళుక్యతిలకుండగు వీరదేవరాజునకు (వ.ప.); చాళుక్యవంశాబ్ధి చంద్ర దిగంతరాళుండు వీరభద్రయ్యరాజనగ (సి..చ); యిల జుళుకాన్వయ తిలకుడైన వీరమహాదేవవిభుడైన ధరణీవరాత్మజునకు. (సో. రా.)

101. "నానావర్ణమండలి ఖడ్గబిరుదు (ప. ప.); నానావర్ణ వరమండలీవర గండ" (సి. చ; సో. రా.)

102. డెబ్బదియేడేండ్లు (ప.ప.); నలువదెన్నిదియేండ్లు (సి.చ.); ఏబది యెని (మి) ది హాయనంబులు (సో. రా.)

103. అమ్మహారాజు పట్టంపు దేవి వీరపతివ్రత (ప. ప.); 'నతని పట్టంపు దేవియు రుద్రమదేవులు వీరపతివ్రతలు' (సో. రా.)

104. తన (ప.ప.); శివదేవయ్యగారి యనుమతంబుగ (సో.రా.); ఇచట సి. చ. లో కొంత అధిక పాఠము ఉన్నది.

104a. ఇక్కడనుండి సి. చ. లో వచనము. ద్విపదలో ఇచ్చిన కథ కొంత వెనుకనుండి ఆరంభమైనది.

105. రుద్రపరములు (సి. చ; సో. రా.); రుద్రపవరంబులను వేయిపురంబుల నానాదేశంబుల గట్టించుటయు (ప. ప.)

106. నృసింహరాయల పంచ మహావాద్యంబుల (ప. ప.)

107. యాభయి వైయిల వరహాలు (ప. ప.); నేబదిలక్షలమాడల (సి. చ); ఏబది లక్షలు పైడి మాడలోలి బంచిపెట్టె (సో. రా.)

108. ముమ్మక్కకు గర్భ దోహదాదికంబులు (ప.ప.); గర్భాధానాదికంబులు (సో. రా.)

109. ప. ప. లో శాలివాహనవత్సరములు ఇవ్వలేదు; శాలివాహన శక వర్షములు వెయ్యి నెన్నూరునగు నర్వదేండ్లు నామీఁద వర్షముల్నగు నాలునేండ్లు (సి. చ); శాలివాహనశకసంవత్సరములు వేయిని పదమూఁడయి దనరుచున్న (సో. రా.)

110. నందనయగు వత్సరంబు (సి. చ); యానందనామమహాయనంబున (సో. రా.)

111. రుద్రదేవులు (సి. చ); రుద్రమాంబ (సో. రా.)

112. ప్రధానుల సామంతుల (సి. చ; సో రా.)

113. నలుబంద్రను నుండునట్లుగా (సి. చ); గరమొప్ప నలుబంద్ర

నహరహంబు నుండునటులొనర్చి (సో. రా.); ఇచటనుండి సుమారు రెండుపుటల పాఠము, ఏకారణం చేతనో ప. వ. లో కనబడదు.

114. సిరిపురంబని (సి. చ; సో. రా.)

115. నియమించి (ప. ప,)

116. మొన్నటి ఆశ్చర్యంబు (ప. ప.)

117. ఇచటనుండి పదిపంక్తులపాఠము ప. ప. లో కొంత భిన్నంగా ఉంది చూడు అనుబంధం. 8.

118. రెండువెయిల (ప. వ;)

119. ఆడు మండలంబేలు(ప. ప; సి. చ.); ఆడమండలము (సో. రా.)

120. యెనభైనాలుగువేల సువర్ణకమలంబులు (సి. చ.); యెణుబయినాల్గు లక్షల సువర్ణనిష్కంబులు (ప. ప.), పదియు నాల్గువేల పన్ను గొనియె (సో. రా.)

121. కొంప (కె) ణ టం (టెం) కణ (సి. చ; వ. ప; సో. రా.)

122. సౌరాష్ట్రాధీశ్వరుల నోడించి (ప. ప.)

123. పన్నెండు తులాపురుషంబులు (ప. వ; సి. చ.)

124. త్రికూటంబు నగు (వ. ప.)

125. పాఖాలసీమలో నొక్కతటాకంబు గట్టి (ప. ప.)

126. రాజ్యభారంబు (ప. ప.)

127. ముమ్మక్కమహాదేవికి (ప. వ.)

128. విశాలాక్షి లోలాక్షియందు (వ. ప.)

129. ఈ నానావర్ణంబుల సంఖ్యలు, కొన్ని అతిశయమయినవి; అంతేగాక ప. ప, సి. చ, సో. రా లలో ఇచ్చిన సంఖ్యలలో కొన్ని, ఇచట యిచ్చిన సంఖ్యలతో భేదిస్తున్నాయి. ప. ప; సి. చ లలో ఇవి అక్షరాలా ఇవ్వబడినాయి. సో. రా లో కొన్నిసంఖ్యలు పద్యాలలో మిగిలినవి వచనంలో ఇమడ్చబడినాయి.

130. సో. రాలో, ద్వితీయాశ్వాసం సంపూర్ణంగా, కథ ఇక్కడికి ఆగి పోయింది. ఈ రెండు ఆశ్వాసాలు మాత్రమే లభ్యంకావడంచే

రాబోలు, నరేంద్రనాథ సాహిత్యమండలి, తఱుకువారు, వానిని మాత్రమే అచ్చువేయించారు.

131. ఉత్తరదేశంబునకు భాగీరథి యమునలు (ప. ప.); సి. చ. లో ఉత్తరపుమేర ఇవ్వలేదు.

132. యేడో చక్రవర్తియునై పదియేడో రాజునై నేయుచుంటె (ప. ప.); (సి. చ.)

133. ఈ 'పేరా' లో యిచ్చిన ఆయవ్యయాల వివరాలు, ప. వ; సి. చ. లలో కొంత భిన్నంగా ఉన్నాయి. వానిలోని పాఠాలకై చూడు అనుబంధం. 4

134. 'నతండు యేలిన దేశంబులు దైవికంబులుగా అత్యాశ్చర్య కరంబులై' (సి. చ.)

135. ఆ చరితంబులు తొల్లింటి యట్లు వారికై నాచే విన్నదుర్లభంబు (సి. చ.)

136. గున గున నడచుచుండెను (ప. ప.)

137. నటికించియు (సి. చ.)

137a. ఇక్కడ కొంతపాఠం లుప్తమయ్యింది. సి. చ. లోని పాఠానికై చూడు అనుబంధము.5

138. ఇచటనుండి మూడుపేరాలలోని గల విషయానికి, అన్వయక్రమం సరిగాలేదు. కొంతపాఠం లుప్తమయినట్లున్నది. (ప. ప.) లోని పాఠానికై చూడు అనుబంధం. 6. (సి. చ.) లోని పాఠం (ప. ప.) లోని పాఠానికి అత్యంత సన్నిహితంగా ఉంది.

139. కుశతర్పణంబను (ప. ప; సి. చ.)

140. తా వాదభిక్షకు యేతెంచిన వాడనని పలుకుటయు (సి. చ.)

141. వమ్మొపఱచివ (సి. చ.); సమ్మతిపరచిరి (ప. ప.)

142. సప్తశతిచే నద్దేవి నారాధించి (వ. ప.)

143. యేకశిలానగరంబున కేతెంచి తనవారల కెటింగించిన అమవాస కృత్యంబులు వగతేతీర్చి (రి).

144. నా అపరాధంబు (సి. చ; వ. ప.)

145. వరంగంటి విప్రులకు (ప. ప.)

146. ఆనందమాచార్యులు (ప. ప.); అనంతాచార్యులు (సి. చ.)

147. యేకశిలానగరి (నగరంబులో) నాలుగవ భాగంబు (సి. చ; ప. ప.)

148. సంతూరున ప్రవేశించి కల్లతనంబు వుట్టుటంజేసి కల్లూరను గ్రామంబు కట్టి కోటవెట్టుటయు (సి. చ; ప. ప.)

149. వెచ్చించి (సి. చ.); వ్యయించి (ప. ప.)

150. కృష్ణమాచార్యులువిని, పూఅకపోయిన మూర్ఖత్వంబని రాజసముఖంబునకు యేతెంచి, యాభై గ్రామంబుల పదార్థంబున వరుష త్రయంబునకు లెక్కలు వినిపించె. అప్పుడు మూడులక్షల వరహాలు ఆయమనిన, కృష్ణమాచార్యులు (ప. ప; సి. చ.)

151. నిషిద్ధంబని (ప. ప; సి. చ.)

152. అచట నొక పద్యంబు చిత్రంబుగా చదువుటయు (సి. చ; ప. ప.)

153. విప్రజనంబుల మనంబులు నొచ్చునోయని (ప. ప.); (సి. చ.)

154. యాశిబికలు (సి. చ.)

155. మయినపు జిండ్లు (ప. ప.)

155 a. సేత్రంబులు పోయెనని మొరయిడుటయు (ప. ప.)

156. కృతులు (సి. చ.)

157. పగళ (ప. ప.); రగడ (సి. చ.)

158. నిండు (ప. ప.); (ని) లువు (సి. చ.)

159. రేవు (ప. ప; సి. చ.)

160. అద్భుతంబులు (ప. ప.); యాద్యంతరంబులు (సి. చ.)

161. పన్నించి (సి. చ.)

162. యేకామ్రగురుండును రంగనాథుండు మొదలుగాగల శిష్య గణంబులు తన్ను గొలువ (సి. చ.); యేకామ్రనాథుండును రంగనాథుండు మొదలు గాగల శిష్య జనంబులు (ప. ప.)

163. ఇందూరి (ప. ప.); యిందులూరి (సి. చ.)

164. యిట్టి వ్రతంబు పట్టవచ్చునా యని యడిగిన (ప. వ.); యెట్టివ్రతంబు పట్టుచుందువని యడిగిన (సి. చ.)

165. కుడువరాదని (సి. చ.)

166. మూడువెయిలయేనూరు మందిని (ప. ప.)

167. నొక్క యుద్ధవిడి (సి. చ.)

168. నిర్మోఘంబై (సి. చ.)

169. వ్రతంబు చెల్లదు (సి. చ.); వరంబు చెల్లదు (ప. ప.)

170. గొట్టి పత్రియను గ్రామంబు (ప. ప.); 'గొట్టిపర' ను గ్రామంబు (సి. చ.)

171. యిట్లు పారంబుగ వైవికంబగు చరిత్రంబు చెల్లింపుచుండె (సి. చ.)

172. యాజ్ఞకు మరలబడ్డ (బడిన) (సి. చ; ప. ప.)

172a. ఆ పారశిరాజును (ప. ప; సి. చ.)

173. ఏకశిలానగరంబున గిరువు బెట్టుటయు (సి. చ.)

173a. రామదేవరాయలు (ప. వ; సి. చ.)

173b. జవానుములకు (ప. వ;) జమాను మలుకా (సి. చ.)

174. వారిని ఫకీరు వేషంబున పురంబు వెడలించి (సి. చ; ప. వ.)

175. బలంబు లెఱుంగు (సి. చ.)

176. దీనికిముందు 'బపరి దేశాధీశ్వరుండు లక్ష గుఱ్ఱంబులును, మూడు లక్షల పదాతి వర్గంబును' అని సి. చ.

177. మహారాష్ట్రదేశాధీశ్వరుండు లక్ష గుఱ్ఱంబులును, రెండు లక్షల పదాతి వర్గంబును (సి. చ.)

178. రెండు లక్షల పదాతివర్గంబు (సి. చ.)

179. మల్కిశేఖాను (ప. ప.); మల్లిఖనేఖాను (సి. చ.)

180. ముప్పైరెండు లక్షల పదాతివర్గంబు (ప. ప; సి. చ.)

181. మలికినెఖాను/పిలినేఖానుండు (సి. చ.)

182. అన్నమదేవుండు దెబ్బయి యేడుగురుపద్మనాయకులును తలవడిన జవాను మలుకు విరిగి పారుటయు రామచంద్రరాయని తలదునిమిన బలంబులు పారిపోవుటయు (ప. ప); అన్నమదేవుండు నేయు యుద్ధంబున మలికి విరిగి పారుటయు, రామదేవరాయం తలదునిమిన బలంబులు పారిపోవుటయు (సి. చ.)

183. బస (సు) దుఖానుని దళవాయింజేసి (ప. వ; సి. చ.)

184. వడుమర రాచర్లకాడ (ప. వ.)

185. దావంగా చిక్కిన బలంబు తొలంగిపోవుటయు.

186. కటకవల్లభుండును ముకుందసుందరుండును (ప. వ.); కటక వల్లభుండు ముకుంద సుందరుండును వాని (సి. చ.)

187. వుల్లుఖానును (ప. ప.);

188. రాచర్లకాడ. (ప. ప.)

189. గిరవు (వి. చ.)

190. వేలంబు (సి. చ;) బలంబు (ప. ప.)

191. వుల్లుఖానుండు (సి. చ; ప. ప.)

192. అన్నమదేవుండు (ప. ప.)

192a. పాఖాలచెరువు నిండి యెదురుకుమ్మిన (ప. వ.)

193. జవానీములకు (ప. ప.)

194. తీసుట యెగ్గుగాదలంచి (వ. ప; సి. చ.)

195. హితవరులంబో (దో) లి (సి. చ, ప. ప.)

196. బుచ్చారెడ్డి। బబ్బారెడ్డి। బూదారెడ్డి (సి. చ.)

197. జవానీములుకు (ప. ప.); జమానులుఖాను (సి. చ.)

197a. పంపె (సి. చ.); పంపిః ప. వ.)

198. ఇచట "టిప్పుసుల్తాను" అనుట క్షమింపరాని "ముద్రారాక్షసము". వరంగల్లు అచ్చుప్రతి,దానిని "మక్కికిమక్కి" అనుకరించిన వరేంద్ర నాథ సాహిత్యమండలి(తణుకు)వారి అచ్చుప్రతిలోతప్ప,'టిప్పుసుల్తా' నని(ప. వ.)లో గాని(సి.చ.);లో గాని లేదు.(ప. ప.) (సి. చ.)లలో 'సులతాని' అని మాత్రమే ఉన్నది. 'టిప్పుసుల్తా'నే సరిఅయిన పాఠమ యిన,ప్రతాపరుద్రచరిత్ర రచనాకాలమును, అనగా ఏకామ్రనాథుని కాలమున టిప్పుసుల్తాను కాలము (1872-1899) తర్వాత, అనగా పందొమ్మిదవ శతాబ్దానికి తీసుకొనిపోవలసి ఉంటుంది. "ప్రతాపరుద్ర చరిత్ర (తణుకు, 1969) కు 80 పుటల ఉపోద్ఘాతాన్ని వ్రాసి, దాని చారిత్రకతను చర్చించిన శ్రీఖండవల్లి లక్ష్మీరంజనంగారి దృష్టిని

ఈ పెద్దపొరపాటు తప్పించుకొన్నది. ఇచట'పంపె' / 'పంపి' అనే అక్షరాలను, లేఖకుడు 'దెప్పు' అని చదివినట్లున్నది.

199. ఎనుబది నూఱు యేనుగులున్ను (ప. వ.);యెనుభైనూరు యేనుగులు (సి. చ.)

200. యితర జాతి నాయకులు కొంత యుద్ధంబు జేసి సమయుటయు (సి. చ.)

201. కయ్యంబు జేసి (ప. ప.)

201a. కొట్టు పడుటయు (ప. ప.)

202. ప. ప, సి. చ. లలో శాలివాహన శకాన్ని చెప్పలేదు.

203. ప్రతాపరుద్రుని ఆయకంబు చేసికొని (సి. చ.)

204. జమాను ములుకు (ప. ప;) జమానుమలుఖాను (సి. చ.)

205. రాత్రి రాజును పనుపుటయు (ప. ప.)

206. విడిపించిన (సి. చ.)

207. మూడులక్షల (ప. ప; సి. చ.)

208. వేయిన్నేనూరు (ప. ప; సి. చ.)

208a. ఎనుబండ్రుడును (ప. వ.)

209. రాజ సంబంధులు (సి. చ.)

210. నాటకశాలలు యెనిమిదియు (సి. చ.)

211. రజకక్షౌరికులు వేయిన్ని, నకల నియోగంబుల వారు యేడు నూర్లును, రాజుయొక్క ఉత్తమాశ్వాంబులు యేనూరును, గజంబులు యెనిమిది నూర్లును (సి. చ.)

212. తులా పురుషంబునకు (సి. చ.)

213. అందరి స్వస్తి (సి. చ.)

214. లేనయితిరని (సి. చ.)

215. మీ దేశంబునకు అతిత్వరితంబుగ (సి. చ.)

216. కావ్యంబు (ప. ప.); (సి. చ.)

117. అంగశ్శకంబు (ప. వ.)

218. ఆ వుంగరం (సి. చ.)

219. నద్దంబై యున్న (ప. ప; సి. చ.)

220. కటకబల్లహుని గజంబులు గెలువ శక్యంబులు గాకుండుటం జేసి (ప. ప; సి. చ.)

221. బల్లహుని (సి. చ.)

222. ఇర్వది అయిదువేల గుఱ్ఱంబులు సహాయంబు చేసి (ప. ప.)

223. నరపతి రాయలం గల్పుకొని సులతాని దళంబుల చుట్టివేసుకొని ప్రతాపరుద్రుని ముప్పున కొని పోవుట యెరింగి, అరికట్టుకొని యొక్కనాటి రాత్రి (ప. ప; సి. చ.)

224. విద్యానగరంబు (ప. ప; సి. చ.)

225. నరపతిరాయలు. అన్నమదేవునింగారి సముఖంబు (ప. ప; సి. చ.)

226. తమకు పెంపకము ఇవ్వచేసుకొని (ప ప.)

227. మూడు యోజనంబులమేర (సి. చ; ప. ప.)

228. మాటలాడుచున్న (సి. చ.)

229. ఈవిషయం సి. చ. లో లేదు.

230. వారల బోధితుల జేసి (సి. చ.)

231, దెబ్బదియారేండ్లు (ప. ప; సి. చ.)

232. రాజ్యభోగంబుల సహస్రగుణిత భోగంబులు అక్కడనునికి నానందం బనిన (సి. చ.)

233. సులతానియు ననేక విధంబులుగా నాడంబరచి (సి. చ.)

234. ఒక్కనెల రాజ్యంబు పాలించి (ప. ప.)

235. యిరువై వేలు (సి. చ.)

236. తులాపురుషంబులు (సి. చ.)

237. కోటి (సి. చ.)

238. జీవనంబు (ప. ప.); జీవంబు (సి. చ.)

239. యేకశిలానగరంబు ప్రజల రాజసమవు" మనుటయు (సి. చ.)

240. రాజు తన పట్టంవుదేవిని రాణి నివాసంబునంగల కాంతలను కుమారులను బంధువులను ఆహితాగ్నులను రాజకుమారులను వృద్ధవైశ్యం శూద్రులను నానావర్ణంబుల రమ్మని వారుల బుత్తెంచిన (ప. ప.)

241. కోటలు మేడలును గృహంబులు దక్క ఆబాలవృద్ధ గోపాలంబును (ప. ప.)

242. జమూమఖానుని (ప. ప.)

243. నరపతిరాయుల కొమారుల (వ. వ.)

244. రుద్రమదేవిని (ప. వ.)

245. రామదేవరాయలకు (సి. చ.)

246. ముమ్మక్కదేవిని (వ. ప; సి. చ.)

247. రెండుకోట్ల (సి. చ.)

248. తనకూతురు రుద్రమదేవిని (వ. ప.)

249. నరపతిరాయల బిలిచి (సి. చ.)

250. తీర్థంబులాడి దుకూల వస్త్రంబులు దాల్చి (సి. చ.)

251. సి. చ; లో ప. వ. లలో శాలివాహనశకవత్సరం ఇవ్వలేదు.

252. రుధిరోద్గారి నామసంవత్సర మాఘశు ౫ గురువారంనాడు (ప. వ.)

253. వీరభద్రయ్యను (ప. వ; సి. చ.)

254. ఇచటనుండి ప. వ లో ఉన్న భిన్నపాఠానికై చూడు అనుబంధం. 7.

255. బెడదకోట (వ. ప; సి. చ.)

256. ఇటు తర్వాత ప. వ లో ఇచ్చిన పాఠానికై చూడు అనుబంధం. 8.

## అనుబంధం. 1

(చూడు. సూచిక 23.)

అవిప్రులు పుత్రికామేష్టియను క్రతువు గావించుటయు తత్క్రతు ముఖంబున అగ్నిహోత్రునియందు శుభసూచకంబులు గానంబడుటయు అదిగని అట్టి పుత్రుడుదయించునని నిశ్చయించి యా హవిర్భాగంబు మంత్రపూతంగా జేసి సోమదేవరాజు అగ్రమహిషియైన సిరియాలదేవికి కుడువంబెట్టుటయు ఆ ప్రసాదంబు విశేషంబుతోడ సిరియాలదేవి గర్భంబు దాల్చుటయు సోమదేవరాజు ప్రమోదచిత్తుండై యావిప్రులకు అపార ధనకనక వస్తువాహనంబులు సమర్పించుటయు, అంత విధ్యుక్తప్రకారంబుగా గర్భధారణాదికంబులు క్రమక్రమంబున జేయుచున్న సమయంబున తద్వృత్తాంతంబంతయు కటకవల్లభుడు చారులచేవిని యదరిపతి విప్రకృతంబు వృథాకాదని తల్లడిల్లి తన బంధుజనుల సమర్థులం దొరల రావించి వారలతో కార్యంబూహించి పత్నీయుక్తంబుగా సోమదేవరాజును జంపుటకునై యరువైనాలుగువేల మదగజంబులును పన్నెండులక్షల పదాతివర్గంబులును లక్ష గుఱ్ఱంబులును గూర్చుకొని కందారంబుపై విడియుటయు, అంత సోమదేవరాజు కటకవల్లభునితో మహాయుద్ధంబు చేసి మాసద్వయంబున గజయుద్ధంబున గజపతిచే సోమదేవరాజు మడియుటయు,

ప. ప. 1917, పు. 339.

## అనుబంధము. 2

(చూడు సూచిక. 81)

అంత నెల్లూరు నుండి తిక్కనసోమయాజులు ఏతెంచిన అతని ఎదుర్కొని గణపతి మహారాజు వినయంబుగ భయభక్తిని అతిథిపూజ గావించి యతనిచే మహావేదార్థవ్యాఖ్యాన ద్వైతాద్వైతంబులగు జీవచిద్వివేక లక్షణంబులును ధర్మాధర్మంబులును రాజనీతి ప్రకారంబులును భారతవీరుల ప్రసాదం (ప్రతాపం) బును ఆదిగాగల అర్థంబులును వినుచునంత హనుమకొండ నివాసులగు బౌద్ధవు (బౌద్ధు) ల రావించి వారలు తిక్కనసోమయాజుల వాక్యశక్తికి మెచ్చి యాతని బహుప్రకారంబుల పూజించి యేపిమిది గ్రామంబులు నొసంగి యతడు వచ్చిన

కార్యం౦డిగెన త్రిక్కూన సోమయాజులు ఆయూపాలునితో న్నిన్నిరి. సూర్య వంశజుండగు మన్మథసిద్ధరాజు నెల్లూరు ఏలుచుండగాను అతని దాయాదులు అక్క భీమన్న నతని బంధించి రాజ్యంబు యేలుచున్నవారు. మీరు అక్కడికి విజయంబుచేసి మన్మథసిద్ధరాజును పునరభిషిక్తుని జేయవలయు ననుటయు గణపతిరాజు అట్లకాకయని ఒడంబడిన అతనికి లక్షద్రవ్యంబు యజ్ఞంబునకు ఇచ్చి యజ్ఞకుండలంబులు చేయించి అనుపుటయు.

ప. వ. 1918. పు. 139

అనుబంధం. 3

(చూడు సూచిక 117)

ఆ ప్రతాపవీర రుద్రుండు పద్మనాయకులను భట్లు శివదేవరాజు మల్లికార్జున రాజు వీరదేవరాజు విశ్వదేవరాజు మొదలైన భట్లు రాజులు పిలిపించి వారికి వీరికి సమాన బహుమానాలు ప్రమాణోక్తిగా పంక్తిని గూర్చుండే నిర్ణయం చేసి అదివరకు ఇచ్చిన భాగములో మీకు సగము భాగము అని యిచ్చి అప్పుడు శ్రీ మత్ప్రతాపవీర రుద్రుండును భట్లు రాజులును పద్మనాయంకులును ఒక్క పంక్తి గూర్చుండి భోజనంబులు చేసి బహుమానించి అందుకు నాయకత్వంబునకు అర్హులుగా ఏర్పరచి ఒక్కొక్క కొత్తడంబునకు ఒక్కొక్కరిని సర్వ లక్షణ సంపన్నునిగా ఏర్పరిచి వారలకు ధనకనక వస్తు వాహనాందోళికలును నీని చీనాంబ రంబు లొసంగి మరియు ఛత్రచామరంబులును ఆలపత్రంబులును సాహసకృత్యంబు లకు బిరుదు లొసంగి డెబ్బదియేడు గోత్రంబుల డెబ్బది యేడుగురను ఇట్లు బహుమానంబుజేసి వారలకు ఏకశిలానగరంబునకు శిలాప్రాకారంబు వారలకు డెబ్బదియేడు కొత్తడంబు లుండుటంజేసి వారి బంధువులను పద్మనాయకులంజేసి పుట్టకోట కొత్తడంబుల నుండంజేసి మరియు డెబ్బది యేడుగురు నాయకులకును తమరాజ్యంబులో ఒక్కభాగము పంచియిచ్చి ఒక్కభాగంబు బంధువులకును, ఒక్కభాగంబు తమ మూలబలంబులకును ఒసంగి ఒక్కభాగంబు విప్రులకొసగి తనవంశంబైన తనరాజ్యంబు తనభండారంబునకు చెల్లంజేసి.

ప. ప. 1918 పు. 287 288

## అనుబంధం 4

(చూడు సూచిక 133)

అందుల అప్పనంబుల ఇచ్చు దేశంబులు, కటకవల్లభుండు లోనుగాగల చిల్లరరాజులు ప్రతివర్షంబును ఇచ్చు అప్పనంబులు ఇరివయి నాల్గుకోట్లు, తన భూమిపాలితంబైన రాజ్యంబువలన వచ్చుధనంబు ఇరవైయికోట్లు. ఇవిగాక అగ్రహారంబులు బ్రాహ్మణులకు చెల్లుచుండె నాల్గువెయిలు, దేవతా వైభవంబులకు రెండువెయిల గ్రామంబులు చెల్లుచుండె. ఇదిగాక తనభండారంబునకు వచ్చుచుండు నాలుగుకోట్లు.

ప్రతివర్షంబు తులాపురుషంబులకు మూడుకోట్ల యేబయిలక్షలు. నిత్యవైభవంబునకు పరిమళగంధకర్పూర కాశ్మీర, జవాజి, పరిమళంబులకు, పంక్తిభోజనంబులకును నగరి దీపాలకును నానాదేశంబుల నుండి వచ్చువిద్యార్థులకును పంచిపెట్టిన ద్రవ్యంబు ప్రతివర్షంబును మూడుకోట్ల అరువయిలక్షల యిరువయి వేయిలు. నగరుగాచు నిశ్శంక వల్లభునకు జీతము ప్రతివర్షమును భటసహితంబుగా ఎనుబయియెనిమిదిలక్షల యిరువయివేలు. అన్నసత్రంబుల గణుతి ఒక్కొక్క సత్రంబునకు వేయింటికి చొప్పున నూరు సత్రంబులు ద్విజులకు ఏడాదికి ఒక్క కోటి ముప్పయిలక్షలు. నగరి మొగసాల గొల్చు నవలక్ష ధనుర్ధరులకు ఏడాదికి మూడుకోట్ల యెనుభయిలక్షలు. రాజ మదగజంబులకును ఉత్తమాశ్వంబులకును జీతంబులవారికి రెండుకోట్ల యెనుబయిలక్షలు. ఏకశిలానగరంబునంగల దేవతా వైభవంబునకు ఒక్కకోటి. రాజగృహంబులు కట్టేపనులవారికి ప్రతివర్షంబున ఒక్కకోటియు వారణాసి విశ్వేశ్వరునకు శ్రీశైలమల్లికార్జునునకు శ్రీకాళహస్తీశ్వరునకు రామేశ్వరం రామేశ్వరునకు నాసికత్ర్యంబకేశ్వరునకు అరుణాచలేశ్వరునకు కొలనుపాక సోమేశ్వరునకు ఏకవీరేశ్వరునకు వేములవాడ రాజేశ్వరునకు కాళేశ్వర ముక్తీశ్వరునకు గోకర్ణేశ్వరునకు వీరుమొదలయిన యీశ్వరస్థానంబులకు శ్రీరంగనాయకులు కంచి వరదరాజు శ్రీ వెంకటేశ్వరులు మంగళగిరి నృసింహస్వామి సింహాచలము ఆదివరాహమూర్తి శ్రీ కూర్మనాయకులు శ్రీజగన్నాయకులు భద్రాచలము శ్రీరాములకును దివ్యమూర్తులకును ప్రతివర్షంబు మూడుకోట్లు. తనభండారమునకు మూడుకోట్లు చెల్లుచుండె.

ప. ప, 1918 వు. 293-294 a

అందుల అప్పనంబులు యిచ్చు దేశంబులు; కటకపల్లభుండు లోనుగాగల చిల్లర రాజులు ప్రతివరుషంబు యిచ్చు అప్పనంబులు యిరువైనాల్గుకోట్లు,తన నిజ భుజపాలింబైన రాజ్యంబు వలన వచ్చు రోజు ధనంబు యిరువై కోట్లు. యిదిగాక అగ్రహారంబులు బ్రాహ్మణులకు చెల్లుచుండె. దేవతా వైభవంబులకు రెండువేల గ్రామంబులు చెల్లుచుండె. యిదిగాక తన భండారంబునకు వచ్చు నలభైనాలుగు కోట్లకు ప్రతివరుషంబునకు వ్రయంబు: నిత్య వైభవంబునకు గంధ కర్పూర కాశ్మీర జవాది పరిమళ (ద్రవ్యం) బులకు పంక్తి భోజనంబులకు, నగరిదీపాల వెలుంగులకున్ను నానా దేశంబుల నుండి వచ్చు విద్యార్థులకు పంచిపెట్టేు (ది) ప్రతి వరుషంబును మూడుకోట్ల అరువైలక్షలు, పురంబుగాచు నిశ్శంకవల్లభుని జీతంబు భట సహితంబుగా ప్రతివరుషంబును యెనభైయెనిమిది లక్షల యిరువై వేలు, అన్న సత్రంబు లెక్క వొక్కొక్క సత్రంబునకు వెయ్యేసి చొప్పున నూరు సత్రంబులు, ద్విజులకు యేడాదికి వొక్కకోటి ముప్పైలక్షలు, నగరిమొగసాల గొలుచు నవలక్ష ధనుర్ధరులకు యేడాదికి మూడుకోట్ల యెనభైలక్షలు రాజు మద గజంబులకు వుత్తమాశ్వంబులకై జీతంబుల వారికి రెండు కోట్ల యాభైలక్షలు, యేకశిలా నగరంబునగల దేవతా వైభవంబులకు వొక్కటియు, నగరిలో రాజ గృహంబుల గట్టు పనివారికి ప్రతివరుషంబు నొక్కటియు వారణాసి విశ్వేశ్వరు నకు, శ్రీశైలమల్లికార్జునునకు, శ్రీ వెంకటేశ్వరునకు, శ్రీ రంగనాయకులకున్ను, ఏకామ్రేశ్వరునకు, రామేశ్వరునకు, గోకర్ణేశ్వరునకు మొదలుకొని దివ్య దేశనివాస మూర్తులకు వర్షంబునకు మూడుకోట్లు తన భండారంబున రెండుకోట్లు చెల్లుచుండె.

సి. చ. పు. 154-155

అనుబంధం. 5

(చూడు సూచిక. 137ఇ)

అంత నొక్కనాడు మాసశివరాత్రి యగుటయు, యా ప్రతాపరుద్రుండును శివదేవయ్య (యు) నుపవసించి స్నానాది కృత్యంబులం దీర్చి, శంభులింగంబు నగరికింజని, యద్దేవునిం జూచి యచట జాగరణంబు సేయుచున్న సమయంబున, శివదేవయ్య సుగంధంబైన త్రేన్పు గట్టున త్రేన్చినం జూచి ప్రతాపరుద్రుం డాశ్చర్య చిత్తుండై "మహాత్మ, మాతోడనే వుపవసించితివి. ఈవేగి నంతయు

నేమియు గుడుచుట లేదు సుగంధంబైన త్రేన్పు త్రేన్చితివి కారణంబేమి?" యనియడుగుటయు శివదేవుండును ప్రతాపరుద్రున కిట్లనియె "...యందు వసియించిన ఆరగించితి" ననిన ఆశ్చర్యపడి నగరికిం జని విశాలాక్షి దేవిని అడ్గిన, తానును సువర్ణప్రతిమను జేయించి శివదేవయ్య యని నైవేద్యంబు...సమర్పించితి ననిన, రాజు ఆశ్చర్య పడి శివదేవయ్య గారి మహాత్మ్యంబు గొనియాడి, యిటు మహామహుండైన శివదేవయ్య గురుండును, సఖుండును, మంత్రియునై తనకు మహామహిమ చేకూర్చుచుండె.

సి. చ. పు. 156-157లు

## అనుబంధం. 6

(చూడు సూచిక. 138)

అంతనొకనాడు శ్రీమత్ప్రాపవీరరుద్రుండు కొలువై కూర్చున్న సమయంబున ప్రసంగవచనంబుల జ్యోతిషంబు తనసొమ్మని పాంచాలము వారు వాదించి యిందుకు పరీక్ష యిచ్చెదమని పాతోజు కన్నయ్య యనువాడు ఒక ముహూర్తంబున పాషాణంబుపై లోహనలోకాదిగా మొత్తించుటయు శ్రీమత్ప్రాపవీరరుద్రుండు అతనిమెచ్చి ఒక్క గ్రామంబు శూకాశనంబుగా నడుపంజేసె. అదిగని హనుమకొండ రుద్రేశ్వరునగు అర్చకుండైన రుద్రజియ్య యను శివబ్రాహ్మణుండు ఏతెంచి రాజసన్నిధిని నిలచి యిట్లనియె. పరీక్షజూపి నంతనే పాంచాళభక్తులకు జ్యోతిషంబు రానేర్చునే? తపదని వ్యతీపాతకాలంబు న జిల్లేడుకొమ్మ విరచిన రక్తంబు గారుటయు అదిగని రాజు సంతోషించి ఒక్క గ్రామంబును పల్లకీ కృపచేసి యనిపిన, ఆ వార్త భూసురులెరింగి కటకటా యితరజాతుల ప్రజ్ఞలు మెచ్చి నిగ్రహానుగ్రహ సమర్థులైన విప్రజనంబుల మహాత్మ్యంబులు ఎఱుంగరాదయ్యె అని రాజు సమ్ముఖంబున కేతెంచి యిట్లనిరి. జ్యోతిషంబు వేదాంగంబగుట సీవెరుగుదువు. వేదవేదాంగంబులు విప్రులకెకాని యితరజాతులకు ఎట్లు సిద్ధించును. పరీక్షజూపినది నిజంబుగాదు. ఆవవేళ యెరింగి యీధేనువు క్షీరంబు పిదుకుదురేని జ్యోతిషంబు వారి సొమ్మనిన ఒక్క గొడ్డుటావును జూపుటయు, అదిగని మునుపు పరీష యిచ్చినవారు తొలంగిపోయి

నంజూచి విప్రజనములలో వెలకత్తూరిసోమయ యనువారు వీతెంచి ఆముహూర్తము వేళ యెరింగి ఆగొడ్డుటావును పితికితేను కుంచెడుపాలు కురియుటయు, అదిచూచి యా శ్రీమత్ప్రతాపవీరరుద్రుండు అత్యంత యుత్సుయుండై యావిప్రుండు గోరినట్టు గోదావరీతీరమున కుశతర్పణంబను అగ్రహారంబు నొసంగుటయు.

ప.ప, 1918, పు. 296.

## అనుబంధం. 7

(చూడు సూచిక 225)

వీరరుద్రయ్య పట్టాభిషిక్తుండై రాజ్యంబు సేయు సమయంబున, అక్కడ ఢిల్లీ సుల్తాను రాజ దేవేంద్రుండు శ్రీ మత్ప్రతాప వీరరుద్ర మహారాజు శివ లోకంబున కేగుట విని పరమాత్ముండగు పరంధాముండగు నారాయణు నారాధించ సుల్తాను దివ్యలోకంబునకు జనుటయు వుల్లుఖానుండు సిద్ధిఖానుండు మడియుటయు తమ దేశంబులు దోచుట యింత ప్రయోజనంబు జేసినవారు ఎవ్వరు అనిన నరపతి రాయులు ఇంతచేసె రాయని సుల్తాను కొమారుండు రౌద్రాకారుండై ప్రయాణభేరి వేయించి మూడులక్షల గుర్రంబులును పదిలక్షల పదాతి వర్గంబులు గూర్చుకొని విజయనగరంబుపై చనుదెంచు నప్పుడు వీర భద్రయ్య సుల్తాని వారి వశంబున కొంచెంబుగా రాజ్యంబు లోను జేసుకొని యేలుల రానివ్వక ఆవంకృష్ణ మేరగా రానివ్వక కడ్డు గాంచి ముప్పది లక్షల పదాతి వర్గంబుతో సుల్తాను వారి బలంబులతో యుద్ధంబు సేయుచు గటనముల గట్టి గవణంబు రానివ్వక యిట్లు పెక్కు భంగుల చికాకు సేయుచు పన్నెండు వరుషంబులు పోరి సుల్తానియు విరుదిపియక అచట బెడదకోటయను పురంబు గావించుకొని యుండె. క్రమక్రమంబున కొంచెంబు నరపతి రాయులతో పోరాడం జాలక తన భూములు తనకు లోనుగాక మరలబడుట విని ఢిల్లీకిపోక నరపతి రాయలతో సంధి చేసుకొని ఆ నరపతి రాయులకు అప్పనంబులు ఇచ్చె. ఇట్లు తన యేకశిలానగరంబు ఢిల్లీ సుల్తాను తన యాజ్ఞకు లోను చేసుకొని దేవాలయంబులు పడగొట్టించి బహువిధంబుల బాధ పెట్టుటయు వీరభద్రుండు సహింప జాలక, తన బలంబు గూర్చుకొని సుల్తాను వారి భృత్యులనందరిం దునిమి తానును

పురంబునం గల జనులు ఏకమై పురంబు వెడలి కొండమీద నున్న రాయులం గలసి యుండుటయును.

ప. వ, సంపుటం. 18, పు. 311

## అనుబంధం. 8

(చూడు సూచిక 256)

(ఆనందనామ సం॥ ర జ్యేష్ఠ శు. 14 రోజున ఆదివారం సాయంత్రం వరకు సంపూర్ణం చేసినది. తిరుపతి రాజు.)

ఈ పుణ్య కథలు వినుండి. యిరువదేను కథలు గలిగిన క్రమంబును కాకిత రాజుల వెలయం జేప్పెద. తొమ్మిది నూట తోంబయి వరుషంబులు పృథివి పాలించి నకలైశ్వర్య సిద్ధికరంబై విలసిల్లుచుండు మొదటి హంశ కందారంబు నుండి సోమదేవరాజు యేలు చుండంగాను కటకవల్లభుండు వచ్చి యుద్ధంబు చేసి వానిచే మృతి నొంచెన వెనుక సోమదేవరాజు పట్టంపు దేవి పారి వచ్చి హన్మకొండ లోను కుమారుని గాంచెను. ఆ మాధవవర్మ యను రాజు పద్మాక్షీదేవి వరప్రసాదంబున ఏకచక్రంబుగా రాజ్యం బేలించిన వారి సాంప్రదాయకులు శ్రీమత్ప్రతాప వీరరుద్రుని పర్యంతం వరంగంటిని గట్టి పెక్కు సాహసంబులు చేసి వెయ్యేండ్లు రాజ్యంబేలిన రాజుల వెలయం జెప్పెద వినుడీ.

| | |
|---|---|
| మాధవరాజు మొదలు | 175 |
| పద్మసేన రాజు ద్వితీయం | 80 |
| వెంన్నమరాజు తృతీయం | 72 |
| గుండమరాజు చతుర్థం | 75 |
| కుంతల దేవి పంచమం | 9 |
| యెర్కుదేవరాజు షష్ఠమం | 76 |
| భువనేకమల్లుడు సప్తమం | 76 |
| త్రిభువనేక మల్లుడు అష్టమం | 74 |
| కాకితపోల్రాజు నవమం | 72 |
| రుద్రమరాజు దశమం | 74 |

| | |
|---|---|
| మహాదేవరాజు ఏకాదశం | 3 |
| గణపతిరాజు ద్వాదశం | 77 |
| రుద్రమ దేవులు త్రయోదశం | 38 |
| అన్నమదేవుడు చతుర్దశం | 12 |
| శ్రీ మత్ప్రతాప వీరరుద్ర మహారాజు | |
| పంచాదశంబుల పదిహేనుగురు | 76 |
| | 999 |

230 సోమదేవ రాజుల వరకు శాలివాహన శక వర్షాణాలు 1000. సోమదేవరాజు వద్దనుంచి శ్రీ మత్ప్రతాప వీరరుద్రుని పర్యంతం రుధిరోద్గారి నామ సం॥ మాఘ శు. 5 గురువారము ప్రతాపరుద్రుడు కైలాసం సంప్రాప్తి ఆయెను. 295. సింహభద్రుని సమేత రాయుల వారు చేసినది. 234 అక్కన్న మాదన్న గారు హేమ శంబి సం॥ వరకు రక్తాక్షి సం॥ లో అక్కన మాదన్న గారు ముక్తిం బొందినది. సం॥ 1085 సాలు 1759. యిదిలెక్క చేసినది. రఘల్లీ వెంకన్న గారు జగదేరావు పంతులు గారు చేసినది వట్నములోను.

## అనుబంధం. 9

ప్రతాపరుద్ర చరిత్రము (వరంగల్, 1930) చివర ఇచ్చిన అనుబంధము.

(మ. రా. బొల్లం నాగలింగం గారు మా కార్యాలయమునకు ప్రతాపరుద్ర చరిత్ర నొకటి పంపి యుండిరి. దాని యందలి విశేషము లిందు బొందు పరుచు చున్నారము).

### ప్రతాపరుద్ర చరిత్రము

(ద్వితీయ ప్రతియందు గల విశేషములు)

(రుద్రుని పరిపాలన మందు)

ద్వాదశయోజన విస్తీర్ణంబుగాగల యోరుగల్లు పట్టణంబునకు మున్నూట యరువది సోమ సూర్యాద్యాలయములు మూడువేల శివాలయములు, మున్నూరు విష్ణ్వాలయములు కట్టించెను. మరియుం గంచుకోట యిటికకోట రాతికోట వుట్ట కోట భూమికోట కంపకోట గవిని కోటయను యేడుకోటల నిర్మించెను.

నేరేటి కంచుకోటలో రుద్రమహారాజ గృహంబులును నిటిక కోటలోపలం గల స వేదిలింగంబును, దానికి నైఋతి దిగ్భాగంబున విరూపాక్ష రాజులును, యెరుకుకోయ రాజులు పశ్చిమ భాగంబున, దేవరాజు గారు ఉత్తర భాగంబున పక్కన రాజ గృహంబులు దూర్పుభాగంబున, స్నాన సంధ్యా ద్యనుష్ఠాన జప పరాయణులై యగ్నిహోత్ర నిత్య కర్మానుష్ఠానాధ్యయన పరాయణులై యున్న బ్రాహ్మణోత్తముల గృహంబులు రాతి కోటలోపల, వైశ్యగణ సమూహ గృహంబులు భూమి కోటలోపలం, దక్కిన యష్టాదశ కులంబుల వారు మట్టికోటలోపల నివసించి యుందురు.

సకల సుఖములు పాడిపంటలు ధన ధాన్య సమృద్ధియు మరకత మాణిక్య గోమేధిక పుష్యరాగ వజ్ర వైడూర్యంబులు మహదైశ్వర్యంబులు గలిగి సప్త రాజులచేత పాలింపుచుండ సువర్ణవర్షంబు యేడు గడియలు కురిసెను. సకలసేనా పరివార సహితుండై రుద్రుండు జాగరూకుండై చతుస్సముద్ర పర్యంతరంబు రాజ్యంబు పాలింపుచుండె.

ఆ సమయంబున విరూపాక్షరాజు యెరుకు కోయరాజులు దేవరాజులును మొదలయిన రాజులలో నాల్గుదిక్కులం నల్గురు రాజులును బంపించి రాజ్యపరిపాలన మాజ్ఞాపించి తాను సింహాసనస్థుండై సుఖంబున నేలుచుండె.

విరూపాక్షరాజులు మొదలగు నల్గురు రాజులు తటాకంబులును వనంబులను దుర్గంబులును ననేక దేవాలయంబులును నిర్మించి యనేక బ్రాహ్మణాగ్రహార వృత్తి క్షేత్రంబులు గల్పించి సమస్తదేశముల రాజుల వద్ద యవ్వనములం బుచ్చు కొనుచు రాజ పరిపాలన చేయుచుండిరి.

రుద్రుండు తమ ప్రధాన వర్గంబులకు గంధర్వులు - గజదేవ - మధవన దేవ - సోమదేవ - బొమ్మదేవ - సూర్యదేవ - రామిదేవ - మంచనదేవ-విశ్వంభర దేవ - ఆ[illegible]యదేవ - కాంచనదేవ - రాజదేవ - మంత్రులలో రాజ్యంబు నేయుచు పితృహత్యా దోష - ప్రధాన వర్గంబును బిలిపించి పితృహత్యా దోషంబు పరిహరణార్థంబుపాయం బడిగిన, వారు పన్నిద్దరు ప్రధానులు విచారించి మహాతపో గరిష్ఠుండై శ్రీవత్సగోత్రోద్భవుండయిన శివదేవయ్య గారి యను

గ్రహపాత్రుడవై వారిని బూజింపు చున్న తొలంగుననియాతని ప్రభావంబు రుద్రునకుఁ జెప్పిరి.

అప్పుడు రుద్రుండు దేవగురు రాయ! అని స్తుతిచేసి శివదేవయ్యగారి పాద పద్మంబుల కౌఁగిగి నా పితృ హత్యా దోషంబును నివారించుమని, వారి వలన మహదనుగ్రహపాత్రుండై భస్మ రుద్రాక్షల మహిమంబు దెలిసికొని త్రికాలముల యందుఁ బరుసవేది శంభులింగస్వామిని, నభిషేక భస్మ గంధాక్షత ధూపదీప నైవేద్య తాంబులంబులతోడను నృత్యగీతవాద్య భేరమృదంగాది నాట్యంబుల ఝుంకారంబుల తోడను పూజ గావించుచుండెను.

అప్పుడష్టాదశ వర్ణంబుల వారు రుద్రుని దోషము పోలేదని యనుకొనఁగా నా మాటలు రాజువిని తనకు దోషవారణ దృష్టాంతము చూపించ వలెనని శివ దేవయ్యగారికి నమస్కారంబు చేసి యడిగెను.

అప్పుడు వారు తారకోపదేశ స్థలమును నానంద కాననమును రుద్రావానంబును మహాశ్మశానంబువకు కాశియనే పట్టణంబున గంగాస్నానము జేసికొనుచు విశ్వేశ్వరుని విశాలాక్షిని యన్నపూర్ణను భైరవగణ పతులను సేవించుకొనుచు త్రిలోక గురుగురుమూర్తియై, మహాతపో గరిష్ఠుండైన యుద్ధభటుని వంశస్థులున్న వారలు, దోష నివారణమునకును, నిదర్శనము జూపించుటకును, సమర్థులని శివదేవయ్య రాజులకుఁ జెప్పెను.

అప్పుడు రాజులందఱు వారిచ్చటికి వచ్చు సదుపాయంబు చేయుమని శివదేవయ్యగారితోఁ జెప్పిరి. అప్పుడు శివదేవయ్యగారు కాశీ పట్టణంబునకుఁ బోయి మల్లనారాధ్యుల వారిని ఓరుగల్లు పట్టణమునకుఁ దీసికొని వచ్చిరి.

అప్పుడు శివదేవయ్య గారు రుద్రుఁడు మొదలయిన రాజులతోఁ జతురంగ బలాదులతోఁ గూడ మల్లనారాధ్యుల వారికి నెదురుగాఁ బోయి నమస్కారము చేసి వారిని శంభులింగస్వామి వద్దికిఁ దీసికొని వచ్చిరి.

అనంతరము శివదేవయ్యగారు మల్లనారాధ్యులకు రుద్రుని పితృ దోష నివారణార్థము శంభులింగస్వామిని పలికించుమని యనిరి. అంత మల్లనారాధ్యుల

వారు శంభులింగ స్వామిని రుద్రుని దోషము పోయెనని యేడు ఘడియలు ప్రణవ స్వరము చేత పలికించెను.

అప్పుడు శివదేవయ్య గాగు దప్ప సమస్త రాజులు అష్టాదశ వర్ణముల వారును చతురంగ బలాదుల సమేతముగ మూర్ఛచెందిరి. అంత శివదేవయ్య గారు మల్లనారాధ్యులతో మునుపు పలికిన పలుకు శంభులింగస్వామిని నాజ్ఞాపించుమని యనిరి. అప్పుడు మల్లనారాధ్యులు పరుసవేది లింగమును జూడగనే శబ్ద మణిగెను. అందఱు మేల్కొనిరి.

అప్పుడు రుద్రుడు విరూపాక్షరాజు మొదలయిన రాజులు మల్లనారాధ్యుల వారికి నమస్కారంబులు చేసి-యనేక మహాదానంబు లిచ్చి - గురుమూర్తులయిన శివదేవయ్య గారి కుమార్తెను మల్లనారాధ్యుల వారికి వివాహంబు గావించిరి. మఱియు వారికి ముదిగొండ తాలూకా యేడు గ్రామంబు లగ్రహారంబులుగ నిచ్చి వారిని ముదిగొండ ప్రవేశించ బెట్టిరి.

ముదిగొండ దగ్గఱ మల్లనారాధ్యుల వారి శిష్యుడు మనుమన్న యనేరాజు వెలుగూరనే గ్రామమున కిల్లాకట్టించి తటాకములు నిర్మించెను. కోనేళ్లు త్రవ్వించెను. వనంబులు వేయించెను. మల్లనారాధ్యుల వారిని బోషించుచు పూజించుచుండెను. ఈ మనుమన్నయనే రాజు విజయనగరమునకు దూర్పు భాగమున మరొక్క కిల్లా గట్టించెను.

ఇక్కడ శివదేవయ్య గారికిని రుద్రుడు రాజులు సమస్త ప్రధాన వర్గములును సమస్త రాజ్యభారములును జరుపుచుండుమని వచించి యగ్రహారము లిచ్చి వారిచేత నాశీర్వచనములు పుచ్చుకొనుచుండిరి.

(వీరప్రతాపరుద్రుని పరిపాలనమందు)

పాలకుర్తి సోమనారాధ్యుల వారు బసవ పురాణాది గ్రంథముల రచింపగా బ్రాహ్మణులుకొందఱురాజుదగ్గరకేగి సోమనారాధ్యులు వేదాధ్యయనముల శూద్రుల పాలుచేసెననిరి. అంత ప్రతాపరుద్రుడు సోమనారాధ్యుల బ్రాహ్మణోత్తములను విమర్శనచేసుకొనుమని వచించెను.సోమనారాధ్యులవారు యాయూరిలో త్రోతయ్య యనే రజకుని బిలిపించి వానికి భస్మ రుద్రాక్షలు పంచాక్షరి యుపదేశము

సూర్యమంత్రిచేతఁజేయించగానే నాతఁడు తనపేరు మడివాలయ్య యని పెట్టుకొని తత్ప్రభావమున సకల విద్యాసంపత్తిగలిగి యా పన్నెండు వేల బ్రాహ్మణులతో గూడ వాదించుచున్నానని వేదశాస్త్ర పురాణ సూక్తుల చేత బ్రాహ్మణోత్తములతో శివుఁడే యధికుఁడని వాదించెను, అప్పుడు బ్రాహ్మణులందఱు నోడి రుద్రుని తోటి మనయూర పుట్టిన చాకలి వానిచే నోడి లజ్జపడితిమని చెప్పిరి.

ఎటులయినను నిఁక సోమనారాధ్యుల వారిని నోడించుదుమని తలఁచి నాబ్రాహ్మణులు రుద్రునితో సోమనారాధ్యుల దర్శనము చేయవలసినదనియు, నాతఁడు భవి ముఖము చూడని వాఁడగుటచే పరుసవేది లింగమూర్తిని కౌగలించు కొని యుండుఁడనియు-దర్శనమయ్యేటప్పుడు మాత్రము చేతులు వదులుఁడనియు జెప్పిరి.

అటులే దర్శనమయ్యేటప్పుడు చేతులువదలవలెనని రుద్రుఁడుప్రయత్నము చేయఁగా జేతులు వదిలి రాకపోయెను. అప్పుడు సోమనారాధ్యులవారు కపటమును గుర్తెరింగి ఓరుగల్లు వదలి దండకారణ్యమునఁ గోటికాంధ్ర భూములలో నుండు మని శాపఁబెట్టిరి,

సోమనారాధ్యులవారా పన్నెండువేల బ్రాహ్మణులను మడివాలయ్యగారివద్ద భస్మరుద్రాక్ష పంచాక్షరి మంత్రోపదేశమును గమ్మని శాపంబిచ్చిరి. మడివాలయ్య గారికి నిట్టి ప్రజ్ఞగలుగుటకుఁ గారణము సోమనారాధ్యుల వారి. యనుగ్రహము తప్ప వేరుకాదు.

సోమనారాధ్యులంత ప్రతాపరుద్రునిచే బహుమానముగా నివ్వఁబడిన పాలకుర్తిని ప్రవేశించెను,

ం ం ం

## అనుబంధం-10

### కాకతీయరాజుల అనుక్రమణిక - పరిపాలనా కాలాలు

| A | | | B | | |
|---|---|---|---|---|---|
| వరుస సంఖ్య | ప్రతాపరుద్రచరిత్రను అనుసరించి | | వరుస సంఖ్య | శాసనాలను అనుసరించి* | క్రీ.శ. |
| 1 | మాధవవర్మ | శా.శ. 291-411<br>క్రీ.శ. 369-489 | 1 | వెన్న (వంశ స్థాపకుడు) | |
| 2 | పద్మసేన | శా.శ. 411-489<br>క్రీ.శ. 489-567 | 2 | మొదటి గుండడు | |
| 3 | వెన్నమ | శా.శ. 489-572<br>క్రీ.శ. 567-650 | 3 | రెండవ గుండడు | |
| 4 | పొరికి వెన్నమ | శా.శ. 572-648<br>క్రీ.శ. 650-726 | 4 | మూడవ గుండడు<br>(క్రీ.శ.900 లకు కొంత ముందు చనిపోయాడు) | |
| | | | 5 | ఎఱ్ఱ | |
| | | | 6 | బేతియ | |
| 5 | గుండపరాజు | శా.శ. 648-718<br>క్రీ.శ. 726-796 | 7 | నాల్గవ గుండడు 955-995 | |
| 6 | ఎరుకదేవ<br>[కుంతలి<br>శా.శ. 718-727] | శా.శ. 718-792<br>క్రీ.శ. 796-870 | 8 | మొదటి బేతడు<br>లేక<br>గరుడ బేతడు | 996-1051 |

| | A | | | B | |
|---|---|---|---|---|---|
| 7 | భువనైకమల్లు | శా.శ. 792-818<br>క్రీ.శ. 870-896 | 9 | మొదటి ప్రోలుడు | 1052-1076 |
| 8 | త్రిభువనమల్ల | శా.శ. 818-892<br>క్రీ.శ. 896-970 | 10 | రెండవబేత త్రిభువనమల్లుడు | 1076-1108 |
| | | | 11 | త్రిభువనమల్ల దుర్గరాజు | 1108-1116 |
| 9 | ప్రోలుడు | శా.శ. 892-964<br>క్రీ.శ. 970-1042 | 12 | రెండవప్రోలుడు | 1116-1157 |
| 10 | రుద్రుడు | శా.శ. 964-1052<br>క్రీ.శ. 1042-1130 | 13 | రుద్రుడు | 1158-1195 |
| 11 | మహాదేవుడు | శా.శ. 1052-1059<br>క్రీ.శ. 1130-1137 | 14 | మహాదేవుడు | 1196-1199 |
| 12 | గణపతి | శా.శ 1059-1127<br>క్రీ.శ. 1137-1205 | 15 | గణపతి | 1199-1262 |
| 13 | రుద్రమదేవి | శా.శ. 1127-1205<br>క్రీ.శ. 1205-1283 | 16 | రుద్రమదేవి | 1262-1289 |
| 14 | ప్రతాపరుద్రుడు | శా.శ. 1205-1282<br>క్రీ.శ. 1283-1360 | 17 | ప్రతాపరుద్రుడు | 1289-1328 |

Dr. P. V. Parabrahma Sastry: The Kakatiyas of Warangal, Hyderabad, 1978 ఆధారంగా.

## అనుబంధం-11

### నామసూచి

### (రాజోద్యోగులు, ప్రసిద్ధ వ్యక్తులు)

## అనుబంధం-12

### స్థలనామసూచి